# పీఠిక

ఆంధ్రమహాశయులారా,

యావదాంధ్ర దేశమును, విద్యాసంస్థలును, నా ప్రథమ నవల యగు 'సువర్ణదుర్గము' పట్ల చూపిన ఆదరణ విశేషమే నన్ని ద్వితీయ నవలారచనకు ప్రోత్సహించినది. ఆంగ్లమున ఆంథోనీహోప్ రచించిన 'ఫ్రోసో' అను నొక కథను ఆధారముగా జేసుకొని నే నీ నవలను రచించితిని. ఇది కేవలము భాషాంతరీకరణము కాదు. ఆదినుండి యంతము వఱకును కథాభాగమును దేశీయ వాతావరణమునకు అనుసంధింప జేసి సర్వస్వాతంత్ర్యము వహించి వ్రాసితిని. ఇందలి గుణాగుణములు రసజ్ఞులగు పాఠకులకు సువేద్యములు కాగలవని భావించుచు ఈ గ్రంథమును ఆంధ్రభారతి కర్పించుచున్నాను.

ఇట్లు

విద్వజ్జన విధేయుడు

ఛత్రపురము
20 – 9 – '56

గుండిమెడ వేంకట సుబ్బారావు



శ్రీ గుండిమెడ వేంకట సుబ్బారావు, B. A., B. Ed.

గ్రంథకర్త

## అ ధ్యా య ము 1

నలువైపులను బహుయోజన విస్తీర్ణమైన మహా సముద్రము. అచ్చట కతిసమీపమున నున్న భూభాగము సుమారు ఏడు దినముల నౌకాప్రయాణము. అంత దూరము నందున్న ప్రభుత్వమునకు ఆ ద్వీపముపైనున్న యధికారము కేవలము నామమాత్రకము. సంవత్సరమున కొకసారి ప్రభుత్వాధికారి యచ్చటకు బోయి అధికారముద్ర చెదర కుండ చూచివచ్చుచుండెను. కేవలము అధినేతగా ఆ ద్వీపాధిపతినుండి కప్పము గ్రహించుటతప్ప ప్రభుత్వ మున కా ద్వీపముతో అన్యసంబంధము లేదు.

హంసద్వీపమున కా పే రెట్లు వచ్చినదో తెలియదు. కాని, ఆ ప్రాంతమున బోవు నావికులకు దూరమునుండి యా ద్వీప మొక పెద్ద హంసయాకారమున కన్పట్టుచుండుట మాత్రము వాస్తవము. తీరప్రదేశ మంతయు ఫలవృక్ష మయములైన చిన్నచిన్న గుట్టలు. పోను పోను మధ్య ప్రదేశ మంతయు గృహారామశోభిత మైన యొక మెట్ట భూమి. తీరమునుండి తీరమునకు పొడవు సుమా రెనిమిది మైళ్ళు, వెడల్పు సుమా రైదు మైళ్ళు. ఆ సుందర ద్వీపమును జూచినచో లావణ్యరాశియైన ప్రకృతిదేవత తన యమూ ల్యాభరణసంపత్తి నంతయు బాహ్యజగతికి కానరాకుండ

ఆ సముద్రమధ్యమున సురక్షితముగ దాచుకొనెనేమో యని తోచక మానదు.

అచ్చటి జనసముదాయ మంతయు ఒకే యొక పెద్ద కుటుంబ మని చెప్పనగును. ద్వీప మంతయు తమ సొత్తనియు, అన్యాక్రాంతము కానేరని తమ యవిభక్త సాముదాయక స్థిరాస్తి యనియు ఆ ద్వీపవాసుల నిశ్చితాభిప్రాయము. వంశానుక్రమముగ ద్వీపాధిపత్యము చేయుచున్న రాజ కుటుంబముపట్ల అత్యంత భక్తిభావము కల్గి ప్రజాసంఘము సుఖసంపదలతో విలసిల్లు చుండెను. దేనినైనను ఆ ద్వీప వాసులు సహింపగలరు కాని, తమ ద్వీపము పరాధీన మగుటను మాత్రము సహింపరు. అట్టి పరిస్థితి యొకసారి అప్పటికి రెండు శతాబ్దముల పూర్వము సంభవించి యుండెను. అప్పటి ద్వీపాధిపతి కారణాంతరములచే ఆ ద్వీపమును ఒక విదేశీయునకు విక్రయించగా, ఆ విషయము తెలిసి ప్రజానీకము అట్టుడికిన ట్లుడికి, అమ్మిన యా యధిపతిని, కొన్న యా విదేశీ యుని గూడ, జాడయైన కానరాకుండ మాయము చేసి వైచిరట! ఆ యధిపతి సంతానమే యీనా డా ద్వీపమును పాలించుచున్నది. ఆనాటి ప్రజల సంతానములే యీ నా డా ద్వీపమునందు నడయాడుచున్నవి. ప్రభుభక్తి యెంత యున్నదో యంతకు వేయిరెట్లు దేశభక్తి!

ఏవైపు జూచినను అనంతమైన మహా సముద్రము! ఆ ద్వీపమునం దేమి జరుగుచున్నను దూరమునం దున్న ప్రభుత్వాధికారులకు వార్త తెలియదు. నౌకాయాత్రికుల ద్వారా ఆ ద్వీప సమాచారము లేమైన బాహ్య ప్రపంచ

మునకు దెలియగలవేమో యనిన, ఏ నౌకామార్గమును ఆ ద్వీపమునకు సమీపమున బోవదు. అట్టి యా హంసద్వీపమునందు రెండు వందల యేండ్లకు బూర్వము సంభవించిన దుర్ఘటనమే మరియొకసారి సంభవించినది.

ద్వీపాధిపతియైన ఇంద్రవర్మ సహజముగ నత్యంత సాధుస్వభావుడు. ఏకైక పుత్రుడు దుస్సహవాసము జేసి, దురభ్యాసములకు లోనై, నిరంతర దేశసంచారియై, తుదకు ఏ విదేశమునందో దిక్కుమాలిన చావు చచ్చెను. కాని, వానిమూలమున పాపము, ఇంద్రవర్మ విశేష ఋణగ్రస్తుడై మంచము పట్టెను. ఋణము తీరు నుపాయము గానక, చివరకు తన జమీా యైన యా ద్వీపమును విక్రయించుటకు నిశ్చయించుకొనెను. కాని, తా నా ద్వీపమును విక్రయింపనున్నాడని తెలిసినచో ప్రజలు సహింప రని యాతనికి దెలియును. వ్యవహార మంతయు రహస్యముగ సాగించి యెట్టకేలకు జీవన్‌లాల్ అను నొక యుత్తరదేశస్థునకు దానిని విక్రయించివైచెను. వ్రాతకోత లన్నియు మధ్యవర్తుల పర్యవేక్షణమున పూర్తి యయ్యెను. ఆ ద్వీపముపై శాసనాధికారము గల 'గోవా' ప్రభుత్వమునకు యథావిధిగా తెలియజేయబడెను. ఆ ప్రభుత్వము ఆ వ్యవహారము నంగీకరించి ద్వీపాధిపత్యమును జీవన్‌లాల్ పేర స్థిరపఱచెను. నిర్ణీతమైన మూల్యధనమునందు సగము తక్షణమే ఇంద్రవర్మ కందజేయబడెను. మిగిలిన సగము జీవన్‌లాల్ స్వయముగ తా నచ్చటకు బోవునప్పుడు చెల్లించుటకు నిశ్చయింపబడెను.

జీవన్ తండ్రి స్వరాష్ట్రమగు పంజాబ్ నుండి మహా రాష్ట్రమునకు తరలి వచ్చి, వ్యాపారము చేసి, విశేష ధన మార్జించి రాజధానియైన బొంబై నగరమునందు స్థిరాస్తి నెలకొల్పి మరణించెను. ఏకైక వారసుడైన జీవన్ తండ్రి మరణించునప్పటికి కేవలము బాలుడు. తల్లి యంతకుముందే మరణించెను. ఒక్క మేనత్త మాత్ర మాతని కనిపెట్టుకొని యుండెను. ధనమునకు కొఱతి లేదు. నాగరకసంఘమునందు ఉన్నతస్థాయికి యోగ్యమైన విద్యాబుద్ధు లార్జించెను. సహజసిద్ధములైన సాహసౌదార్యాది లక్షణములును, ఆకర్ష ణీయమైన శరీర సౌష్టవమును, త్రినేత్రునైన లక్ష్యముచేయని నవయౌవనమును అతనికి పెట్టని యలంకారములై యుండెను. ధనాభావము లేని విశృంఖల నాగరక యువకు డగుటచే విశేష ముగ స్వదేశ విదేశ సంచార మొనర్చి, యనేక భాషల నేర్చి యుండెను. బాల్యమునుండియు నాతనికి నాగరక జగతికి దూరముగా నేదైన నొక ద్వీపమునందు నివసింప గోర్కె యుండెను. ఆ కోర్కె తీరు నవకాశము ఇంతకాలమునకు లభించుటచే ఉత్సాహభరితుడై యాతడు హంసద్వీపమును కొనివైచెను.

తాను స్వయముగ నా ద్వీపమునకు బోయి శేషించిన క్రయధనమును చెల్లించి ద్వీపాధిపత్యమును కైవసము చేసి కొన నిశ్చయించిన దినము అప్పటికి సమానముగ రెండు వారములు మాత్రమే యున్నది. ఆ దిన మెంత శీఘ్రముగ వచ్చునా యని యాతడు కుతూహలపడుచుండెను. తనతో కూడ నిన బాల్యమిత్రుడైన శంకర్ దేవ్ వచ్చుట కుత్సాహ పడు

టచే ఆతనిగూడ దోడ్కొనిపోవుటకు నిశ్చయించుకొనెను. కేవలము పటమునందు తప్ప ఆ ద్వీపమును తా నింతకు ముందు చూచి యెరుగడు. అచ్చటకు బోవుటకు ప్రసిద్ధమైన సముద్రమార్గ మేదియు లేదు. ఆ కారణముచే, ఆ ప్రాంత మున నౌకాసంచారము లనేకములు చేసి, కొంచెము సముద్రానుభవము గడించిన బాజీ యను నౌక మిత్రుని సహితము తోడ్కొనిపోవుటకు నిర్ణయించుకొనెను.

అది పున్నమరాత్రి. బొంబై రాజవీధుల యందలి మహాసౌధములందు వశించు నాగరకులకు పున్నమెప్పుడో అమావాస్య యెప్పుడో తెలియదు. సుమారు పదిగంట లైనది. మేడమీది వసారాయందలి సోఫాపై సుఖాసీనుడై జీవన్ చంద్రకళాశోభితమై యున్న ఆకాశసముద్రము నందు హంసద్వీపమును జూచుచు మైమఱచి యుండెను. ఇంతలో శంకర్ అచ్చటకు వచ్చి యాతనికి స్వప్నభంగ మొనర్చెను.

"శంకర్! వచ్చితివా! నీ కొఱకే చూచుచున్నాను. రమ్ము సముద్రతీరమునకు బోయి వత్తము" అని లేచెను.

పిమ్మట ఇరువురును సరాసరి సముద్రతీరమునకు బోయి యొక వేదికపై నాసీనులైరి.

జీవన్:— శంకర్! అనంతమైన యీ మహాసాగరమును చూడుము. ఇది ఒక్క ప్రక్క నున్నంత మాత్రము ననే యీ భూ భాగమున కింత యందము కల్గినది. ఇంక అన్నివైపుల నిదే యున్నచో ఆ భూ ప్రదేశ మెంత మనోహరముగ నుండునో యూహింపుము.

శంకర్:— నీలాకాశ మధ్యమునందు ప్రకాశించుచున్న ఆపూర్ణచంద్రమండలము వలె నుండును. ఏమి! నా వర్ణన మెట్లున్నది?

జీవన్:— కాళిదాసును మరపించుచున్నది.

శంకర్:— అందు, హంసద్వీపము! పేరునకు తగిన ద్వీపమేమై యుండవలయును.

జీవన్:— ఎట్లుండినను అది యిప్పుడు మన హంస కదా!

ఈ మాటలనుచుండగనే బలిష్ఠకాయుడును, ఆజానుబాహుడును అగు నొక యువకుడు ఒక యువతీసమేతముగ తమ ప్రక్కనుండియే పోయి యా చెంతనున్న వేదికపై నాసీనులైరి. శంకర్ జీవనుల యా స్వల్ప సంభాషణము పూర్తిగ వారి కర్ణముల బడియుండు ననుటకు సందేహము లేదు. ఆ వెన్నెలరాత్రి నెందఱో యా ప్రదేశమునకు వచ్చుచుండుటచే వారి రాక మన మిత్రుల కేమియు వింత కలిగింపలేదు. కాని, ఆ యువకుని గమన వైఖరియు గంభీరాకృతియు, ఆ యువతి ముఖ విలాసమును, ఆ పండు వెన్నెలయందు విస్పష్టముగ వారి దృష్టి నాకర్షించెను. కాని, కేవలము క్షణమాత్రమే. తిరిగి వారు తమ సంభాషణమును ప్రారంభించిరి.

శంకర్:— ఆ హంస సగము మాత్రమే యిప్పటికి మనది. మన మచ్చటకు పోయినపిమ్మట కదా అది పూర్తిగ మన దగును.

జీవన్ :— అగును. ఏమో! చేతనున్న కబళము నోట పడు వరకు అనుమానమే. రెండు శతాబ్దములకు పూర్వము ఆ ద్వీపమునం దట్టిది జరిగిన దని విని యుంటిని. దాని విక్రేతయు గృహీతయు కూడ జాడలేకుండ మాయమై పోయిరట! కాని, అది యెప్పటికథయో! ఇప్పు డట్టి సంఘటనముల కవకాశము లేదు.

శంకర్ :— ఏమైనను, మన మన్నిటికిని సిద్ధపడి యుండవలెను కదా! మనతో నింక నెవ్వరు వత్తురు ?

జీవన్ :— ఒక్క సేవకుడు. బహుకాలమై మా యింట బరిచర్య చేయుచున్న గోపీ. కార్యక్రమమంతయు స్థిరపఱచితిని. నేడు గురువారము. పై గురువారమునాటికి మనము గోవా రేవును చేరవలయును. అచ్చట ప్రయాణ సన్నాహ మంతయు పూర్తి చేసికొని, నౌకను సిద్ధపఱచి, బాజీ మనకొఱకు వేచుకొని యుండును. ఆతని కలసికొని వెంటనే మనము గోవానుండి బయలుదేర వలయును. అచ్చటనుండి మన ద్వీపమునకు ఏడు దినముల నౌకా ప్రయాణము. ఆ మీఁది గురువారము నాటికి మనము హంసద్వీపమును చేరగలము. పూర్వ నిర్ణయానుసారము నే నచ్చటకు వచ్చెద నన్న దిన మదియే.

ఈ సంభాషణమంతయు ప్రక్క వేదికపై నున్న యువకు డత్యంత శ్రద్ధతో నాలించుచుండెను. ఈ విషయము జీవన్ పహితము గమనించుచుండెను. నిశ్శబ్దముగ గూరుచుండి

తమవైపు ఓరచూపుల జూచుచుండుట, ఉండుండి యేదో యస్పష్టవాక్య మొకటి యా యువతి చెవిని వైచుచుండుట, ఆ యువతి యేదో చెప్పబోవగా చిన్న హుంకారముతో వారించుట, జీవన్ కనిపెట్టుచునే యుండెను. తమ సంభాషణమునందు ఆతడంతి శ్రద్ధవహించుట కేదో విశేషకారణ ముండుననని యాతడు భావించినను, అందేమియు రహస్యము లేకపోవుటచే నిశ్శంకముగ నుండెను. కాని, ఏదో యొక సందర్భమున ఆ యువకుని రహస్యఘోరణి నాపి ఆ యువతి తీవ్రముగ, "నేనుకూడ వచ్చెదను" అని మళయాళ భాషలో అవరుద్ధ కంఠమున పలికి తన చేతిని పైకెత్తి వ్రేలినున్న యుంగరము నాతనికి జూపుట జీవన్ స్పష్టముగ గమనించెను. కాని, దాని యంతరార్థ మప్పు డాతనికి తెలియలేదు.

తరువాత మరికొంతకాలము జీవన్ శంకరులు తమ ప్రయాణసంబంధములగు విషయములనుగూర్చి ముచ్చటించుకొనిరి. అంతకాలమును ఆ యువతీయువకు లచ్చటనే కూర్చుండి యుండిరి. అర్ధరాత్రము గడచిపోయినది. ఇంతలో మరియొక జట్టు అచ్చటకు వచ్చి ఆ యువకుని పలుకరించిరి.

"రండు. ఈ వేదికపై గూర్చుండుడు. మేము పోయెదము" అని ఆ యువకుడు యువతీసహితముగ లేచి యా స్థలమును విడచిపోయెను. ఆ వచ్చిన జట్టులో జీవన్ పరిచితు డొకడుండెను. జీవన్ ఆతని బిలచి, "ఓయీ, ఆ యువతీయువకు లెవ్వరో నీకు తెలియునా?" అని యడిగెను. అంత నాతడు, "జీవన్! ఆ యువతి యెవరో నాకు తెలియదు.

కాని, ఆ యువకుడుమాత్రము ఈ నగరమునందలి జూద గాండ్ర కందరకును చిరపరిచితుడు."

"వీని పేరు ?"

"పూర్తిపేరు తెలియదు. అందరును 'మన్నా' అని పిలుచుచుందురు.

"నివాసము ?"

"ఇచ్చటకు బహుదూరమునం దున్న ఏదో యొక ద్వీపమట! పెద్ద జూదరి. వీనికి నీవెంత దూరముగానున్న అంత మంచిది. పరమ దుర్మార్గుడు."

"సంతోషము. చాల రాత్రి యైనది. ఇంక మేము పోయెదము" అని లేచి జీవన్ శంకర్ సహితముగ గృహోన్ముఖు డయ్యెను. తమ సంభాషణమునందు ఆ యువకున కంత శ్రద్ధ యేల కలిగెనో యిప్పు డాతనికి సుగోచర మయ్యెను.

"ఆతని నివాసమైన యా దూరద్వీపము తప్పక హంసద్వీపమే యై యుండును. కాని, ఆ ద్వీపమున కింక నేనే యధిపతిని కానున్నానని తెలిసియు ఆత డేల నాయొద్దకు వచ్చి పరిచయము చేసికొనలేదు ? ఆ యువతి యెవరు ? 'నేనుకూడ వచ్చెదను' అని బింకముగ చెప్పుచు వ్రేలి నున్న యుంగరము నెత్తి యాతనికి జూపుటయందు గల యర్థ మేమి ?" పరంపరాగతము లగుచున్న యీ సమస్యలను తనలో తాను వితర్కించుకొనుచు జీవన్ గృహము చేరెను. ఆ రాత్రి శంకర్ సహిత మచ్చటనే విశ్రమించెను.

# అ ధ్యా య ము 2

మరుసటి గురువారమునాటికి తగినంత ఆహారవస్తు సంభారముతో, అవశ్యకమని తోచిన సర్వసామగ్రితో, ముఖ్యముగ ఆత్మరక్షణకు వలయు ఆయుధబలముతో జీవన్‌లాల్ శంకర్ గోపీసమేతముగ గోవారేవును చేరుకొనెను. అచ్చట నౌకాప్రయాణమున కంతయు సిద్ధము జేసి వారికై వేచుకొని యున్న బాజీ వారిని కలుసుకొనెను. గోవాయందు భోజనాదికము లొనర్చి, ఇంక వృథా కాలయాపనము జేయక ప్రయాణోన్ముఖులై అందరును నౌకారోహణ మొనర్చిరి. అదృష్టవశమున ఆ నౌక హంస ద్వీపమునకు చెందినదే. కార్యాంతరముపై గోవా వచ్చి తిరుగు ముఖము పట్టుచున్నవేళ అది బాజీకి చిక్కెను. బలిష్ఠకాయులగు నిద్దఱు నావికులు దానిని నడపుచుండిరి. ఇంకపై తన ప్రజలు కానున్న ద్వీపవాసులలో ప్రథమమున జీవన్ కంట బడినవారు వీరిద్దఱే. వీరివలన ఆ ద్వీప విశేషము లేమైన తెలిసికొనవచ్చునని ఆతడు వారి నీ క్రింది సంభాషణములోనికి దింపెను.

జీవన్:- మీరు హంసద్వీప నివాసులా?

వారు:- అగును.

జీవన్:- మీ పేర్లు?

ఒకడు:- నాపేరు 'కాశీ'. వీడు నా తమ్ముడు 'బదరీ'.

జీవన్:- పేర్లు చాల చక్కగా నున్నవి. అచ్చట మీరేమి చేయుచుందురు?

కాశీ:- ప్రభువును సేవించుకొనుచుందుము. మా తాత ముత్తాతల నుండి మా కిదే వృత్తి.

జీవన్:- సంతోషము. మీ ప్రభువు ఇంద్రవర్మకు, పాపము పుత్రశోకము సంభవించినదట కాదా?

కాశీ:- అగును. ఒక్కడే కుమారుడు. పాపము, ఎక్కడో విదేశమునందు చనిపోయినాడు. ఇంక సంతానము లేదు. తమ్ముడు మరణించినాడు. అతని ఏకపుత్రిక రత్నమాలాదేవియే యింక నీ ద్వీపమునకు వారసురాలు.

జీవన్:- అట్లనా! ఈ ద్వీపమునందు 'మన్నా' అను వ్యక్తి యొకరు కలరని వినియుంటిమి. ఆత డెవరు?

కాశీ:- మన్నా రత్నమాలాదేవికి మేనత్తకుమారుడు.

జీవన్:- ఆత డిప్పు డచ్చట నున్నాడా ?

కాశీ:- లేరు. ఆయన సదా విదేశములందే యుండును. ఆతని యునికి యెవ్వరికిని తెలియదు.

బదరీ:- చాల దినములైనది. ఆతని ముఖమే మా దీవియందు కనబడదు.

ఈ సంభాషణము నడచుచున్నంత కాలమును, ఆ నావికుల ముఖములందేవో వికృతలక్షణములు జీవన్‌కు పొడగట్టుచునే యుండెను. వారు పూర్తిగ విశ్వసింపదగిన వారు కారేమో యను సందేహము సహిత మాతనికి తొలకరించెను. కాని, అఖండ ధైర్యశాలి యగు నాతని హృదయము మాత్రము లేశమైనను చలింపలేదు.

నౌక నిరాఘాటముగ సాగిపోవుచుండెను. ఎట్టి యంత రాయములును కలుగలేదు. పైన నిర్మేఘమైన అనంతాకాశము. నలువైపులను నిశ్శబ్దమై దిశాంతవ్యాప్తమై యున్న మహాసముద్రము. ఓడయందు భోజన విశ్రామ విహారాదికములకు వలసిన సదుపాయము లన్నియు కలవు. పగటి వెనుక రాత్రియు, రాత్రివెనుక పగలును గడచిపోవుచున్నవి. నౌక యెటు పోవుచున్నదో నడపుచున్న యా నావికు లిద్దఱకే తెలియును. ఏడవ రాత్రి గడచిపోయినది. సూర్యోదయమై సముద్రమంతయు స్వర్ణప్రభాసముజ్జ్వలమై కన్నులు మిఱుమిట్లు గొల్పుచుండెను. పశ్చిమాభిముఖముగ నౌక పోవుచుండెను. ఆనాడు గురువారము. గమ్యస్థానము చేరు దినము. క్షణక్షణమును జీవన్‌లాల్ ఉత్సాహ మధిక మగుచుండెను. ఏ క్షణమున హంసద్వీపము కంటబడునో యని యందఱును తెప్పవాల్చక చూచుచుండిరి. గంటలు గడచిపోవుచుండెను. మధ్యాహ్నము గడచిపోయెను. సూర్యాస్తమయము సమీపించుచుండెను. ద్వీపపు జాడ యేమియు పొడగట్టుటలేదు. జీవన్ మానసమున వింత వింత భావము లుత్పన్నము లగుచుండెను. ఆ నావికులు తమ్ము మోసము చేయుచున్నారా యను సందేహ మంతకంతకు నధికము కాజొచ్చెను. ఇంతలో బహువర్ణ రంజితమైన పశ్చిమాకాశము నానుకొని హంసాకారమున నున్న యొక చిన్న మబ్బువలె నొక సుందరదృశ్యము వారికి దృష్టిగోచర మయ్యెను. జీవన్ హృదయమునందు అంధకారమున మెరపు మెరసినట్లయ్యెను. “అదే హంసద్వీపము !

హంసాకారమున గోచరించుచున్నది! నిశ్చయముగ సార్థక నామమే, శంకర్! కాశీ! అదియేనా మన ద్వీపము?" అని ప్రశ్నించెను.

"చిత్తము. ఇంక సుమారొక గంటలో మన మచ్చట చేరగలము." అని కాశీ తలవంచుకొనియే బదులు పలికెను. మహోత్సాహముతో ఆ పరివార మంతయు కలకల లాడు చుండిరి. సూర్యాస్తమయ మయ్యెను. సహస్ర బాహువులు చాచి ప్రకృతిదేవత తమ్మాహ్వానించుచున్న దేమో యనునట్లు తీరప్రదేశము గోచరించుచుండెను. ఫల వృక్ష సంకులములైన చిన్నచిన్న గుట్టల గుములు చూపుమేర దూరము తీరము నానుకొని యుండెను. హంసపీఠిక వలె సమున్నత మైన మధ్యభాగ మంతయు మహావృక్ష సంకీర్ణమైన యొక పర్వతము. ఆ పర్వత సానువునందు పెద్ద పురాతన భవన మొకటి దృగ్గోచర మగుచుండెను. తీరమునుండి మధ్య భాగమునకు మెలికలు మెలికలుగా పోవుచున్న మార్గము లన్నియు గిరి శిఖరమునుండి సముద్రాభిముఖములై అన్ని వైపులకును ప్రవహించుచున్న సెలయేళ్ళవలె దూరమునుండి గోచరించుచుండెను. ప్రకృతి సౌందర్య మంతయు నచ్చట కుప్పవోసిన ట్లుండెను. చూచుచుండగనే నౌక తీరము నందలి నౌకాశ్రయమును జేరెను. అందఱును నౌకనుండి దిగిరి. సమస్త సామగ్రియు తీరముపై దింపబడెను.

అనేకులు స్త్రీ పురుషులు, బాల బాలికలు, ఈ నూతన నాగంతుకుల జూచుటకు అచ్చట గుమికూడుచుండిరి. కాని, అం దెవ్వరును వారిచెంతకు రాలేదు. ఎవ్వరును వారిని

పలుకరింపలేదు. ఏవో వింత జంతువులను చూచుచున్నట్లు చూచుచు నిలువబడిరి. ఆ జనసమూహామునందు ద్వీపాధిపతియైన ఇంద్రవర్మ కానరాలేదు. ఆతడు వచ్చి తన్ను అభ్యుద్ధానము చేయునని జీవన్ భావించి యుండెను. అట్టి చిహ్నమేదియు కానరాలేదు. మహాకాయుడును, లంబోదరుడును, భయంకరవదనుడును అయిన యొక వ్యక్తి మాత్రము అచ్చట కోరమీసములు త్రిప్పుకొనుచు కొంత పెద్దరికము చూపుచుండెను. జీవన్‌లాల్ అతని యొద్దకు బోయి, సగౌరవముగ, "అయ్యా! ఇచ్చట నేదైన నొక సత్రము కలదా?" అని యడిగెను.

ఆ వ్యక్తి మిడిగ్రుడ్లతో నందరివైపును తేరిచూచి, "మీరు హంసద్వీపమును జూడవచ్చినారా?" అని ప్రశ్నించెను.

"కాదు. నే నీ ద్వీపమును కొంటిని. అధికారము స్వీకరించుటకై వచ్చితిని." అని ధైర్యముతో బదులు పల్కెను.

క్షణమాత్రము ఆ జనసమ్మర్దము నిశ్శబ్దమయ్యెను. పిమ్మట జీవన్, "ఇంక మనమందరమును అన్యోన్యత గలిగి యానందముగ జీవింతము" అని మందహాసము చేసెను. అంతయు నిశ్శబ్దము. అందరును రెప్పవేయక చూచుచుండిరే కాని యెవ్వరినోటను మాటలేదు. ఆ మహాకాయుడు మాత్రము క్షణమాత్ర మూరకుండి పిమ్మట, "రండు. ఈ సమీపమునందే నా సత్రమున్నది. అచ్చటకు తీసికొని పోయెదను రండు." అని దారితీసెను. వారు నలుగురును తమతమ సామగ్రిని చేతబట్టుకొని వానివెంట

నడువసాగిరి. ప్రజాసమూహ మంతయు భావశూన్యములైన ముఖములతో శూన్యదృష్టులతో వారివైపు జూచుచుండిరి. పర్వతమార్గమువలె నున్న ఆ యెగుడుదారిని ఆ స్థూల కాయుడు వారిని వెంటగొనిపోయి, ఒక మేడయింటికడ నాపి, "ఇదియే నా సత్రము. లోనికి రండు" అని సరాసరి మేడమీదికి దోడ్కొనిపోయి, అం దొక పెద్ద గదియందు దింపెను. దాని గవాక్షమునుండి క్రింద రాజమార్గ మంతయు చాల దూరమువరకు కానబడుచుండెను. ఆ గదియొక్క కవాటద్వారములును, గవాక్షమున గల లోహదంతము లును చూచినచో, ఆ గృహము చోరుల కభేద్యమైన ధనా గారమో లేక ఖైదీలను బంధించు కారాగారమో యై యుండు నని తోచును.

చిరునవ్వుతో జీవన్, "అయ్యా! ఇచ్చటి గృహము లన్నియు నిదేమాదిరియా?" అని ప్రశ్నించెను.

"అగును. ఈ ద్వీపమునందలి ప్రజలు తమ స్వత్వ ములను అతిభద్రముగా కాపాడుకొందురు." అని యాతడు వికటహాసము చేసెను.

"అయ్యా! మా నలుగురకు ఈ రాత్రి భోజన సదుపాయ మేమైన చేయించగలరా?" అని జీవన్ అడుగగా నాతడు, "చేయించెదను. మీ భోజన మిచ్చటకే వచ్చును. కొంచె మాగుడు" అని గది విడిచి పోయెను. పిమ్మట గోపీ తమ వస్తుసంచయ మంతయు నా గదియం దమర్చుచుండగా తక్కిన ముగ్గురును ఇట్లు ముచ్చటించు కొనసాగిరి.

జీవన్ :— కథ అడ్డముగా తిరుగుచున్నట్లున్నది.

శంకర్ :— మన మీ దినమున నిచ్చటకు వచ్చుచున్నామను విషయము ఈ ద్వీపాధిపతికి తెలియదా?

జీవన్ :— తెలియ కేమి?

శంకర్ :— అయిన నాతని జాడయే కానరాకున్న దేమి? ఈ ద్వీపమునకు అధికారులమై మనము వచ్చుట యేమి, ఇచ్చటి ప్రజలు మన కిప్పుడు చూపిన యీ మర్యాద యేమి! అంతయు నాకు విపరీతముగా కన్పడుచున్నది.

జీవన్ :— అట్లే కన్పడుచున్నది. ఇచ్చట రెండు శతాబ్దము లకు పూర్వము జరిగిన కథ తిరిగి యిప్పుడు జరుగ నున్న దేమో! ఏ మందువు బాజీ?

బాజీ :— అట్లే నాకు తోచుచున్నది. కానిండు, ఏ మగునో చూతము.

జీవన్ :— శంకర్! మన ధైర్యసాహసములకు పరీక్షా సమ యము వచ్చినట్లున్నది.

శంకర్ :— రానిమ్ము. రానే వచ్చితిమి కదా! ఇంక తప్పించు కొనిపోవు నుపాయముకూడ లేదుకదా! ఏమి జరుగునో జరుగనిమ్ము. దేనికైనను నేను సిద్ధముగ నున్నాను.

జీవన్ :— (మందహాసము చేయుచు) అందుకే కదా నేను నిన్ను తోడ్కొని వచ్చితిని. ఎందుకైనను మంచిది,

గోపీ, ఈ పాకలయందు తుపాకులు సంధించి సిద్ధముగ నుంచుము. మన నలుగురకును ఇంక గావలసినంత పని యున్నది.

అని యనుచుండగనే తలుపు తెఱచుకొని భోజన సామగ్రితో నొక సేవకుడు ప్రవేశించి దానిని వారి కప్పగించి, తిరిగి తలుపు వైచుకొని పోయెను. చిత్తములు సందేహాయత్తము లగుటచే నలుగురును ఆహారపదార్థములను యథాయోగ్యముగ పరీక్షించి; తదుపరి భోజనము లొనర్చి, అనంతరము విశ్రాంతికూడ తీసికొన నొల్లక ద్వీపాధిపతి యైన ఇంద్రవర్మను చూడ నిశ్చయించుకొనిరి. అప్పటికి రాత్రి తొమ్మిది గంట లైనది. గోపీని గదియందు కాపుండు మని చెప్పి, పిస్తోలులను జేబులయం దిడుకొని ముప్వురును గదిద్వారముకడకు వచ్చిరి. శంకర్ తలుపు తెఱువబోయెను. కాని, తలుపు తెఱువబడలేదు. ముప్వురును ఎంత ప్రయత్నించినను తెఱువబడలేదు. ద్వారము బయట బంధింపబడినది. ముప్వురు మిత్రులును పకాలున నవ్వసాగిరి.

శంకర్:- బలే! బలే! నాటకము ప్రారంభమైనది! బోనులో చిక్కుపడిన యెలుకలకును మనకును భేద మేమి జీవన్?

జీవన్:- (పెద్ద నిట్టూర్పు విడచి) శంకర్! బాజీ! మన ధైర్యసాహసములకే కాదు, మన బుద్ధికౌశలమునకు గూడ పరీక్షాసమయము వచ్చినది. మనల నిచ్చట బంధించి, వారు ద్వీపాధిపతియొద్దకు పోయి

యుందురు. త్వరలోనే తిరిగి వచ్చెదరు. ఆపై నేమి జరుగునో చూతము.

ముప్వురును నేల చతికిలపడిరి. గోపీ యొకమూల కూలబడెను. ఉండుండి బాజీ గవాక్షమునొద్దకు బోయి చూచుచుండెను. అట్లు సుమారు రెండుగంటలు గడచెను. పిమ్మట నొక పెద్ద కలకలము వినవచ్చెను. అందరును గవాక్షముకడకు పోయిరి. సుమారు మూడువందల ప్రజ వాద్యఘోషములతో ఏదో వీరగీతమును వీరావేశమున ఏకగ్రీవముగ పాడుకొనుచు హుంకారములతో ఝుంకారములతో నా రాజమార్గమున దిగుచుండిరి. సుమారొక నూరుదీపముల నెత్తిపట్టి యా జనసంఘము రాజవీధిను త్తేజిత మొనర్చుచుండిరి. వచ్చివచ్చి ఆ ప్రజావాహిని ఒక పెద్ద విజయఘోష మొనర్చి యా సత్రము ముంగిట నాగెను.

"దీని యర్థమేమి ?" అని శంకర్ ప్రశ్నించెను.

"స్పష్టమే కదా ! ఈ ద్వీపవాసులు తమ ద్వీపమును అన్యాక్రాంతము కానీయరు. రెండు శతాబ్దములక్రిందట ఇచ్చట జరిగిన నాటకమునకు పునఃప్రదర్శన మిది ! ఇదియే దానికి నాంది. నాటకమంతయు ముందే యున్నది ! మన మీ ద్వీపమున నిస్సహాయులము. ప్రస్తుతము బందీకృతులము. వీరిపై శాసనాధికారము గల ప్రభుత్వము మన కండుబాటులో లేదు. ఇంక మనము చేయునదేమి ?"

అని జీవన్ పెద్ద నిట్టూర్పు విడచి, "ఏమైనను సరే. ఈ ద్వీపవాసులకు మనము తల యొగ్గము. దైవమే మనకు

తోడు." అని బింకముగ పల్కెను. ఇంతలో గదికి బయట బిగించబడిన గడియలు విడి తలుపులు తెఱువబడెను. పదునై దేండ్ల బాలుడొకడు లోన ప్రవేశించి, "అయ్యా! సత్రాధికారి వర్ధన్ మిమ్ము తక్షణమే మేడ దిగిరమ్మని యాజ్ఞాపించినాడు." అని పలికెను. మాఱు పలుకక పిస్తోలులను జేబులయందు భద్రపరచుకొని, వారు నల్గురును బాలునివెంట మేడ దిగి వీధిద్వారముకడకు వచ్చిరి. ఎదుట ప్రజాసమూహమంతయు క్రిక్కిరిసి యర్ధచంద్రాకారముగ నిలచి యుండెను. వారిముందు వర్ధన్ ఎడమచేత మీసములు మెలివైచుచు ఉగ్రాకారుడై నిలచి యుండెను. ద్వారమునందు వీరిని చూడగనే యాతడు నిశ్శబ్దముగ నుండుడని యా జనసమ్మర్దమును హెచ్చరించి, జీవన్‌తో, "ఓయీ, పరివారసహితముగ తక్షణమే నీవీ ద్వీపమును విడచిపోవలయు నని మా రాణి రత్నమాలాదేవి ఆజ్ఞ. నిరపాయముగ మీరు తిరిగి పోవగల్గినందుకు దేవుని భజించుకొనుచు పొండు."

"మీ ద్వీపాధిపతి యెచ్చట నున్నారు?"

"ఇంకను ద్వీపాధిపతి యెక్కడ! ఆతడు మరణించి వారము దినము లైనది."

"మరణించెనా?"

"అగును. ఇప్పుడు మా ద్వీపమునకు రాణి రత్నమాలాదేవి! ఆమె మిమ్ము మరలిపొమ్మని యాజ్ఞాపించుచున్నది."

" పాప మాతండు దేనివలన మరణించెను ?"

" ఒకానొక విషజ్వరము వచ్చినది."

" పాపము. ఆతని జూడఁగల్గుదునని యెంతో యాసించి యుంటిని."

" మా రాణీ ఆజ్ఞానుసారము తక్షణమే పోవకుంటివేని, తప్పక నీవు ఆతని జూడఁగల్గుదువు."

" మీ రాణీ యెవ్వరు ? ఈ ద్వీపమును ఇంద్రవర్మ యొద్దనుండి నేను కొంటిని. ఇంక దీనిపై నధికారము నాది."

వర్ధన్ కండ్లెఱ్ఱఁజేసి, "ఓయీ, అధిక ప్రసంగము చేయక తిన్నఁగ సపరివారముగ తీరమునొద్దకు పొమ్ము. అచ్చట మీకై నౌక వేచుకొని యున్నది. ఇప్పుడు అర్ధరాత్రి యైనది. సూర్యోదయమువరకు మీకు గడు వీయబడినది. ఆపై ఒక్క క్షణమైనను మీ రిచ్చట నుంటిరేని ఇంక మీ రీ ద్వీపము నుండి పోజాలరు. తెలిసికొని ప్రవర్తింపుడు" అని రివ్వున వెనుకకు తిరిగి యా సమస్త ప్రజాసంఘమును వెంటబెట్టుకొని యథాపూర్వముగ వీరావేశమున వాద్యఘోషములతో వచ్చినదారిని పోయెను. దృష్టిగోచర మైనంతవరకు వారిని జూచుచు నచ్చటనే నిలచి, పిమ్మట నలుగురును మేడపై కెక్కి తిరిగి తమ గదియందు ప్రవేశించిరి.

# అధ్యాయము 3

జీవన్ శరీరమునందలి రక్తమంతయు శిరస్సునకు ప్రవహించెను. శంకర్ శిరస్సునందలి రక్తమంతయు శరీరమునకు దిగజారిపోయెనేమో యనునట్లు ముఖము వెల్లనయ్యెను. బాజీ యీ లోకమునందుగాక యేదో మరొక లోకమునం దున్నట్లుండెను. గోపీ ముఖము వంచుకొని మూల గూర్చుండెను. కొంతసేపటివరకు నెవ్వరినోటను మాటలేదు. పిమ్మట జీవన్ మెల్లగా "శంకర్! నిన్ను నిష్కారణముగ దెచ్చి యీ విపత్తునందు బడవైచినందుకు చింతించుచున్నాను" అని ఖిన్నవదనుడై పల్కెను.

శంకర్:— (నవ్వుచు) జీవన్! ఆ చింత నీ కెంతమాత్రమును వలదు. ఏమి సంభవించినను సరే, నేను సిద్ధముగ నున్నాను. వారి యాజ్ఞానుసారము ఇచ్చటినుండి మరలిపోవుటకే నిశ్చయించుకొంటివా?

జీవన్:— (బింకముగ) అట్లైన్నటికిని జరుగదు శంకర్! నా ద్వీపమును నేను కైవసము చేసికొనితీరెదను.

బాజీ:— మనము నలుగురమే యీ ద్వీపమును స్వాధీనము చేసికొనలేముకదా! నాకొక యూహ తట్టుచున్నది. మేము ముగ్గురము నిచ్చటనే యుండెదము. నీవు ఆ నౌకపై గోవాకు పోయి ప్రభుత్వ సహాయము తోడ్కొనిరమ్ము.

జీవన్:— చక్కని యూహ! అట్లే చేయుదము. ఇంకను వారిచ్చిన గడువునకు కొంత వ్యవధి యున్నది కదా.

ఈలోపున ఈ ప్రదేశము నొకసారి చూచివత్తము రండు. రహస్యపరిశోధన కీ యంధకారమే మనకు ప్రయోజనకరము.

అందరును తమ తమ పిస్తోలులను జేబులయం దిడుకొని మేడగదికి తాళము వైచి క్రిందికి దిగి శిఖరాభిముఖముగా ఆ రాజమార్గమున నిశ్శబ్దముగ నడచి పోసాగిరి. కొంతదూరమువరకే మార్గమున కిరుప్రక్కల కొన్ని నివాసగృహములు కలవు. అటుపై అన్నియు చిన్న చిన్న గుట్టలు, గుట్టల నాశ్రయించుకొని యున్న తుప్పలు. మీదికి పోయి పోయి యా మార్గము చివర కొక మలుపు తిరిగెను. అచ్చటనుండి దూరమున నొక పెద్ద భవనము అస్పష్టముగ దృగ్గోచర మయ్యెను. "అదే యీ ద్వీపాధిపతి నివసించు రాజభవనమై యుండును" అని బాజీ మెల్లగ పల్కెను. జీవన్ ఉత్సాహా మధిక మయ్యెను. అత డేదియో యన బోవుచుండ బాజీ తటాలున ఆతని వారించి, "ఎవరో వచ్చుచున్నారు. తప్పుకొనుడు. నిశ్శబ్దముగ గుట్టల వెనుకకు తప్పుకొనుడు" అని హెచ్చరించెను. నలుగురును క్షణమాత్రమున ప్రక్కకుపోయి గుట్టల వెనుక దాగిరి. ఇంక రెండు నిముషములలో ఇద్దరు వ్యక్తులు లా దారిని బోయిరి. వారి సంభాషణమునందు అతి స్వల్పము మాత్రము వినవచ్చెను. మృదుమధురమైన స్త్రీకంఠమున, "వారు పోవుదురా?" అను ప్రశ్న వినవచ్చెను. "పోవకున్న ప్రజాగ్రహమున కాహుతియై పోవుదురు." అని యొక పురుష కంఠము బదులు పల్కెను. ఈ కంఠస్వరము విన్నంతనే

జీవన్‌లాల్ చకితుడయ్యెను. బొంబై సముద్రతీరమున జూచిన యువకుని కంఠస్వరమే యది! విస్పష్టముగ జీవన్ దానిని గుర్తించెను. ఆశ్వికు లిద్దఱును ఆ యంధకారమునం దదృశ్యులైరి. నలుగురు తిరిగి మార్గముపైకి వచ్చిరి. అంత రాత్రివేళ ఆ నిర్జనమార్గమున ఆ యాశ్వికుల యేకాంత విహారమున కర్థమేమి? మన్నా కంఠస్వరము రూఢి! ఆ స్త్రీ యెవరు? వారెచ్చటనుండి వచ్చుచు నెచ్చటికి బోవుచున్నారు? ఈ సమస్యాపరంపర జీవన్‌లాల్ మానసమునొకింత సచేతన మొనర్చెను. "సరియే, కాలక్రమమున అంతయు తెలియగలదు. ఇప్పుడా చిత్తక్షోభ మేల?" అని సరాసరి యా రాజభవనము చెంతకు నడచెను.

ఎచ్చటను దీపకాంతి లేదు. నరవాసన లేదు. ముందొక విశాలమైన యావరణము కలదు. తలుపులు తెఱచి యుండెను. అంతయు నిశ్శబ్దము. నలుగురును ఆ యావరణమునందు ప్రవేశించి వీధిమెట్లెక్కి వసారాపై నిలిచిరి. జీవన్ లోనికి తొంగిచూచెను. ఏమాత్రమును అలికిడి లేదు. భూతగృహమువలె అంధకారబంధురమై యుండెను. మహా సాహసి యగు జీవన్ క్షణమాత్రము పరికించి, "ఎవ్వరిచ్చట?" అని బిగ్గఱగ నరచెను. ప్రత్యుత్తరము లేదు. విశాలమైన యా గృహావరణమందలి ఱాతిగోడలు మాత్రము తన ప్రశ్ననే తిరిగి తన కప్పగించెను. "ఇందెవ్వరును లేరా?" బిగ్గఱగా ప్రశ్నించుచు నాతడు ముందరి చావడియందు ప్రవేశించెను. ఆతని వెనుక తక్కిన ముగ్గురును బ్రవేశించిరి.

"గోపీ! దీపము నొక్కసారి చూపుము."

చేతబట్టియున్న గుప్త దీపమును గోపీ యావిష్కరించెను. ఆ చావడి యత్యంత విశాలమై యున్నది. రెండు సోఫాలును, చెంత నొక పెద్ద పడక కుర్చీయు సమర్చబడి యున్నవి. జీవన్ తిన్నగ పోయి, "ఈ భవనమున కధిపతిని నేను!" అని నిర్ధారణచేయునట్లుగా ఆ కుర్చీపై సుఖాసీనుడయ్యెను.

"శంకర్! జేపటిమాట చూచుకొందము. ఈ శేష రాత్రి యంతయు నిచ్చటనే యుందము. ఇది మన భవనము కదా. ఈ సోఫాలపై కూర్చుండుడు." అని పకపక నవ్వెను.

ఇంతలో ఎచ్చటనుండియో ఒక పెద్ద మూలుగు వినవచ్చెను. అందరి దృష్టులును ఆ శబ్దము వచ్చినవైపు కేంద్రీకరించెను. మరియొకసారి యా మూలుగు మరికొంత దీర్ఘముగ వినవచ్చెను. తీవ్రబాధాసూచకమైన యార్త నాదమువలె నది పొడగట్టెను. జీవన్ తటాలున లేచి యా శబ్దము వచ్చుచున్న వైపునకు నడచెను. గోపీ దీపమును చూపుచుండెను. ఒక మూల మూయబడియున్న యొక ద్వారమునుండి యా మూలుగు విస్పష్టముగ వినవచ్చుచుండెను. తలుపు త్రోసుకొని జీవన్ లోన బ్రవేశించెను. అది మఱియొక విశాలమైన గది. దీపకాంతియందు ఆ గది చివరను ఒక మంచెముపై నొక యెఱ్ఱని కంబళిచే గప్పబడి ఒక వ్యక్తి ఇటునటు దొర్లుచు మూలుగుచుండుట దృష్టి గోచర మయ్యెను. ఆ మంచముచెంత నొక వృద్ధస్త్రీ

చేరబడి కునుకుచుండెను. ఆ దృశ్యమును జూచి నలుగురును వడివడిగా నచ్చటకు బోయిరి.

జీవన్ ఆ వృద్ధస్త్రీని తట్టి లేపెను. ఆమె తొట్రుపాటున లేచి, "ఎవరు మీరు?" అని గద్గదికతో ప్రశ్నించెను.

"నే నెవడనో ముందుముందు నీకు తెలియగలదు. ఈ బాధపడుచున్న వ్యక్తి యెవ్వరు?"

అంత నా వృద్ధవనిత భయాకులయై, "అయ్యలారా! తక్షణమే వెడలిపొండు. ఆతడు వచ్చినచో మీ ప్రాణములు మీకు దక్కవు."

"ఎవ రాతడు?"

"మన్నా. మన్నా."

"సరియే. ఈ బాధపడుచున్న వ్యక్తి యెవరు?"

"వీరు మా ప్రభువు ఇంద్రవర్మ. కత్తిపోటునకు గురియై ప్రాణాపాయమునం దున్నారు."

"ఈతని పొడిచిన దెవ్వరు?"

ఈ ప్రశ్న కామె ముఖము నిస్తేజ మయ్యెను. శూన్య దృష్టులతో నామె, "అయ్యా! అది నాకు తెలియదు. అది యొక మూకలో జరిగినది. వారికి భయపడి, వారి కోర్కెలకు, పాపము, మా ప్రభువు సమ్మతించెను. అయినను, ఎవ్వరో నిర్దాక్షిణ్యముగా ప్రక్కలో పొడిచివైచిరి. ఇంక నీతడు జీవించుట ...... దుస్సాధ్యము" అని భగ్నకంఠముతో మారుపల్కెను.

"నీ వెవ్వరవు?"

"నేను చిరకాలమునుండి యీ గృహమున సేవ చేయుచుండిన యొక దాసిని."

"దాసీ! ఈ ద్వీపముపై నిప్పు డధికారము నాది. నేను నిన్నాజ్ఞాపించుచున్నాను. జరిగిన దంతయు దాచక స్పష్టముగ చెప్పుము." అంత నామె జరిగిన దంతయు సవిస్తరముగ నిట్లు చెప్పదొడగెను.

"అయ్యా! ఒక పెద్ద ప్రజాసమూహమును వెంట బెట్టుకొని సింహానాదములు చేయు వర్ధన్ మా ప్రభువును సమీపించెను. ఆతనివెంట మన్నా సహిత ముండెను. ప్రజ లందరును ఆయుధములనుబట్టి యుండిరి. వర్ధన్ చేత నొక కాకిత పట్టుకొని దాపునకు వచ్చి, "అయ్యా! ఈ ద్వీపమును మీరు తనకు విక్రయించితిరని చెప్పుకొనుచు ఎవ్వరో విదేశీయు డొక డిచ్చుటకు వచ్చి యున్నాడు. మీరు విక్రయించినది సత్యమేనా?" అని యెలుగెత్తి ప్రశ్నించెను. అందుకు ప్రభువు, "సత్యమే, ఋణవిముక్తికై నా స్వత్వమైన దీనిని విక్రయించితిని" అని ధైర్యముగ ప్రత్యుత్తర మిచ్చెను. అంత వర్ధన్, "ఈ క్షణమే క్రయమును రద్దుపఱచి ఆ విదేశీయుని సాగనంపెదరా లేక ప్రజాగ్రహమునకు గుఱియగుదురా, చెప్పుడు" అని గ్రుడ్లెఱ్ఱ జేయుచు చేతనున్న కాకితమును ఝళిపించెను. మూగియున్న ప్రజాగణమునుండి యొక పెద్ద గర్జనము వాతావరణము నదలించెను. తటాలున మన్నా వర్ధన్ ఎదుటకు వచ్చి, "నన్ను ముందు గడచి పిమ్మట ప్రభువును తాకుము." అని

గంభీరముగ పలికి యొరనుండి ఖడ్గము దీసెను. వర్ధక్ వికట హాసము జేసెను. ప్రజాసముదాయము ఒక్క యూపున ప్రభువుపైకి త్రోసుకొని వచ్చిరి. వేయికత్తు లొక్కసారి తళుక్కుమనినవి. భయోత్పాతమున ప్రభువు, "ఆగుడు. ఆగుడు. మీ యిచ్ఛానుసారమే కావింతును. క్రయమును రద్దుపఱచెదను" అని దీనాలాపము లాడుచుండగనే, ఎవ్వడో దుర్మార్గుడు ఆతని ప్రక్కలో పొడిచివేసెను. తక్షణమే పెద్ద కేకవైచి ప్రభువు నేలబడి రక్తపు రొంపిలో పొరలాడుచుండగా, "ఎవ్వడా పొడిచినవాడు? ఎవ్వడా దుర్మార్గుడు?" అని మన్నా బిగ్గఱగా నఱచెను. ప్రత్యుత్తరము లేదు.

"పశువుల మనుకొనెనా, పందుల మనుకొనెనా, అమ్మివేసినాడు? తగిన శాస్తి జరిగినది" అని వర్ధక్ మొఱిగెను. పిమ్మట మన్నా వానితో నేదో భాషించెను. జనసముదాయ మంతయు జయఘోష మొనర్చుకొనుచు వర్ధక్ వెంట వెడలిపోయెను. మన్నా ప్రభువు నిచ్చటకు నన్ను కాపుండుమని యాజ్ఞాపించి వెడలిపోయెను. స్వల్ప కాలములోనే యాతడు రత్నమాలాదేవితో తిరిగి వచ్చెను. ఆమె మా ప్రభువు సోదరుని కుమార్తె. తండ్రి మరణించుటచే తండ్రివలెనే యీతని ప్రేమించుచుండును. దుఃఖాతిరేకమున శోకించుచుండిన యామె నోదార్చి, మన్నా, "ఆ విదేశీయులు పోవరు. పోవకున్న ప్రజలు వారినికూడ చంపివేయుదురు" అని చెప్పెను. అంత నామె లేచి,

"పాపము, వారి దేమి యపరాధము? నేను పోయి వారి ప్రాణముల గాపాడెదను. ఎట్లైనను నచ్చజెప్పి వారి

నీ ద్వీపమునుండి పంపివైచెదను," అని పల్కి వడివడిగా మన్నాతో కలసి వెడలిపోయెను. అది మొదలు నే నిచ్చట కనిపెట్టుకొని యున్నాను. ఇంక ఈ ప్రభువు... ఎంతో కాలము...నిలచునట్లు లేదు." అని కన్నీరు తుడుచుకొనెను.

ఉదంత మంతయు విని, నిశ్శబ్దముగ క్షణమాత్ర మూరకుండి, జీవన్, "దాసీ! ఆ పొడిచినవా డెవ్వడు?"

"తెలియదు" అని దాసి చెప్పుచుండగనే, క్షతగాత్రుడై పొరలాడుచున్న ఇంద్రవర్మ, "మన్నా! మన్నా! పొడిచితివా? అయ్యో! అయ్యో! మీ యిచ్చానుసారమే... చేయుదు నంటినే! వారిని...పంపివైచెద నంటినే!...... అయ్యో!... అయ్యో!" అని యొక పెద్ద మూల్గు మూలిగి ప్రాణములు విడచెను. అప్రయత్నముగ జీవన్‌లాల్ నేత్రములనుండి అశ్రుబిందువులు రాలెను. మహాదుఃఖమున దాసి వెక్కి వెక్కి యేడువసాగెను.

అంత జీవన్, "దాసీ! దుఃఖింపకుము. దీనికి తగిన ప్రతీకారము చేయక మే మీ ద్వీపమును విడువము. ఛాయా ప్రాయముగ విషయము లన్నియు నాకు గోచరించుచున్నవి. మన్నా మొదట కృత్రిమ ప్రభుభక్తి చూపి చివరకు రహస్యముగ ప్రభువును స్వహస్తములతో పొడుచుట యందు గల అంతరార్థ మేమో ఇప్పటికి నేనూహింపజాలకున్నాను. ఏమైనను సరియే, నీ వీ క్షణమే మన్నా యొద్దకు బోయి, మే మీ భవనము నాక్రమించితి మనియు, ప్రభువును పొడిచిన ధూర్త వ్యక్తి యెవ్వడో నాకు తెలిసిన

దనియు, దానికి ప్రతీకారము చేయక విడువననియు, నా మాటలుగా చెప్పుము. పొమ్ము.'' అని యామె నొప్పించి పంపివైచెను. తదుపరి, అత్యంత బలిష్ఠమైయున్న వాకిలి ద్వారమును బంధించి, ముందరి చావడిలోనికి వచ్చిరి. జీవన్ లాల్ మరల నా కుర్చీపై కూర్చుండి, ఇప్పటి కొక ఘట్టము పూర్తియైనది. బాజీ! ఈ ద్వీపమునుండి వెడలి పోవుటకు ఇంకను మన కెంత గడువున్నది ?'' అని యడిగెను.

'' అదిగో, తూర్పు తెల్లవారుచున్నది. ఇంక నొక్క గంటలో సూర్యోదయ మగును.''

'' అనగా, మనకు జీవితప్రమాణ మింక నొక్క గంట యన్నమాట !'' అని పక పక నవ్వెను.

'' ఏమీ, నీవు గోవా పోదలచుకొనలేదా ?'' అని శంకర్ ప్రశ్నించెను.

''ఇప్పుడింక నెట్లు పోగలను ? ప్రతిజ్ఞాధారణ మొనర్చితిని కదా ! ఇచ్చటనే యుండి పరమ ఘాతుకుడైన యీ మన్నా కంఠమున కుఱిత్రాడు కట్టించెదను.''

'' అదెట్లు సాధ్యము కాగలదు ?''

''శంకర్ ! ప్రజాహృదయము పాషాణము కాదు. కపట తంత్రజ్ఞుల దుష్ప్రయోగములచే, అసత్య కల్పనలచే, ద్వీపవాసులయందు తాత్కాలికముగ మఱుగుపడియున్న మనుష్యత్వము సకాలమున తిరిగి బహిర్గతము కాక తప్పదు. ఈ ప్రజాసంఘముచేతనే, యీ విషకీటకము విధ్వంసము

చేయబడును. ఇచ్చట నుండియే ఆ మహోత్సవమును మనము చూడవలయును, శంకర్ !"

అని జీవన్‌లాల్ నిశ్శంకమైన యాత్మవిశ్వాసమును ప్రదర్శించి యనుచరుల కుత్సాహము గొల్పెను. చూచుచుండగనే సూర్యోదయ మయ్యెను.

# అధ్యాయము 4

ఇంక సావకాశముగ వారందరును ఆ గృహావరణము నందలి బాహ్యాంతర ప్రదేశ మంతయు పరిశీలింప దొడగిరి. ప్రాంగణ మంతయు విశాలమై బలియములైన ఉన్నత కుడ్య ములచే పరిరక్షితమై యున్నది. గృహాంతర్భాగమున ఏడు పెద్ద గదు లున్నవి. ప్రతి గదియందును ప్రవేశించి యందు గల పదార్థము లన్నియు అత్యంత శ్రద్ధతో వారు పరిశీ లించిరి. సుమా రొక మాసము దినములకు సరిపడు ఆహార సామగ్రి యం దున్నది. ఒక గదియందు అనేక విధములైన ఆయుధములు గోడలకు వ్రేలగట్టబడి యున్నవి. కాని, విశేష భాగము త్రుప్పుపట్టి నిరుపయోగములుగా కానబడు చుండెను. ఇంకొక గది కేవలము శూన్యమై యుండెను. దానికి గవాక్షముకూడ లేకుండుటచే లోన చీక టిగా నుండెను. దీపకాంతియందు దానిని పరిశీ లింపగా అం దొకమూల నొక పెద్ద పెట్టియు, దానిపై నొక సరిక్రొత్త జోడుగుండ్ల తుపాకియు కానబడెను. ఆ తుపాకిని తీసి, పెట్టె తెఱచి చూడగా, అందు కప్పు వఱకును నింపబడి తూటాలు మొదలగు మందుగుండు సామగ్రి కానబడెను. ఆ తుపాకిని, ఆ పెట్టెను, చూచినంతనే జీవన్‌కు నేత్రపర్వమయ్యెను. ఒకానొక రత్ననిధి లభించినట్లు ఆనందమున నాతడు చిందులు ద్రొక్కెను. "ఇంక త్రినేత్రు నకైనను మనము భీతిల్లము" అని యాతడు ఱంకెవైచెను.

చిట్టచివరకు మరియొక చిన్న గది యుండెను. అది వంటగది. కావలసిన సర్వ పరికరములును అచ్చట నమర్చ

బడి యున్నవి. ఆ గదిలోనుండి వెనుకనున్న విశాలమైన పెరటి యావరణమందు వారు ప్రవేశించిరి. అచ్చట ఏనుగుల వలె నున్న మూడు గోవులు నిండు పొదుగులతో నొక సాలయందు కట్టబడి యుండెను. చెంతనే దూడలు కట్టబడి యుండెను. ఇంక కావలసిన దేమి ? గోక్షీర సమృద్ధి ! పెరడు మూడు వైపులను అత్యున్నతములైన దాని గోడల నానుకొని యొక పెద్ద పర్వతము ఆకాశములోనికి చొచ్చుకొని పోయి యుండెను. ఆ పర్వత సానువులే చెక్కబడి ఆ పెరటికి పెట్టని గోడలుగా నేర్పడినట్లు కన్పట్టుచుండెను. ఏటవాలుగ నున్న పర్వతోపరిప్రదేశ మంతయు నొక పెద్ద యడవివలె గోచరించుచుండెను. అనేకములైన మహావృక్షములు కుధ్యోపరిభాగము మొదలుకొని పర్వత శిఖరము వఱకును వ్యాపించి యుండెను. అత్యంత మనోహరమైన యాదృశ్యమును జూచుచు జీవన్‌లాల్ కొంతకాల మచ్చటనే నిలచి పోయెను.

చూచుచుండగనే వృక్షాగ్రములతో దాగిలిమూత లాడుచు నొక చిన్న కుటీర మాతని కంటబడెను. “ అది యేమై యుండును ?” అని యాతడు వితర్కించుకొనుచుండ గనే, ఆ కుటీరద్వారము మెల్లగ తెఱువబడెను. అందుండి యెవ్వరో యొక స్త్రీ ఇంచుక బయటకు వచ్చి, అధో ముఖియై తమవైపు చూడజొచ్చెను. అనుచరులందరకును జీవన్ ఆ దృశ్యమును చూపెను. క్షణమాత్ర మట్లు చూచి యామె లోనికి బోయి తలుపులు వైచుకొనెను. మరియొక పెద్ద సమస్య యిప్పు డాతని కెదురయ్యెను. ఆమె యెవరు ?

వేషధారణమునుబట్టి ఆమె కొంత యున్నతశ్రేణికి జెందినట్లు కన్పట్టినది. ఆ నిర్జనప్రదేశమున, ఆ యేకాంతకుటీరము నందు, ఆమె యేల నివసించుచున్నది? ఈ ప్రశ్నలను వితర్కించుకొనుచు ఆతడు మరల గృహముజొచ్చి వీధి గుమ్మముకడకు వచ్చెను. చావడియందొక మూల, మేడపై కెక్కుటకు మెట్లమర్చబడి యున్నవి. మీద నేమున్నదో చూడవలయు నను కుతూహలముతో జీవన్ మెట్లెక్కి మీదికి పోయెను. కాని అచ్చటి ద్వారమునకు బలిష్ఠమైన తాళము పడియుండుటచే, సావకాశముగ దానిని చూడ వచ్చునని యాతడు మరల క్రిందికి దిగెను.

కావలసిన వస్తుసంచయ మంతయు ఇంటనే యుండు టచే గోపీ సహాయమున బాజీ ప్రాతఃకాల భోజనమును సిద్ధపఱచెను. అందఱును సమృద్ధిగ భుజించి వీధి వసారా నంటియున్న విశాలమైన గదియందు కూర్చుండి గతాగత ములగూర్చి ముచ్చటించుకొనుచుండిరి. ఇంతలో నిర్జనమై యుండిన రాజమార్గముపై గుఱ్ఱపు డెక్కల చప్పుడు వినవచ్చెను. గవాక్షమార్గమున చూడగా ద్వార మున కెదుట అశ్వముపై నుండి దిగి వర్ధన్ నిలచి యుండెను. ఆతని వెంత నింకెవ్వరును లేరు. జేబు నందు పిస్తోలు భద్రపఱచుకొని జీవన్ నిర్భయముగ పోయి ద్వారము తెఱచెను. అంత వర్ధన్, "ఓయీ, మీకొఱకు ఈ ప్రదేశమంతయు వెదకి వెదకి వేసారితిని. ఇచ్చటి కెప్పుడు వచ్చితిరి?" అని ప్రశ్నించెను. ఎట్లు వచ్చి నదియు, ఎప్పుడు వచ్చినదియు జీవన్ సవిస్తరముగ నాతనికి

తెలియజేసి, "అయ్యా! ఒక వృద్ధస్త్రీద్వారా ఒక వర్తమానమును మీకు పంపితిని. అందలేదా?" అని యడిగెను.

వర్ధన్:— అగును. ఏదో చెప్పవలసియున్నదని ఒక వృద్ధదాసి ఒక భద్రవ్యక్తికోలకు పోవుచుండెను.

జీవన్:— అగును. ఆ భద్రవ్యక్తి నీకు పరమమిత్రుడు కదా!

వర్ధన్:— కావచ్చును. కాని, ఆతనికి పంపిన వర్తమానము నాకెట్లు చేరును?

జీవన్:— ఆతనికి చేరిన, నీకు చేరినట్లే కదా!

వర్ధన్:— కావచ్చును. ఆతని వలన ఆ విశేషమును నేను వింటిని.

జీవన్:— మీరాణి రత్నమాలాదేవికూడ వినియే యుండును.

వర్ధన్:— అదెట్లు? మన్నాకును నాకును తప్ప అన్యులకు తెలియదు.

జీవన్:— మంచిది. ఆ హంతకుని నీవు సమర్థించెదవా?

వర్ధన్:— ఆతడు హంతకు డెట్లగును? ఉద్రేకపూరితమైన ఆ జనసమ్మర్దమునందు హంతకు డెవడని చెప్పగలము? ఇంతకును, హంతకు డెవడైనను, ఆతని దోషమేమి? ఈ ద్వీపమును విక్రయించుటకు ప్రయత్నించి యా వృద్ధుడు అపరాధము చేసెను.

జీవన్:— విక్రయించుటకు ప్రయత్నించుట యేమి? విక్రయించి సుమారు మాసము దినము లైనది.

వర్ధన్ :— ఆ విషయము తెలిసినచో ఈ ద్వీపవాసు లేమి చేయుదురో తెలియునా ?

జీవన్ :— బాగుగ తెలియును. విషయమంతయు తెలిసినచో, మన్నాను బంధించి నడిబజారులో ఉరితీయుదురు.

(వర్ధన్ పెద్ద వికటహాసము చేసెను.)

జీవన్ :—మీ ద్వీపమున ప్రస్తుతము న్యాయాధిపత్య మెవ్వరిది ?

వర్ధన్ :—న్యాయాధిపత్యము మన్నా యిచ్ఛాధీన మని నీకు తెలియదు, పాపము !

జీవన్ :— ఎట్లు ?

వర్ధన్ :— నీ క్షేమమునకు ఆ విషయము నీవు తెలిసికొని యుండుట మంచిది. మా రాణి రత్నమాలాదేవి ఆతని రాణి కానున్నది. తెలిసికొని ప్రవర్తింపుము.

జీవన్ :— అనగా ? వారి వివాహము నిశ్చయమైనదా ?

వర్ధన్ :— అగును. ఇంక నీ ద్వీపాధిపత్యము వా రిద్వరి చేతుల యం దుండును.

జీవన్ :— అట్లనా ? దానికి ఒకటి రెండు దుస్తరములైన అంతరాయము లున్నవని నీవు తెలుసుకొనుట మంచిది. మొదటిది, ఈ ద్వీపముపై సర్వాధికార మును ప్రస్తుతము నాది.

వర్ధన్ :— సరి సరి. దానికేమి లే. సింహ గుహపై మేకపోతున కధికార మున్నట్లే !

జీవన్:— సరియే. రెండవది, మీ మన్నా యెందఱు భార్య లను కట్టుకొన దలచినాడు ?

ఈ ప్రశ్నకు వర్ధన్ ముఖము జేవురించెను. ఆ ముఖ ముపై వింత వింత భావచ్ఛాయలు చిందులాడ జొచ్చెను.

"నీ యభిప్రాయమేమి ?" అని యాతడు తీవ్ర దృష్టితో ప్రశ్నించెను. చెంత నిలచిన గుఱ్ఱము గంభీరముగ సకిలించెను.

జీవన్:- ఓయీ ! తత్తరపడెదవేల ? నా ప్రశ్నకు తత్తర పడవలసిన వ్యక్తి ఆతని చేబట్టనున్న మీరాణి రత్న మాలాదేవి కాని, నీవు కావు. సరియే, అది యటుండ నిమ్ము. ఇప్పుడు మమ్ము వెదకికొనుచు నీవు వచ్చిన పనియేమి ?

వర్ధన్:— మా రాణి యాజ్ఞచే —

జీవన్:— ఒక్క మీ రాణి యాజ్ఞ చేతనేనా ? లేక, మన్నా ఆజ్ఞ చేతకూడనా ?

వర్ధన్ :— అట్లే యనుకొనుము. మన్నా ఆజ్ఞచే, ఈ ద్వీప మునకై నీ విచ్చిన మూల్యధనమును తిరిగి నీ కిచ్చివే సెదను.

జీవన్ :— ఈ ద్వీపమును విడచి నేను వెళ్ళిపోయినచో— అంతేనా ?

వర్ధన్ :— అగును. నిన్నును నీ మిత్రులను సురక్షితముగ మీ దేశమునకు పంపివేసెదను. కాని, ఈ ద్వీపము

నందలి విశేషములను గూర్చి యెవ్వరికిని చెప్పనని మాత్రము నీ యాత్మసాక్షిగా నీవు వాగ్దానము చేయ వలెను.

జీవన్ :— అట్లు వాగ్దానము చేయనిచో ?

వర్ధన్ :— ఈ ద్వీపమునుండి మీరు తిరిగి పోవుటయే జరుగదు. చెప్పుము. నీ ప్రత్యుత్తర మేమి ?

జీవన్ :— వినుము. ఈ ద్వీపమునుండి తిరిగిపోవుటకు నేను రాలేదు. ఈ ద్వీపముపై అధికారము వహించుటకు వచ్చియున్నాను. మాయావియైన మన్నాకు మరణ శిక్ష విధింపించి ఉరికంబ మెక్కించక విడువనని తెలిసికొనుము.

వర్ధన్:— సరియే, అట్లే కానిమ్ము.

అని రోషారుణిత వదనుడై చివాలున వెనుతిరిగి అశ్వము నధిరోహించి వాయువేగమున వచ్చినదారిని బోయెను. జీవన్ తీవ్రయోచనా నిమగ్నుడై మెల్లగ లోనికి వచ్చి ద్వారమును బంధించెను. జరిగిన సంభాషణాక్రమ మంతయు అనుచరులకు తెలిపెను. ఏకకంఠముతో అందఱును ఆతని నభినందించి, "దీని పర్యవసానము చూచియే విడచుదము." అని యాతని కుత్సాహము గొల్పిరి.

తదుపరి వా రందఱును కప్పియుంచిన ద్వీపాధిపతి ఇంద్రవర్మ మృతదేహముచెంతకు బోయి, దానిని పెరటిలోనికి మోసుకొనిపోయి, అచ్చట తాత్కాలికముగ భూస్థాపిత మొనర్చిరి. అనంతరము సంధ్యాకాలము వఱకు

నిర్విశేషముగ గడచిపోయెను. వెలుగుండగనే భోజనములు ముగించుకొని నలుగురును వీధి వసారాపై సుఖాసీనులై భవిష్యత్కార్యక్రమమునుగూర్చి చర్చించుకొనుచుండిరి.

ఆ ప్రాంతము కేవలము శ్మశానప్రదేశమువలె నిర్జనమై యుండెను. ఒక్క ప్రాణియైనను ఆ దారిని పోవుటలేదు. ఉన్నతమైన యా స్థలమునుండి రక్తప్రభాసముజ్జ్వలమైన సంధ్యాగగనమును ప్రతిబింబించుచున్న విశాల సాగరము దృగ్గోచర మగుచుండెను. ఇంతలో, దూరమునుండి ఆ ప్రశాంత వాతావరణమును ఛేదించుకొని యొక శృంగనాదము వినవచ్చెను. ఏకాగ్రదృష్టితో అందరును ఆ వైపు చూడ సాగిరి. క్రమక్రమముగ ఆ శబ్దము భేరీవాద్య సహితముగ సమీపించుచుండెను. అంతకంతకు సముద్రఘోషమువలె ప్రజాఘోషము వినబడజొచ్చెను. అంత జీవన్ చిరునవ్వుతో, "వినుచుంటిరా! ఒక మహాతరంగము మనలను మ్రింగివేయ వచ్చుచున్నది! ఈ రాత్రి మనకు శాంతముగా గడచునట్లు లేదు. లెండు." అని వారిని లోనికి తోడ్కొనిపోయి దుర్భేద్యములైన యా కవాటద్వారములను బంధించెను. క్షణక్షణోద్రిక్తమగుచున్న ప్రజాఘోషము కవాటకుడ్యములను ఛేదించుకొని వారికి విస్పష్టముగ వినవచ్చుచుండెను.

# అధ్యాయము ౬

ఆకస్మికముగ అంతయు నిశ్శబ్ద మయ్యెను. గవాక్ష మార్గమున బహిఃప్రదేశ మంతయు ఆ సందెచీకటియందు ఒకింత యస్పష్టముగ గోచరించుచుండెను. ఆ ప్రజాగణ మంతయు నేమైనదో, ఎచ్చటను అలికిడి లేదు. మంచు కరగినట్లు కరగి యే వైపునకు ప్రవహించినదో తెలియదు. నిశ్శబ్దముగ నలుగురును అట్లే గవాక్షములచెంత నిలచి కనిపెట్టుచుండిరి.

"ఇందేదో మోసము స్ఫురించుచున్నది. ఎందుకైనను మంచిది, శంకర్! ఆకాశమునకు గురిపెట్టి నీ తుపాకి ఒక్కసారి ప్రేల్చుము." అని జీవన్ ఆదేశించెను. ఉత్తర క్షణమున ఆ నిశ్శబ్ద వాతావరణమును ఛేదించుకొనిపోయిన తుపాకిశబ్దమును పర్వతసానువులు ప్రతిధ్వనించెను. గూళ్ళ జేరుకొని యుండిన పక్షులు బెదరి యాకాశమున కెగురబారెను. తిరిగి, అంతయు నిశ్శబ్దము.

"ఈనాటికి వారి కార్యక్రమము పూర్తియైనట్లున్నది. ఇంక వారు రారు. జేపటి కథ జేపు చూచుకొందము." అని జీవన్ మరల తన పడకకుర్చీపై కూర్చుండెను. గడచిన రాత్రి యంతయు క్షణమాత్ర విశ్రాంతియైన లేకపోయినను ఎవ్వరికిని నిద్రాపేక్ష లేదు.

"మిత్రులారా! మీరందఱును విశ్రమించుడు. నేను మేల్కొని కనిపెట్టుచుండెదను. నాకు నిద్ర వచ్చునప్పుడు మీలో నెవ్వరినైన లేపెదను" అని జీవన్ వారి ముప్పురను

బలాత్కరించి విశ్రమింపజేసెను. అతి స్వల్పకాలము నందే వారు గాఢనిద్రాగతులైరి. ఆ యంధకార జగతికి కావలిగాయుచు జీవన్ కూర్చుండెను. అతని యంతర్నేత్రములకు ఒకానొక యవనికపైవలె గతాగత సంఘటనములు భావచిత్రములై గోచరించుచుండెను. ఆ విధముగ సుమారొక గంటకాల మాతడు కూర్చుండి స్వప్నములను గాంచుచుండెను. అన్యాయత్తమై యుండిన యాతని దృష్టి హఠాత్తుగ బహిర్ద్వార ప్రాంతమునుండి వెలువడుచున్న ఒక మూలుగు శబ్దముచే నాకర్షింపబడెను. తటాలున నాతడు తుపాకి చేతబట్టి లేచి నిలచి, గవాక్షముద్వారా బయటకు దృష్టి సారించెను. అంతయు అంధకారము. ఏమియు గోచరించుటలేదు. కాని, అతి సమీపమునుండియే మరియొకసారి యా మూలుగు వినవచ్చెను. ఎవ్వరో శారీరకమైన బాధ పడుచుండినట్లు ఆ శబ్దము సూచించుచుండెను.

"ఎవరచ్చట ?" అని అప్రయత్నముగ జీవన్ గంభీర స్వరమున ప్రశ్నించెను. ప్రత్యుత్తరము లేదు. ఇది యొక శత్రువిన్యాసమై యుండునని యాతడు భావించి నిద్రించుచున్న బాజీని మెల్లగ తట్టి లేపి, "బాజీ! ఆ దీపమును పట్టుకొని నావెంటరమ్ము. ఒక విశేషమును నీకుజూపెదను," అని పల్కెను. దీపకాంతిని తోడుచేసుకొని యిరువురును పోయి బహిర్ద్వారమును మెల్లగ తెఱచి నలువైపులను పరికించిరి. సుమారు పదిగజముల దూరమునందు ఒక వ్యక్తి చాపచుట్టగా నేలబడి యుండెను. అన్య మనుష్య వాసన యేమియు లేదు. ఇరువురును మెల్లగ ఆ వ్యక్తి కడకు

బోయి దీపకాంతియందు ఆ ముఖమును పరిశీలించిరి. కేవలము పదునారేండ్లకన్న అధికప్రాయ ముండదు. నెన్నుదిటిపై నొక పెద్ద బొణిపి తేలియున్నది. "గంట క్రిందట నిచ్చట చేరిన జనసమ్మర్దమునందు వీడెవ్వడో నేలబడి మూర్ఛాగతుడైనాడు. ఆ సందడియందు వీని నెవ్వరును చూడలేదు. కాని, వీనికొఱకు త్వరలోనే కొందరు తిరిగి రాగలరు. వీనిని లోనికి దీసికొని పోవుదము రమ్ము" అని జీవన్ బాజీసహాయమున ఆ బాలు నెత్తి లోనికి దోడ్కొని వచ్చి, యొక సోఫాపై పరుండబెట్టి బహిర్ద్వారమును తిరిగి బంధించివైచెను.

కొన్ని నిముషములలో ఆ బాలునకు చైతన్యము కలిగి, నలువైపులను శూన్యదృష్టుల జూడసాగెను. అంత జీవన్, "బాలకా! రాత్రివేళ సంచార మెంత ప్రమాదకర మో చూచితివా? నీ వెవ్వరవో, పాపము!" అని వాని ముఖము వైపు నిదానించెను.

"నే నిప్పు డెచ్చట నున్నాను?" అని ఆ యువకుడు ప్రశ్నించెను.

"నీవు ప్రస్తుతము సురక్షితముగ నా గృహామందున్నావు. మీ వారందఱును ఎచ్చటనో బయట నున్నారు. వా రిచ్చటకు రాజాలరు. ఇచ్చట... మరి నీవు... మాతోపాటుండవలసినదే." అని జీవన్ మందహాసము చేసెను.

యువకుని కన్నులు మరల మూత పడెను. బాజీ చేతనున్న దీపమును తీసుకొని, అతని నచ్చటినుండి

పంక్షినైచి, జీవన్ ఆ దీపకాంతియందు ఆ యువకుని ముఖ లక్షణములను జాగ్రత్తగ పరిశీలింప జొచ్చెను. మరల, మూతపడిన యా నేత్రములు విడినవి. అంతటి సుందర నేత్రములను ఆత డీవఱకు ఏ స్త్రీ ముఖమునను కూడ చూడలేదు. ఇంకను ఆ బాలునకు పూర్తిగ చైతన్యము రాలేదు. " కాదు. కాదు. అటుకాదు మన్నా!" అని స్వప్నగతావస్థయం దుండియే యాతడు పలువరించెను. తత్క్షణమే జీవన్ పోయి ఒక పాత్రముతో జలమును తెచ్చి వాని నోటి కందిచ్చెను. కంపించుచున్న హస్తములతో అతడా జలపాత్రము నందుకొని, త్రాగి, తిరిగి దాని నాతని కందిచ్చెను. క్షణమాత్ర మూరకుండి, జీవన్, "బాలకా! నే నెవరనో తెలుసుకొనగోరెదవా?" అని యడిగెను.

"ఎవరవు?"

"నాపేరు జీవన్‌లాల్. అవకాశము లభించినచో నన్ను హత్యచేయుటకే కదా నీ విచ్చటకు వచ్చినది?"

"కాదు, ఎంతమాత్రమును కాదు. నీ కెట్టి హానియు కలిగించరాదని నేను మన్నాతో —"

"చెప్పితివా?"

"ఏరీ, నా వారందరును...ఎచ్చట?"

"ఎవ్వరును లేరు. అందరును పలాయితులైరి. ఒక్క నీవుమాత్రము నా చేతులయందు చిక్కితివి. ఇప్పుడు నిన్ను నే నేమైన చేయగలను. రక్తపిపాసులైన మీవారు నిన్న

నిరపరాధుడైన ఆ వృద్ధుని హత్యగావించిరి. ఆ హత్యా కాండను తలచుకొనినచో — ''

'' ఆ హత్య కేవలము ప్రమాదవశమున సంభవించినది.''

'' అందలి ఆంతర్యము నీకు త్వరలోనే తెలియగలదు. నరరూప రాక్షసులైన ఆ మన్నా వర్ధనులు న్యాయ విచారణమున కీడ్చుకొనిరాబడునపుడు అంతయును నీకే తెలియును. నిష్కారణముగ ఆ వృద్ధుని జంపిన నేరమునకు మన్నా ఉరికంబ మెక్కునప్పుడు అందరకును నిజము తెలియగలదు. బాలకా! ఈ హంతకుల సాంగత్యము నీ కెట్లు కల్గినది?''

అని జీవన్ గంభీరముగ ప్రశ్నించెను. యువకుడు నిరుత్తరుడై నిప్పులపై నున్నట్లుండెను.

" ఎవ్వరవు నీవు? నీ పేరేమి?" అని జీవన్ మరల ప్రశ్నించెను.

" నా పేరు— నా పేరు— చెప్పను."

" చెప్పిన ప్రమాద మేమైన కలదా?— పోనిమ్ము. వేరొక ప్రశ్న అడిగెదను చెప్పుము. నీవు సదా యిట్టి దుస్తులనే ధరించుచుందువా?''

ఈ ప్రశ్న యువకుని అంతరాళగోళమును కలచివైచెను. ముఖమునందలి జిగి క్షణమాత్రమున ఛాయాగ్రస్తమయ్యెను. నేత్రము లధోగతము లయ్యెను. ఆపాదమస్తక

మును ఒక్కసారి కంపించెను. సోఫాపై కూలబడి చేతులతో ముఖమును కప్పుకొనెను.

ఇంతలో నిద్రాభంగము కలిగి శంకర్ అచ్చటకు వచ్చి ఆ దృశ్యమును జూచి ఆశ్చర్యచకితుడై "జీవన్! ఆ వ్యక్తి యెవ్వరు?" అని యడిగెను.

"శంకర్! ఈ వ్యక్తి చాల విచిత్ర వ్యక్తి! శత్రుపక్షమునకు చెందిన పక్షి, మన పంజరమునందు చిక్కువడినది!"

"అబ్బా! అర్ధరాత్రివేళ ఇచ్చటి కెగిరివచ్చిన యీ పక్షి సామాన్యపు పక్షి కాదే! ఈ పక్షిచేత నేమైన పలికించితివా?"

"ఎంత యత్నించినను పలుకకున్నది శంకర్!"

"జీవన్! 'మర్దనం గుణవర్ధనం' అను సూత్రము నీకు తెలియదా? ఒక్కసారి దండప్రయోగము చేసినచో దండము పెట్టుచు పలుక నారంభించును. నన్ను పలికింపు మందువా?"

"ఆ పని నేను చేయ లేకనా?"

"మరి?"

"ఒక స్త్రీపై దండప్రయోగ మెట్లు చేయుదునయ్యా"

శంకర్ దిగ్భ్రాంతుడై నిలువుగ్రుడ్లతో, "స్త్రీయా? ఈ వ్యక్తి యొక స్త్రీయా?" అని తెప్ప వాల్చక జూడ సాగెను.

"సామాన్యస్త్రీ కాదు శంకర్! ఈ ద్వీపమునకు రాణి! నాయకురాలు! రత్నమాలా దేవి!"

"ఎట్లు గుర్తించితివి ?"

"కానిచో, 'నావారు, నావారు' అని యీ ద్వీప వాసుల గూర్చి పల్కుట కింక నెవ్వరి కధికార మున్నది ? నా కెట్టి హానియు కలిగించరాదని మన్నాతో చెప్పినదట ! అట్టి యధికార మింక నెవ్వరి కున్నది ?"

ఈ మాటలు చెవిని బడినంతనే, లజ్జావనతవదనయై రత్నమాల సోఫాపై లేచి కూర్చుండెను. కాని, ముఖము నందు నిరాశ లేదు. అసహాయ పరిస్థితియందు పొడగట్టు దైన్యము లేదు. భీతీ లేదు. అప్పటికి నిద్రాగతుడై యుండిన గోపీ సహితము లేచి వచ్చెను. నలుగురును వలలో చిక్కిన పులి చుట్టును చేరిన వేటకాండ్రవలె ఆమె చుట్టును నిలచి యుండిరి. అంత నామె యధోముఖియై సగర్వముగ, "సరియే. ఇప్పుడు నన్ను మీ రేమి చేయదలచితిరి ?" అని ప్రశ్నించెను.

జీవన్ :- రాణీ ! అత్యాచారము చేయుటకు మేము నీచులము కాము. నిన్నేమి చేయవలయునో ఇంచుక యోచింప వలసి యున్నది. అంతవఱకును, ఈ భవనమునందు ఏ గది నీవు రాణివాసముగ నేర్పరచుకొని యుంటివో, అందే యుండుము. నీ సౌకర్యము లన్నియు మేము చూచుచుందుము.

రత్న :- నా గదిలోనికి నేను పోవచ్చునా ?

జీవన్ :- నిరభ్యంతరముగ పోవచ్చును. గదికి మాత్రము మేము తాళము వైచి యుంచెదము.

రత్న :- మంచిది.

అని యామె లేచి చరచర పోయి ఆ చావడిమూల నున్న మేడ మెట్లెక్కి, తన యొద్దనున్న తాళముతో మేడగది తెఱచి, అందు ప్రవేశించెను. సగౌరవముగ నామెను పీఠ్యాల్పి, గదికి బలమైన తాళము వైచి వారు మరల క్రిందికి దిగిరి. అప్పటి కింకను చాల రాత్రి యుండెను.

"మిత్రులారా! కాలకూట విషమును శంకరుడు గళమునం దుంచుకొనినట్లు, ఈ రత్నమాలను మన మిప్పుడు మన గృహమునందు నిర్బంధించితిమి. దీని పర్యవసాన మెట్లుండునో చూడవలయును." అని జీవన్ గాఢసందేహా యుక్తుడై పల్కెను.

"జనసమ్మర్దమున తప్పిపోయిన ఈమె నిమిత్తమై మన్నా ప్రభృతులు తప్పక ప్రయత్నింతురు. మన మత్యంత జాగరూకులమై యుండవలెను." అని శంకర్ హెచ్చరించెను.

"అగును. బలాబల నిర్ణయమునకు సమయ మాసన్నమైనది. దుర్గము నాక్రమించితిమి కదా! దుర్గాధికారిణిని బంధించి యుంచితిమి కదా! తదుపరి కథావిధాన మెట్లు సాగునో చూతము. మిత్రులారా! ఇంకను చాల రాత్రి యున్నది. మీరందఱును పోయి నిశ్చింతగ విశ్రమించుడు. నేను మేల్కొని యుండెదను. ఆవశ్యకమైనచో మిమ్ము లేపెదను" అని జీవన్ వారిని విశ్రమింపజేసి, ఏకాకియై తాను గవాక్షముచెంత కూర్చుండి, వేయి కన్నులతో, వేయి చెవులతో, ఆ యర్ధ నిశీథమున కావలి కాయుచుండెను.

# అధ్యాయము 6

అంతయు నిశ్శబ్దము. ప్రక్క గదిలోనుండి నిద్రించు చున్న మిత్రుల యుచ్ఛ్వాస నిశ్వాసములు తప్ప వేఱేమియు వినవచ్చుట లేదు. అట్లు సుమారొక గంట గడచి పోయెను. పిమ్మట తన మూర్ధోపరిభాగమున మేడపై శ్రవ్యాశ్రవ్యముగ అడుగుల చప్పుడు వినవచ్చెను. అప్రయత్నముగ జీవన్ దృగ్జాలము లూర్ధ్వాభిముఖము లయ్యెను. అంతకంతకు ఆ యడుగులచప్పుడు పెరటింటివైపు నడువసాగెను. తత్క్షణమే యాతడు లేచి, పిస్తోలు చేతబట్టి, నిద్రించుచున్న శంకర్‌ను మెల్లగ తట్టి లేపి, "శంకర్! నే నొక్కసారి పెరటివైపునకు పోయివచ్చెదను. నేను వచ్చువఱకును నీవిచ్చట కాపుండుము," అని పల్కి వడివడిగా ఆ యడుగుల శబ్దము ననుసరించుచు పోయి, నిశ్శబ్దముగ పెరటిద్వారము తెఱచి, ఆవరణమున ప్రవేశించి, గోడ యోర నొక చెట్టుచాటున ఊపిరి బంధించుకొని, ఇంటి కప్పువైపు తదేకదృష్టితో జూచుచు నిలచియుండెను.

ఆకాశమునందలి నక్షత్రకాంతి అంధకారముతో పెనగులాడుచుండెను. పెరటింటి కప్పుపై కేంద్రీకరింపబడియున్న జీవన్ దృగ్జాలముల కించుక వెలుగు తోడ్పడెను. చూచుచుండగనే ఆ నక్షత్రకాంతియందు స్పష్టముగ ఆ డాబా యంచుపైనుండి యొక నిచ్చెన మెల్లగ జారి నేల నానుకొనెను. ఉత్తరక్షణమే ఒక వ్యక్తి మేలిముసుగు వైచుకొని చరచర ఆ నిచ్చెన మార్గమున నేలకు దిగెను.

జీవన్ హృదయము క్షణమున కెన్నిసార్లు కొట్టుకొను చుండెనో చెప్పజాలము. పిస్తోలు చేతబట్టి యాతడు తదేక దృష్టితో రెప్పవాల్చక చూచుచుండెను. "బందీకృత మైన రత్నమాల! ఆగదిలోనుండి బయట కేదో రహస్య మార్గమున్నది! సరియే. ఇంక నేమిచేయునో చూచెద గాక!" అని యాతడు కనిపెట్టుచుండెను.

నిచ్చెనదిగి, ఆమె యొక్కసారి నలువైపులను పరికించి, పశ్చిమోత్తర ప్రాకారములు కలియుచున్న మూలకు వడివడిగా నడచి, అచ్చటనుండి కుడియెడమలుగా అడుగుపై నడుగు వైచుకొనుచు అతిసులభముగా నా గోడనెక్కి పై భాగమునకు పోయి అదృశ్యయయ్యెను. వెనువెంటనే జీవన్ సహిత మా ప్రాకారకోణముకడకు బోయి, అచ్చట గోడలయందు చెక్క బడియున్న ఆాతిమెట్లు నెక్కి వడి వడిగా పైకిపోయెను. ఆ గోడ పై భాగము నానుకొనియున్న పర్వతసానువుపై వృక్షలతా బంధురమైయున్న వనమార్గమున సుమారు ముప్పది గజ ముల దూరమున వెనుజూడక వడివడిగా రత్నమాల పోవు చుండెను. మహా వేగమున నాత డామెను సమీపించి పర్వత సానువులు ప్రతిధ్వనించునట్లు "ఆగుము" అని గంభీరముగ పల్కెను. అదరిపడి ఆ జవ్వని వెనుతిరిగి పిస్తోలు గురిపెట్టి యున్న జీవన్ భయంకరమూర్తిని జూచి కెవ్వున కేకవైచి నిశ్చేష్టయై నిలువబడెను. జీవన్ ఆమె యెదుటకు బోయి, "రాణీ! ఎచ్చటికీ ప్రయాణము?" అని మందహాసము జేయుచు ప్రశ్నించెను.

రత్న:— నేను నీ నిర్బంధమున నుందుననియే భావించితివా?

జీవన్ :— తప్పించుకొని పోగలననియే భావించితివా? మంచిది. ఈ మార్గమున ఎచ్చటకు పోవుచున్నావు? ఈ పర్వత ముపై నీ కెవ్వరైన మిత్రులు కలరా?

రత్న :— ఎవ్వరును లేరు.

జీవన్ :— అసత్యము పల్కుచున్నావు. ఈ పర్వతశిఖరము సమీపమునందున్న కుటీరమునందు నీ మిత్రు లెవ్వ రును లేరా?

రత్న :— లేరు.

జీవన్ :— అది మన్నా అధీనమునందు లేదా?

రత్న :— లేదు. మన్నా అచ్చట లేడు.

జీవన్ :— ఇంక నెవ్వరును అచ్చట లేరా?

రత్న :— లేరు.

జీవన్ :— నీవు పొరపడుచున్నావు. ఈ కండ్లతో నేను ఒక వ్యక్తి నా కుటీరమునందు జూచితిని! ఒక నాగరక స్త్రీ! నీవలెనే యొక జవ్వని!

రత్న :- అసంభవము! అదియొక శూన్యగృహమని మన్నా నాతో చెప్పియున్నాడు.

జీవన్ :- మన్నా యేమిచెప్పిన అది నీవు విశ్వసింతువా?

రత్న :- తప్పక విశ్వసింతును. మా బాంధవ్యము అవిశ్వాస మునకు తావీయదు.

జీవన్ :- అగును. నీ వాతని వివాహమాడ నున్నావట కాదా?

రత్న:- అగును. అది మరణించిన నా పినతండ్రి కోరిక!

జీవన్:- నీ పినతండ్రి మన్నా నంతగా ప్రేమించుచుండెనా?

రత్న:- సందేహ మేమి?

జీవన్:- రాణీ! నీ యమాయకత్వమునకు నేను చింతించు చున్నాను. మీా వృద్ధదాసి ద్వారా మన్నాకు నేను పంపిన సందేశము నీ కాతడు తెలియజేసినాడా?

రత్న:- చెప్పియుండెను. ప్రాణములనైన విడచెదను కాని యీా ద్వీపమును విడువనని చెప్పితివట కాదా?

జీవన్:- అసత్యము. నా సందేశ మది కాదు. ఆ వృద్ధదాసి నిన్ను కలసినదా?

రత్న:- లేదు.

జీవన్:- ఎట్లు కలియును? కలియనిచ్చిన కదా నీవు సత్యము గ్రహించియుందువు. "ఆ వృద్ధుని హత్య గావించిన నేరమునకు నిన్ను ఉరికంబ మెక్కింపక విడువను" అని వానికి వర్తమాన మంపితిని. ఈ విషయము వాడు నీతో నేల చెప్పును?

రత్న:- అసంభవము. మన్నా హంతకుడా?

జీవన్:- అయ్యో! అమాయకురాలా! నిన్ను చూచినచో నాకు జాలి పొడముచున్నది. మన్నా ప్రారంభించిన హత్యాకాండమునందు కేవలము ప్రథమాశ్వాసము మాత్రమే ముగిసినది. ఇంక ద్వితీయాశ్వాసము ప్రారంభము కానున్నది.

రత్న:— నీ మాటలు నా కర్థమగుట లేదు.

జీవన్:— త్వరలోనే యర్థము కాగలవు. ఈ భద్రవ్యక్తి మన్నాను తొలుదొల్త నేను ఒక యర్ధరాత్రి సమయమున బొంబై సముద్రతీరమున జూచితిని. అప్పు డాతనివెంట నొక స్త్రీ యుండెను. ఆ జవ్వని సహితము తనవెంట నిచ్చుటకు వచ్చియున్నదని నేను చెప్పినచో నీవు విశ్వసింతువా?

రత్న:— అసంభవము! అసంభవము!

అని యామె పలికెనే కాని, ఆమె హృదయాంతరాళమున ఉత్పన్నమైన తుపాను ఆమె వదనముపై అద్దము నందువలె గోచరించుచుండెను. ఆమె మర్మమర్మముల నదలించుచుండిన ఝంఝూమారుతములు ఉచ్ఛ్వాస నిశ్వాసములందు పొడగట్టుచుండెను.

జీవన్:— నీకు సందేహమైనచో, ఇప్పుడే ఆ కుటీరమునకు బోయి చూడుము. అంతయు నీకే సువేద్యము కాగలదు.

రత్న:— అట్లైన నన్ను విముక్తను జేయుదువా? నేను స్వేచ్ఛగ పోవచ్చునా?

జీవన్:— ఆ కుటీరమునకు పోయివచ్చుటకు మాత్రమే నీకు స్వేచ్ఛ నీయగలను. తిరిగి యిచ్చటకు వచ్చెదనని మాత్రము నీవు వాగ్దానము చేయవలెను.

రత్న:— అట్టి వాగ్దానము నేను చేయజాలను. కారణము, నిన్ను మోసముచేయు తలంపు కాదు. నీవు పల్కినది

వాస్తవము కానిచో, అచ్చట నుండు నా మిత్రులు నన్ను తిరిగి రానీయరు.

జీవన్ :— అట్లైన నిన్ను పోనీయజాలను. నీ నిమిత్తమై నీ స్థానమున నేనే పోయి ఆ కుటీరమునందలి రహస్యమును గ్రహించి తెచ్చి నీకిచ్చెదను. నేను తిరిగి వచ్చు పర్యంతము నీ నిర్బంధ గృహమునందు నీవు నాకై కనిపెట్టుకొని యుందువని వాగ్దానము చేయుదువా ?

రత్న :— తప్పక అట్లే వాగ్దానము చేయుచున్నాను.

ఈ వాగ్దానమునందలి గంభీరత విస్పష్టముగ ఆమె యమాయక నేత్రములందు పొడగట్టుచుండెను. నిర్మేఘమై యుండిన యామె హృదయాకాశ మిప్పుడు మేఘాక్రాంతము కాజొచ్చెను. మన్నా తన్ను మోసగింపనున్నాడా ? ఆతనితో వేరొక స్త్రీ యిచ్చటకు వచ్చియున్నదా ? ఆ కుటీరమునం దామెను దాచియుంచి తనతో నసత్యము పల్కెనా ? ఆ స్త్రీ యెవ్వరు ? ఆమెతో మన్నాకేమి సంబంధము కలదు ? చివరకు మన్నా తన్ను మోసము చేయదలచెనా? ఇట్టి ప్రశ్నలు పరంపరాగతములై యామె మానసమును కలచివేయుచుండెను. ఇందలి సత్యాసత్యములను గ్రహించుట కామె హృదయ మిప్పుడు తహతహ లాడుచుండెను. రహస్యాన్వేషణము జేసి జీవన్ తిరిగివచ్చి యామెతో చెప్పువఱకును ఆమె యా గృహమునుండి పొమ్మన్నను పోవదు. ఈ విషయము జీవన్ కు సహితము పూర్తిగా తెలియును. కావుననే, నిస్సందేహముగ నాతఁ డామెను తన మందిరమునకు పొమ్మని స్వేచ్ఛగ

విడచెను. అశాంతి క్షుభితమైన హృదయముతో రత్నమాల తలవంచుకొని వచ్చినదారినే తిరిగిపోయి తన మందిరము నందు ప్రవేశించెను. ఆమె నటు పంపి, జీవన్ ఆ యంధకార చ్ఛాయలయందు కుటీరాభిముఖుడై పోయెను.

అప్పటి కింకను సుమా రొక జామురాత్రి యున్నది. అపరిచితమైయున్న ఆ పాషాణ మార్గమున రాళ్లను, రప్పలను, తుప్పలను తప్పుకొనుచు, పడుచు, లేచుచు, ఎట్టకేలకు జీవన్ ఆ కుటీరమును సమీపించెను. లోనున్న దీపకాంతి గవాక్షమార్గమున ప్రసరించుచుండెను. లోనుండి యేదో సంభాషణము అస్పష్టముగ వినవచ్చుచుండెను. మెల్లగ తడవుకొనుచు నిశ్శబ్దముగ జీవన్ గవాక్షము చెంతకు పోయి పొంచియుండి ఆ సంభాషణమును వేయిచెవులతో విన జొచ్చెను. అరనిముసములో కంఠస్వరములను బట్టి యా సంభాషించుచున్నవారు మన్నా వర్ధనులని గ్రహించెను. వా రిట్లు సంభాషించుకొనుచుండిరి.

వర్ధన్:— ఆమెను వారు తప్పక బంధించియుందురు. కాని, ఎట్టి హానియు చేయరు. ఆమె యిప్పుడు బంధింపబడి యుండుటకూడ కొంత మంచిదే.

మన్నా:— ఇచ్చటి మన రహస్యము నామె గ్రహించుట కవకాశము కలుగదనియేనా ?

వర్ధన్:— మరేమి ?

మన్నా:— కాని ఆ విదేశీయులను సాగనంపి యామెను విడిపించు భారమును ప్రజలు నా తలపై నుంచరా ?

వర్ధన్:— వారి నీ ద్వీపమునుండి పో విడచినచో, ముందు ముందు ద్వీపమునకే ప్రమాదము వాటిల్లగలదని ప్రజలు గ్రహించినచో, రాణీ విముక్తికై వారికి స్వేచ్ఛ నిచ్చుట కెన్నడును ప్రజ లిచ్చగింపరు. ఆ విషయ మునకేమి, చూచుకొందము. ఇంక ప్రస్తుతము ఈమెనుగూర్చి యేమి యోచించితివి ?

ఈ ప్రశ్నకేమి ప్రత్యుత్తరము వచ్చునాయని జీవన్ బల్లివలె గోడకంటుకొనిపోయి వినజొచ్చెను.

మన్నా:— వర్ధన్ ! ఇదియొక పెద్దసమస్య. ఈమె ఇచ్చట నున్నదని రత్నమాల కేమాత్రమైన తెలిసినచో ప్రళయము సంభవించును. వద్దని యెంత చెప్పినను విడువక వెంట వచ్చినది.

ఈవిషయము జీవన్‌కు తెలియును.

వర్ధన్:— ఇంతకును, ఈమెయా, ఆమెయా! ఎవరు మిగులుట నీ యభీష్టము ?

మన్నా:— నిస్సందేహముగ రత్నమాలయే !

వర్ధన్:— సరియే. అట్లే యగును. దాని కేమి ?

ఇంతటితో జీవన్ వినవలసిన ప్రధానాంశము ఆతని కర్ణముల బడెను. ఒక అమాయకురాలు మన్నా స్వార్థ తృష్ణకు బలికానున్నది! ఈ ఘాతుక కార్యమునకు వర్ధన్ సహకారి! ఆతని హృదయము అట్టుడికిన ట్లుడికిపోవు చుండెను. చేతనున్న పిస్తోలు హుంకరింప జొచ్చెను. ఆ రెండు కరాళ కపాలములను ప్రేల్చివైచుట కాతని చిత్తము

తత్తరపడెను. కాని, ఆ పని ఆ ద్వీపవాసులచేతనే చేయించెదనని నిశ్చయించుకొని యప్పటికి శాంతించెను.

అంతలో, లోపలిద్వారము తెఱువబడినట్లు శబ్దము వినవచ్చెను. ఉత్తరక్షణమే అమృతరస మొలుకుచున్న మృదుల స్వరముతో మన్నా, "ప్రియా! నిద్రాభంగ మైనదా? ఇంతవఱకును కంటికి కూర్కు లేక మే మిర్వుర మును నీ క్షేమము నిమిత్తమే మార్గాన్వేషణము చేయుచు వితర్కించుకొనుచుంటిమి." అని పల్కెను.

"రత్నమాలాదేవి యిప్పు డెచ్చట నున్నది?" అని యొక స్త్రీ కంఠము ప్రశ్నించెను. ఈ కంఠస్వరము బొంబై సముద్రతీరమున జీవన్‌లాల్ వినియున్నదే! ఆతనికి సంపూర్తిగ సందేహ నివృత్తి యయ్యెను.

"రత్నమాలాదేవి ప్రస్తుత మా విదేశీయులచే స్వగృహమందే బందీకృతయై యున్నది! ఇంతలో బంధ విముక్తయై బయటపడు సూచనలు లేవు. నీ కేమియు భయములేదు. పద్మా! ఇంకను కొంతరాత్రి యున్నది. పోయి నిశ్చింతగ విశ్రమింపుము." అని పద్మలతను లోనికి పంపి, తలుపు తెఱచి వసారామీదికి వర్ధన్‌తో కలసి వచ్చెను. మార్జాలమువలె చప్పుడు చేయక జీవన్ గవాక్షము చెంత నున్న తుప్పచాటునకు తప్పుకొనెను. వసారాపై క్షణమాత్రము మన్నా వర్ధనులు ఏదో గుసగుసలాడి తిరిగి లోనికి పోయిరి. అప్పటికి తూర్పు తెల్లవారుచుండెను. ఇంక నచ్చట మసలినచో ప్రమాదము సంభవించునని జీవన్ మెల్లగ నిశ్శబ్దముగ ఆ గృహావరణమును గడచి యీవలకు

వచ్చి నిర్జనమై యున్న యీ వనమార్గమున తిరిగి కుడ్యోపరి భాగమునకు వచ్చెను.

అప్పటికి పెరటి యావరణమందు నిలచి శంకర్ భీత చేతస్కుడై జీవన్ కొఱకు దిక్కులు చూచుచుండెను. కలవరమొందుచున్న యాతని జూచి ప్రాకారముపై నుండి పెద్ద నవ్వు నవ్వుచు, "శంకర్! నన్ను పులి యెత్తుకొని పోయినదనుకొంటివా?" అని ప్రశ్నించుచు గోడదిగి శంకర్ కడకు వచ్చెను.

శంకర్:— ఎచ్చటకు పోయితివి జీవన్! శత్రువులకు చిక్కితి వేమో యని భయపడితిని.

జీవన్:— అందేమియు ఆశ్చర్యము లేదు. కాని, త్వరలోనే జరుగనున్న ఒకానొక అంతర్నాటకపు సన్నాహ మంతయు కండ్లార చూచివచ్చితిని.

శంకర్:— ఏమది?

జీవన్:— ఆ పర్వత శిఖరము సమీపమునందున్న కుటీరము నందు ఇప్పు డెవరున్నారో నీకు తెలియునా? — నాడు బొంబై సముద్రతీరమున మన్నా చెంత మనము చూచిన స్త్రీ! పట్టుబట్టి యిచ్చటకు వాని వెంట వచ్చినది. రత్నమాలాదేవి కంట దుమ్ముకొట్టి ఈ కిరాతకు డామె నా కుటీరమునందు దాచియు న్నాడు. రత్నమాలను చేపట్టుటకై నేడో రేపో పాప మా యమాయక స్త్రీ హత్య గావింపబడును. వారి యీ సన్నాహమంతయు వారి సంభాషణము

వలన సంపూర్ణముగ నేను గ్రహించి యున్నాను. ఈ విషయము, పాపము, రత్నమాలకు తెలియదు. అమాయకముగ ఆ ధూర్తుని విశ్వసించుచున్నది. ఇప్పు డేమి చేయవలయునో నాకు తోచుటలేదు. అని పెద్ద నిట్టూర్పు విడచెను.

ఆతని రాకకై యెదురు చూచుచు నిలువు గ్రుడ్లతో రత్నమాల డాబా యంచుపై నిలచి యుండెను. ఆత డామెను చూడలేదు. కాని, ఆతని నోట వెల్వడిన ప్రత్యేకాక్షరమును ఆమె విస్పష్టముగ వినెను. ఆమె పాదములక్రింద నొక గొప్ప భూకంప మావిర్భవించినట్లయ్యెను. ప్రపంచమంతయు నామె కన్నుల యెదుట గిఱ్ఱున తిరుగసాగెను. పెద్ద నిట్టూర్పు విడచి ఆ స్థలమును విడచి యామె లోనికి బోయెను.

దీర్ఘయోచనాగతుడై జీవన్‌లాల్, శంకర్ వెంట నడువ, గృహముజొచ్చి చావడిలోనికి బోయి సోఫాపై కూలబడెను. భళ్లున తెల్లవారెను.

# అధ్యాయము 7

ఆతని హృదయమునం దొక భయంకర జలావర్తము విక్రమించుచుండెను. నిస్సంశయముగ, ఈక్షణమో, ఉత్తరక్షణమో, హత్యగావింపబడనున్న ఆ కుటీర యువతిని రక్షించు టెట్లు? ద్రోహియైన మన్నా మాయాజాలమునందు చిక్కువడి అధోగతిపాలు కానున్న రత్నమాలను రక్షించు టెట్లు? ఆ ప్రయత్నమునందు ప్రాణములనైన ధారవోయుటకు జీవన్ సిద్ధముగ నుండెను. సహజముగ మహాసాహసి! కాని, ఆతని దృక్పథమున ప్రస్తుత మంధకారము తప్ప వేఱేమియు గోచరించుట లేదు. రత్నమాల తన్ను విశ్వసించునా? అదియే సాధ్యమైనచో, ఆతని మార్గమున అంతరాయమే లేదు. ఏమియు తోచక, శూన్యదృష్టితో, జీవన్ ఆ సోఫాపై కూలబడి యుండెను. తక్కిన మువ్వురును పోయి కార్యాంతర నిమగ్నులై యుండిరి.

అంతలో మేడమెట్లు వడివడిగా దిగివచ్చి రత్నమాల జీవన్ సోఫాచెంత నిలువబడెను. ఆమెను చూచి, జీవన్ తటాలున లేచి సగౌరవముగ నామె కభ్యుత్థాన మొనర్చి కూర్చుండజేసెను. ఆమె ముఖము వికాసహీనమై యుండెను. నేత్రములయం దీవఱకు జృంభించుచుండిన గర్వోద్రేకము ఏమైనదో తెలియదు.

"కుటీరమునం దేమి చూచితివి?" అని యామె మెల్లగ హీనస్వరమున ప్రశ్నించెను.

"ఏమి కలదని సీతో చెప్పితినో అది చూచితిని. నీవే స్వయముగ నచ్చటకు బోయి చూచియుండినచో బాగుండి యుండును. రాణీ! నన్ను విశ్వసించెదవా?"

అని జీవన్ కటీరమునందు తాను చూచినది, వినినది, అంతయు సవిస్తరముగ వివరించెను. అంతయు విని రత్నమాల దీర్ఘమగు నొక్క నిట్టూర్పు విడచి, "వారామెను హత్య చేయుదురా?" అని ప్రశ్నించెను.

జీవన్ :— అట్లే తోచుచున్నది.

రత్న :— ఆమెను రక్షించుట కుపాయము లేదా?

జీవన్ :— (కొంచెము యోచించి) నాకొక్కటే యుపాయము తోచుచున్నది. అది నీ చేతులయం దున్నది.

రత్న :— ఏమది?

జీవన్ :— నీ నిమిత్తము కదా ఆమె హత్య గావింపబడ నున్నది?

రత్న :— ఎట్లు?

జీవన్ :— ఆతడు వివాహితుడనియు, భార్యతో కాపురము చేయుచున్నాడనియు నీకు తెలిసినచో, నీ వాతని వివాహ మాడవు కదా! కావున, ఆ రహస్యము నీకు తెలియకుండుటకే ఈ హత్య!

రత్న :— అయిన, ఆమె రక్షణము నా చేతులయం దెట్లున్నది?

జీవన్ :— నీ వివాహము బంధింపబడి యుండునంతవఱకు ఆమెకు ప్రాణభయము లేదని నే నూహింతును.

రత్న :— ఎట్లు?

జీవన్:— నీవిచ్చోటనుండి బయలుపడితివేని, నిన్ను చేపట్టుటకై, మన్నా ఆమెను హత్యచేయును. నీవు నా చేతులయం దుండునంత కాలమును సంశయచిత్తుడై వాడు ఉన్న భార్యను చంపుకొనడు.

రత్న:— అట్లైన నీ యభిప్రాయ మేమి ?

జీవన్:— ఇచ్చట, మాతో, మేముంచగలిగినంత కాలమును నీ వుండుట కంగీకరింతువా ?

రత్న:— అదెట్లు పొసగును ?

జీవన్:— నీ పినతండ్రి రక్షణమున నీ వెంత నిరపాయముగ నుంటివో, అంత నిరపాయముగ నిన్ను మేము కనిపెట్టెదము.

రత్న:— ఎంతకాల ముండగలను ? నే నెప్పటికైన నా ప్రజల తోడిదాననే కదా? మీరు మాత్ర మీ గృహమునం దింక నెంతకాల ముండగలరు ? ఇంక నెన్ని దినముల వఱకు ఇచ్చటి యాహారసామగ్రి మీకు సరిపోవును ?

జీవన్:— ఇంక నొక వారము దినములవఱకు బాధలేదు.

రత్న:— పిమ్మట మీ గతి యేమి ?

జీవన్:— రెండుదినములలో ఇంత గ్రంథము నడచినప్పుడు, వారముదినములలో కథ ముగియకపోవునా ? మన్నా నురికంబ మెక్కించుటతో కథ సమాప్తమైపోవును.

రత్న:— (నవ్వి) నీ సాహసమునకు సంతసించుచున్నాను. మన్నాను నీవురి తీయింతువో, నిన్ను మన్నా ఉరి తీయించునో !

జీవన్:- అది నీచేతులయం దున్నది.

రత్న:- నేను ప్రజల చేతులయం దున్నాను. ప్రజలు మన్నా చేతులయం దున్నారు.

జీవన్:- ఈ ద్వీపముపై శాసనాధికారము మన్నా చేతుల యం దున్నదా?

రత్న:- శాసనాధికారము గల ప్రభుత్వమునకును మన్నా కును మధ్య మహాసముద్ర మున్నది. ఎన్నఁడో కాని ప్రభుత్వాధికారు లీ ద్వీపమునకు రారు.

జీవన్:- వారు కాకున్న ఇతరు లెవ్వరును ఇచ్చటకు రారా?

రత్న:- ఎక్కడెక్కడనుండియో జాలరులు తప్ప వేఱెవ్వరు నిచ్చటకు రారు.

జీవన్:- ఆ జాలరులు వచ్చి యెచ్చట విడియుచుందురు?

రత్న:- ఈ పర్వతమున కావలి సముద్రతీరమునకు వచ్చు చుందురు. ఏమి? వారిని కలసికొనుటకు యోచించు చుంటివా? నిష్ప్రయోజనము. వారిని నీవు కలసి కొనజాలవు.

జీవన్:- నీవు మాకు సహాయము చేసినచో —

రత్న:- నేను మా ద్వీపమునకు ద్రోహముచేసినదాన నగుదును.

జీవన్:- సహాయము చేయనిచో, నీ కట్టెదుట న్యాయము కొఱకు నాలుగు ప్రాణములు బలియైపోవును. నీవు, భార్యాద్రోహి, ప్రభుద్రోహి, ఆత్మద్రోహి వైన

యొకానొక యధమాధమ వంచకునకు ద్వితీయ భార్య వగుదువు!

ఈ పల్కులకు రత్నమాల నిరుత్తరయై అవనత వదనయై శిలాప్రతిమవలె నిశ్చేష్ట యయ్యెను.

ఇంతలో లోనుండి శంకర్ అట్టహాసము వినవచ్చుటచే జీవన్ రత్నమాల నా స్థితియందు విడచి లోనికి బోయెను.

ఆతడు తిరిగి చావడిలోనికి వచ్చుసరికి రత్నమాల యచ్చట లేదు. "రాణీ" అని బిగ్గఱగ పిలచెను. ప్రత్యుత్తరము లేదు. చావడి నలుమూలలను పరికించెను. ఎచ్చటను లేదు. మేడమెట్లెక్కి తెఱచియున్న ఆమె గదియందు చూచెను. అచ్చట సహితము లేదు. కలవరపాటుతో, "రాణీ! రాణీ!" అని పై మెట్టుపై నిలచి బిగ్గఱగా నఱచెను.

"ఇచ్చటనే యుండగా మేడపైకేల పోయితివి?" అని క్రిందినుండి యామె ప్రత్యుత్తరము వినవచ్చెను. వడివడిగా నాతడు మెట్లు దిగివచ్చి చూడగా, పూర్వస్థానమందే యామె కూర్చుండి యాతని జూచి కిలకిల నవ్వసాగెను. అంతయు నింద్రజాలమువలె నాతనికి దోడగట్టెను.

"రాణీ! నేనుపోయి మూడు నిముషములైన కాలేదు. ఈ స్వల్పవ్యవధియందు నీ వదృశ్యవైతివి? ఎచ్చటకు పోయియుంటివి? అని దిగ్భ్రమచెందుచు నాతడు ప్రశ్నించెను.

రత్న:— ఎచ్చటకు పోయియుంటినో నీకు చెప్పవలయునా?

జీవన్:— అవసరములేదు. ఈ ఇంద్రజాలమునందలి రహస్యమేమో తెలియగోరుచున్నాను.

రత్న :- అది నీకు తెలుపుటకు వలను పడదు. ఈ గృహము నందు నన్ను నీవు బంధించితి వనుకొనుట కేవలము భ్రమ యని నీ విప్పుడైన గ్రహించితివా ?

జీవన్ :- గ్రహించితిని. కాని, రాణీ! ఆ రహస్యమేదో నాకు తెలుపవా ?

రత్న :- అసాధ్యము. ఆ రహస్యము మా వంశీయులకు తప్ప ఇతరులకు తెలియదు. తెలియరాదు. అది ప్రమాణ బద్ధమై యున్నది. దానిని వెల్లడిచేయు వ్యక్తిని వంశస్థులైన బంధువులు తక్షణమే సంహారింతురు. ఇంక నేనెట్లు నీ కా రహస్యమును చెప్పగలను ?

జీవన్ :- ఒక్క మన్నా తప్ప ఇంక వంశస్థులైన బంధువులు నీ కెవ్వరు కలరు ?

రత్న :- చాలును. ఆ మన్నాయే నన్ను సంహరించును.

జీవన్ :- ఇందుండి గుప్తమార్గ మేదైన బయటకు కలదా ?

రత్న :- చెప్పను.

జీవన్ :- ఏదైన పాతాళ గృహ మున్నదా ?

రత్న :- చెప్పను.

జీవన్ :- మరి నీ వెట్లు మాయమైతివి ?

రత్న :- చెప్పను.

జీవన్ :- చెప్పవా ?...చెప్పవా ?...ఇందలి రహస్య మేదో నేనే స్వయముగ తెలుసుకొందును. కుడ్యద్వార సమేతముగ ఈ గృహమును పెల్లగించి నే నీ రహస్యమును బహిర్గత మొనర్చెదను.

అని యుద్రేకపరవశుడై నేలను గోడలను త్రవ్వి చూచుటకు పెరటింట నున్న పరికరములను తెచ్చుటకై రివ్వున లోనికి బోయెను.

ఇచ్చట జరిగిన యీ విచిత్రోదంతము లోపల ఇష్టాగోష్ఠియందు కిలకిలలాడుచున్న శంకర్ బాజీ గోపీల కేమియు తెలియదు.

నాలుగైదు నిముషములలో జీవన్ ఒక పెద్ద గునపమును చేతబట్టుకొని మరల చావడిలోనికి వచ్చెను. రత్నమాల తన స్థానమునందు లేదు. "రాణీ!" అని యెలుగెత్తి యాతడొకటి రెండు సార్లు పిలచెను. ప్రత్యుత్తరము లేదు. పటాటోపమున నలుమూలలను వెదకి, మేడమెట్లెక్కి మేడగదియందు చూచెను. ఎచ్చటను కానరాలేదు. తిరిగి యదృశ్యయయ్యెను. ఆ గుప్తస్థానమెచ్చట నున్నదా యని యాతడు మెట్లపైనుండి తీక్ష్ణములైన దృగ్జాలములను నలువైపుల పర్వజేయుచుండెను.

ఇంతలో సోపానపంక్తికి అధోభాగమున, భూగర్భమునం దొక యలజడి వినవచ్చెను. ఆ వైపునకు తన దృష్టి మరలినదో లేదో, అవ్యక్తముగ నొక యార్తనాదము వినవచ్చెను. జీవన్ వడివడిగా మెట్లు దిగి, తొలి మెట్టుపై నిలచి సావధానముగ వినజొచ్చెను. తన పాదముల క్రిందనే భూగర్భమునుండి యా ధ్వని విస్పష్టముగ వినవచ్చుచుండెను. ఆ యార్తనాదము క్రమక్రమముగ దూరీకృత మగుచుండెను. నిస్సందేహముగ అది రత్నమాల కంఠధ్వనియే! ఆతని హృదయము క్షణమునకు

వేయిసార్లు కొట్టుకొనసాగెను. చేతనున్న గునపముతో ఉన్మత్తునివలె తొలిమెట్టుపై మోదసాగెను. అయిదారు ప్రేటులతో ఆ సోపానఫలకమును వహించియున్న సీల విడిపడి, ఒక భయంకరమైన పాతాళగృహమును బహిర్గత మొనర్చెను. క్షణమాత్రము దిగ్భ్రాంతుడై యాతడచ్చట నిలచి, పిమ్మట గునపమును పాఱవైచి, గుప్తదీపము నందుకొని, పిస్తోలు సిద్ధముగ చేతబట్టుకొని ఆ గహ్వర ద్వారమును బరి కించెను. క్రిందికి దిగుటకై దారు మెట్లుండెను. అచ్చటనుండి సుమా రేడడుగుల యెత్తును, అయిదడుగుల వెడల్పును గల సొరంగము ఎచ్చటకో పోవుచుండెను.

దీపకాంతియందు సుమా రిరువది యడుగులకన్న అధికము గోచరించుటలేదు. దూరమున, అంధకారమునందు పరుగిడిపోవుచున్న యడుగుల చప్పుడు వినవచ్చుచుండెను. అన్యచింతలేక మహాసాహసమున జీవన్ నిర్భయముగ మెట్లు దిగి యా పాతాళమార్గమున పరుగిడి పోవజొచ్చెను. కొంతదూరము పోవుసరికి, ఒక పురుషవ్యక్తి తనవైపునకు వచ్చుచున్న జాడ పొడగట్టెను. తక్షణమే యా వైపు నకు గుఱిచేసి పిస్తోలు ప్రేల్చెను. ఒక పెద్ద కేకవైచి యా వ్యక్తి నేలవ్రాలెను. ధూమసంకీర్ణమైన యా బిల మార్గమున పరుగిడుచు పోయి, నేల బడియున్న యా వ్యక్తిని దాటి జీవన్ ముందునకు సాగిపోయెను. ఆర్త నాద మొనర్చియున్న రత్నమాల యేమైనది? ఆమెను రక్షించుటయే ఆతని సంకల్పము. శత్రుహస్తంగతయై యామె యీడ్చుకొని పోబడిన ట్లాతడూహించెను. మరి

కొంతదూరము పోయినప్పటికి ఆ దీపకాంతియందు చాప చుట్టగ నేల బడియున్న రత్నమాల యాతని కంటబడెను. పోయిన ధనరాశిని పొడగాంచినవానివలె, జీవన్ ఆమెను జూచి హఠాత్ బంధితమైన విద్యుద్యంత్రమువలె నచ్చట నిలచెను. పురోమార్గమున వినవచ్చుచున్న యడుగుల చప్పుడు క్రమక్రమముగ దూరమున క్షీణించిపోయెను. ఇప్పు డంతయు నిశ్శబ్దము. రత్నమాల తెలివితప్పి పడియుం డెను. దీపకాంతియందు జీవన్ ఆమె నాపాదమస్తకమును పరిశీలించెను. ఎచ్చటను గాయపడలేదు. "రాణీ! రాణీ!" అని యాత డామెను తట్టి లేపెను. ఆమె మెల్లగ కన్నులు విప్పి, జీవన్ ముఖమువైపు నిదానించి, నిర్విణ్ణయై మెల్లగ లేచి కూర్చుండెను.

జీవన్:— రాణీ! ఎచ్చటనైన గాయము తగిలినదా?

రత్న:— లేదు. ఆ దుర్మార్గులు బలవంతముగ నన్ను మోసు కొనివచ్చి, నీ రాక కనిపెట్టి, గత్యంతరము లేక యిచ్చట నన్ను కూలవైచి పరుగిడిపోయిరి.

జీవన్:— ఎంత ప్రమాదము! నేను వచ్చులోపల నీవు మరల నేల ఈ భూగర్భమున ప్రవేశించితివి?

రత్న:— నిన్ను మరియొకసారి యాచించుట కట్లు చేసి తిని. ఇంతలో, ఎట్లు లోన ప్రవేశించెనో తెలియదు, వర్ధన్ తన పరిచారకుడైన బదరీ సహితముగ ఈ బిలద్వారమున నక్కియుండెను. నేను లోన ప్రవేశించినంతనే, వా రిద్దఱును నన్ను పట్టి లోని

కీడ్చుకొని పోసాగిరి. నే నెంత ప్రయత్నించినను వారి బలిష్ఠ హస్తములనుండి తప్పించుకొనజాలక ఆక్రందన మొనర్చితిని.

జీవన్:— ఆ యాక్రందనమే ఈ రహస్యమార్గమును నాకు చూపినది. పిమ్మట నేమైనది ?

రత్న:— పిమ్మట నీ రాకను గుర్తించి నన్ను నేల పడవైచిరి. వర్ధన్ నన్ను దృఢముగ బట్టియుండి, నిన్నెదుర్కొనుటకై బదరీని పంపెను.

జీవన్:— బదరీ ! కాశీ సోదరుడు బదరీ !

రత్న.— అగును.

జీవన్:— పాపము ! మమ్మీ ద్వీపమునకు జేర్చిన నావిక సోదరులు ! బదరీ కళేబర మదిగో ! నన్నెదుర్ప వచ్చిన ఫలము !

రత్న:— నీ పిస్తోలుశబ్దము వినినంతనే వర్ధన్ నన్ను విడచి పరుగిడి పోయెను.

జీవన్:— రాణీ ! ఈ రహస్యమార్గము మీ వంశస్థులకు తప్ప ఇతరులకు తెలియదంటివే ! బదరీ వర్ధనుల కెట్లు తెలిసెను ?

రత్న:— నిస్సందేహముగ మన్నా చెప్పివైచి యుండును.

జీవన్:— అట్లు చెప్పినవానిని మిగిలిన వంశస్థులు సంహరింపవలెను కదా ? అయినచో, మన్నాపట్ల ఇప్పుడు నీ కర్తవ్య మేమి ?

రత్న:— మన్నా ద్రోహము చేసెను. కాని, నే నబలను! నిస్సహాయను!

జీవన్:— నిస్సహాయ వెట్లగుదువు? నేను లేనా?

రత్న:— ద్వీపవాసు లందఱును మన్నా పక్షము!

జీవన్:— ఔగాక! నీవు మా పక్షమునం దున్నచో, ధర్మము నకు జయము కల్గును. నా కంఠమునందు ప్రాణము లుండునంతవఱకు నీ కపాయము కలుగ నేరదు. రమ్ము, పోవుదము. ఇంక నీ ప్రదేశమున మసలుట యుక్తము కాదు.

అని యామెను తోడ్కొని జీవన్ ఆ బిలమార్గము నందు వెనుకకు బోయి, మార్గమున పడియున్న బదరీ కళే బరమును తప్పుకొని వచ్చి, తిరిగి యా రహస్యద్వారమున చావడియందు ప్రవేశించెను.

జరిగిన యీ యంతర్నాటక మేమియు శంకర్ బాజీ గోపీలకు తెలియదు. వంటగదిలో, కేళీవిలాసములలో, నిర్విచారముగ వారు పాకశాస్త్రచర్చ గావించుకొను చుండిరి. సుమారు పదిగంటలకు ఆహారసామగ్రితో వారు చావడిలోనికి వచ్చిరి. ఇంచుక యాహారమును గ్రహింపు మని జీవన్ రత్నమాలను నిర్బంధించెను. కాని యామె గ్రహింపలేదు.

# అధ్యాయము 8

తదనంతరము జరిగిన యుదంత మంతయు జీవన్ తన ముప్వురు మిత్రులకును పూసగ్రుచ్చినట్లు వివరించెను. నిలువుగ్రుడ్లతో వారా వృత్తాంత మంతయు విని, నిర్విణ్ణులై, నోట మాటరాక, వెలవెల బోవుచుండిరి. అంత జీవన్,

"మిత్రులారా! కార్చిచ్చు మధ్యమున మన మిప్పుడు కట్టువడి యున్నాము. మనతోబాటు రత్నమాలాదేవి సహితము కట్టువడి యున్నది. ఈమె క్షేమమే మన క్షేమము. ఈ పాతాళమార్గమే మన కందఱకును ముక్తిమార్గమని నే నూహించుచున్నాను. — రాజ్ఞీ! ఈ మార్గ మెచ్చటకు పోవును?" అని యామెను ప్రశ్నించెను. ఇంక నామె కా రహస్యము దాచవలసిన ఆవశ్యకత లేదు. నిస్సంశయముగ నామె యిట్లు పల్కెను.

"ఈ మార్గమున సరాసరి పోయినచో పర్వతమున కావలనున్న సముద్రతీరమును చేరవచ్చును."

జీవన్:— ఇంక నేమి! సముద్రతీరమును చేరగల్గినచో సర్వమును చక్కచేయగలను.

రత్న:— కాని, ఈ మాత్రము యోచన మన్నాకు లేదనియే భావించుచుంటివా? ఈసరికి ఆత డా ద్వారమును భద్రముగ కాచియే యుండును. అటుకాదు, జీవన్! నీవు నా శ్రేయోభిలాషివి! నీ శ్రేయము నిమిత్తము నేను నీకు వేరొక మార్గమును జూపెదను. దీపమును పట్టుకొని నా వెంట రమ్ము.

అని లేచి నిలువబడెను. మహోత్సాహముతో జీవన్ లేచి దీపమును బట్టుకొని, "శంకర్! మేము తిరిగి వచ్చు వఱకు మీరందఱు నిచ్చట నప్రమత్తులై యుండుడు" అని పల్కి యామె వెనువెంట, ఆ భూగర్భమునందు ప్రవేశించెను. అతని చేతనున్న దీపమును తా నందుకొని రత్నమాల ముందు నడువసాగెను.

జీవన్:— దేవీ! నేనే ముందు నడచిన బాగుండును. ఆ దుర్మార్గు లెవ్వరైన ఈ మార్గమున నక్కి యుందురేమో!

రత్న:— భయములేదు. ఈ రహస్యమార్గమును మనాన్న ఒకరిద్దఱకు తప్ప ఇతరులకు చెప్పియుండడు!

జీవన్:— దేవీ! ఈ రహస్యము నంత భద్రముగా దాచవలసిన యవసర మేమి?

రత్న:— శత్రుభయము కలిగినప్పుడు మా కుటుంబము నిరపాయముగ తప్పించుకొనుట కిది యుపకరించును. మరియు, ఈ ద్వీపమునందలి నాయకు డెవ్వడైన బలవంతుడై తనకు ప్రమాదహేతువు కానున్నప్పుడు, వాని ననాయాసముగ నంతమొందించుట కీ రహస్య ముపయోగించును.

జీవన్:— ఎట్లు?

రత్న:— రమ్ము చూపెదను.

అని మరికొంత దూరము నడచివచ్చి, ఒకానొక స్థలమున నిలచి, దీపమును పైకెత్తి, ఎదుటనున్న దృశ్యమును చూడుమని జీవన్‌తో చెప్పెను. ఆ దృశ్య మత్యంత భయం

కరముగా నుండెను. బాటకు రెండువైపుల నానుకొనియున్న పర్వతపుగోడలు ఇంచుక ఎడమయ్యెను. బాట సన్నగిల్లి కేవలము రెండడుగుల వెడల్పున, అంచుకట్టులేని వంతెనవలె నేర్పడియుండెను. ఈ వంతెన బాటకిరుప్రక్కలను ఎడమైన కొండగోడల కానుకొని యొక యగాధము దృష్టిగోచరమయ్యెను.

జీవన్:— రాణీ! ఈ మార్గముపై మూడడుగులు నడచుసరికి, ముఖము తిరిగి యీ యగాధమునందు పడకతీరదు.

రత్న:— అగును. తనకు ప్రమాదహేతువు కాదగు ప్రజానాయకుని ద్వీపాధిపతి మంచిమాటలతో ఈ స్థలమునకు వెంటబెట్టుకొని వచ్చి, ఆ వంతెనబాటపై నిలిపి, ఆ దృశ్యమును దిగ్భ్రాంతుడై చూచుచున్న సమయమున, ఇట్టి యీ యగాధపాతాళములోనికి నెట్టివేయును. సరి. ఇంక తనకు నిర్భయము!

జీవన్:— ఈ యగాధ గహ్వరము అడుగున నేమున్నది?

రత్న:— పోయి జాగ్రత్తగ నీవే పరిశీలించుము.

అంత జీవన్ అతి భద్రముగ ఆ బాటపై నోరగిలి, ఆ పాతాళగర్భములోనికి తొంగి చూచెను. అడుగున సుమారు నూరడుగుల దూరమున తళతళ లాడుచున్న జల తరంగములు కానవచ్చుచుండెను.

జీవన్:— దేవీ! అడుగున నొక జలప్రవాహము కానబడుచున్నది! ఆ ప్రవాహ మెచ్చటకు బోవుచున్నది?

ఇచ్చటనుండి జారిపడిన వ్యక్తి ఆ ప్రవాహామార్గమున నెచ్చటకు బోవును?

రత్న:— ప్రవాహామున పడకపూర్వమే మార్గమధ్యమున పాషాణనిహతుడై స్వర్గమునకు పోవును. అదృష్టవశమున పాషాణములకు తగులక ప్రవాహామునందే పడినచో, అచ్చటి సుడిగుండములందు చిక్కువడి పాతాళమునకు పోవును. ఇంకను అదృష్టముండి సుడిగుండములను తప్పి ప్రవాహావేగమున కొట్టుకొని పోయినచో సముద్రమునందు తేలును.

జీవన్:— ఈ మార్గమున సముద్రము చేరుటకు సాధ్యమగునా?

రత్న:—ప్రాణములతో చేరుట యసాధ్యము. కాని... కాని... జీవన్! నీవు నాకొక వాగ్దానము చేసినచో, సురక్షితముగ పోవు నుపాయమును నేను నీకు చెప్పెదను.

జీవన్:— ఏమది?

రత్న:— ఈ ద్వీపమునందు నే నింక నివసింపజాలను. ద్రోహియగు మన్నాకు నేను దూరముగా నుండగోరుచున్నాను. నీవు నాకు ఆశ్రయమిచ్చెదనని వాగ్దానము చేయుము.

జీవన్:— రాణీ! సురక్షితమార్గమును నీవు చూపినను చూపకున్నను నీవుకోరిన వాగ్దానము నేను చేయుచున్నాను.

రత్న:— నేను మీకు మార్గదర్శినినై ఈ పాతాళప్రవాహమార్గమున సురక్షితముగ గమ్యస్థానమును చేర్చెదను. జీవన్! నన్ను సహితము నీవెంట తోడ్కొని

పోయెదవా? మిమ్ము తప్పించి నేనింక నీ ద్వీపమునందు జీవించియుండుట యసాధ్యము. మన్నా నా ప్రాణము లను తప్పక హరించును.

జీవన్:— దేవీ! తప్పక నిన్ను నావెంట దోడ్కొనిపోయెదను. మన్నా ఉరికంబమెక్కు మనోహరదృశ్యమును, తిరిగి మాతో వచ్చి నీవు సహితము చూచి యానందించ గలవు!

రత్న:— సంతోషము. కాని, అమాయికయగు నాతనిభార్య కెట్టి ప్రమాదము కలుగునో యని నేను శంకించు చున్నాను.

జీవన్:— ఇప్పుడు నీవు తన శత్రుపక్షమున చేరితివని మన్నా గుర్తించియుండినచో, ఆతనిభార్య కెట్టిప్రమాదమును కలుగదని నే నూహింతును. దేవీ! ఇంక విలంబ మేల? గృహమునకు పోయి ప్రయాణసన్నాహము గావింతము రమ్ము.

అని యామెను తోడ్కొని తిరిగి గృహోన్ముఖుడై పోయెను. మార్గమున బడియున్న బదరీ కళేబరముకడ నిలచి, "రాణీ! నీవు పోయి శంకర్ నిటు పంపుము." అని యాదే శించెను. అయిదు నిముషములలో శంకర్ అచ్చట ప్రత్యక్ష మయ్యెను. ఇరువురును కలిసి బదరీ మృతశరీరమును మోసు కొనిపోయి, ఆ పాతాళప్రవాహములోనికి జారవిడచి, వడి వడిగా గృహము జొచ్చిరి.

పిమ్మట అందరును చర్చించుకొని, ఆ సాయంకాలమే ఆ గృహము విడచి రహస్యమార్గమున ఆ ద్వీపమునుండి

బహిర్గతు లగుటకు నిశ్చయించుకొనిరి. పరిస్థితులు విషమించుటచే ఇంక నా ద్వీపమున నుండి సాహసమునకు సిద్ధపడుట అవివేక మనియు, ఎట్లైనను పోయి గోవానుండి ప్రభుత్వ సహాయమును గొనివచ్చి కార్యసాధనము చేయుటయే కర్తవ్యమనియు జీవన్ గ్రహించెను. ఒక బలమైన త్రాడు నానుకొని, ఒకరి వెనుక నొకరుగా అందరును ఆ యగాధమునందు దిగుటకును, రత్నమాల మార్గదర్శినిగా ఆ ప్రవాహమార్గమున సముద్రతీరము చేరుటకును, అచ్చటకు వచ్చు జాలరుల సహాయమున గోవా చేరుటకును, కార్య క్రమమును స్థిరపఱచుకొనిరి.

గృహావరణ మంతయు వెదకి వెదకి, లభించిన పటిష్ఠ రజ్జువులన్నిట్ల పెనవైచుచు ముడివైచుచు నెట్లో నూ అడుగుల నతిక్రమించు నొక బలమైన త్రాటిని సిద్ధపఱచి, అందరును ఆ యగాధముకడకు బోయి, ఆ త్రాటి పొడవు నీటిమట్టమును చేరుటకు సరిపోవునో లేదో పరీక్షించి, పిమ్మట ఒక కొనను పై మట్టమునగల యొక పెద్ద పాషాణమునకు పెనవైచి యథోచితముగా భద్రపఱచి, రెండవ కొనను క్రిందకు దిగ విడచిరి. తదుపరి, ముందు శంకర్, పిమ్మట బాజీ, పిమ్మట గోపీ, పిమ్మట రత్నమాల, చివరకు జీవన్ దిగుటకు నిర్ణ యించుకొనిరి. రత్నమాలను కొంతదూరమున నిలిపి, జీవన్ కార్యక్రమమును ప్రారంభింపజేసెను. అందఱును త్రాటిని దృఢముగ పట్టియుండ, శంకర్ వడివడిగా దిగజారి నీటిమట్టమునకు తగిలియున్న యొక ఱాతిమెట్టుపై నిలచి, చేరినట్లు పెద్ద కేకవైచెను. పిమ్మట బాజీ దిగెను. ఆతని

కేక విని పిదప గోపీ దిగెను. నిర్ణయానుసారము పిదప రత్నమాల దిగవలయును. దూరమున నిలచియున్న యామెను తోడ్కొనివచ్చుటకై జీవన్ ఆమెకడకు బోయెను. త్రాటికట్టుకడ నుంచిన దీపపు కాంతియందు మార్గము స్పష్టముగ గోచరించుచుండెను. ఇరువురును రెండడుగు లటు వైచిరో లేదో, ఎదుట కానవచ్చుచున్న దీపము నేలపైనుండి మూడడుగులు మీదకు లేచెను. దిగ్భ్రమచెంది యిరువురును అటు చూచుచుండగనే, ఆ దీపకాంతియందు ఒక ఖడ్గహస్తము పొడగట్టి ఆ త్రాటిని కోసివైచెను. ఒక పెద్ద హాహాకారము అగాధములోనుండి బయటకు వినవచ్చెను. దీపము క్రిందకు విసరబడెను. అంతయు నంధకారమయ మయ్యెను.

"రాణీ! ప్రమాదము సంభవించినది! శత్రుహస్తము సమయము కనిపెట్టి త్రాటిని ఖండించివైచినది! ఇంక నిచ్చట మసలినచో అపాయము కలుగును. రమ్ము. రమ్ము." అని యామె చేయిబట్టుకొని, ఆ యంధకారమున శత్రువును దూరస్థునిజేయుటకై నాలుగైదుసార్లు పిస్తోలు ప్రేల్చి, గృహాభిముఖుడై వడివడిగా వచ్చి చావడియందు ప్రవేశించి రహస్యద్వారమును బంధించెను.

"దేవీ! ఇంక చేయునదేమి? శత్రు వ్యూహమున చిక్కితిమి. మిత్రులను గోల్పడి యేకాకి నైతిని. నిన్ను దుస్తరమైన యాపదకు గురిచేసితిని. ఇంక నీ రహస్యమార్గమును భేదించియో, గృహద్వారములను భేదించియో, శత్రువులు మనల నాక్రమింతురు. నేను మరణమునకు భీతిల్లుటలేదు.

కాని నన్ను శత్రుహస్తములయందు విడచిపోవుటకు చింతించుచున్నాను.'' అని జీవన్ ఒక పెద్ద నిట్టూర్పు విడచెను.

రత్న:— జీవన్! చింతింపకుము. ఈ ద్వీపవాసులు నా కెట్టి హానియు కలుగసేయరని నే నూహింతును. కాని... కాని...

జీవన్:— దేవి! నీ సందేహమును నేను గ్రహించితిని. నన్ను రక్షించుటకు నీవు యత్నించినచో నీకు హాని తప్పదు. ఈ ద్వీపముపై నాకుగల హక్కును నీవు సమర్థించినచో నీకు హాని తప్పదు. అంతియేనా?

రత్న:— ఈ ద్వీప మెట్లును నీకు హస్తంగతము కానేరదు. ఈ ద్వీపముపై నధికారము నీదని యే ముఖముతో నేను వారియెదుట చెప్పగలను?

జీవన్:— పోనిమ్ము. ఈ ద్వీపాధిపత్యము ప్రస్తుతము నీది కాదు నాదని నీవు వ్యక్తిగతముగ స్వీకరించుచుంటివా?

రత్న:— (అమాయకపు చిరునవ్వుతో) తప్పక స్వీకరించుచున్నాను. ఈ ద్వీపము నిది! ఇంతకును, జీవన్! ఇంక 'నాది' 'నీది' యను భేదభావ మున్నదా?

ఈ పల్కులు చెవిని సోకినంతనే జీవన్ శరీర మాపాదమస్తకమును పులకాంకురిత మయ్యెను. నిమీలిత నేత్రుడై యేమి యోచించుచుండెనో కాని, కనుకొలకులనుండి రెండుమూ డశ్రుబిందువులు రాలెను.

"క్షణమాగుము" అని వడివడిగా లోనికి బోయి, ఒక పత్రముపై నేదియో వ్రాసి తెచ్చి, "దేవీ! ఈ పత్రము

సర్వావర్థములను హరింపగలదు. దీనిని స్వీకరింపుము " అని యామె కందిచ్చెను. అం దిట్లుండెను—

" నా స్థిరాస్తియైన హంసద్వీపమును ఇచ్ఛాపూర్వకముగ, ప్రజాభిప్రాయమును మన్నించి రత్నమాలాదేవికి సర్వాధికార సమేతముగ సమర్పించుచున్నాను. నేటి నుండియు రత్నమాలాదేవియే యీ ద్వీపమునకు సర్వాధికారిణి యని ద్వీపవాసు లెల్లరును గమనింతురు గాక!

ఇట్లు
జీవన్ లాల్."

ఈ పత్రమును చదువుకొని రత్నమాలాదేవి మహానందమున మైమఱచిపోయెను. కృతజ్ఞతామయములైన యామె చూడ్కుల కాతని దృష్టి చలించెను.

రత్న:— జీవన్! ఈ ద్వీప మెన్నటికైన నీదే! కేవలము తాత్కాలిక ప్రయోజనములకై దీనిని నేను స్వీకరించుచున్నాను.

జీవన్:— ఇంక నీవు స్వేచ్ఛగ నీ ప్రజామధ్యమునకు పోవచ్చును.

రత్న:— కాని, జీవన్! బద్ధవైరియైయున్న నిన్ను మన్నా తప్పక సంహరించుటకు ప్రయత్నించును.

జీవన్:— తప్పక ప్రయత్నించును. వాని రహస్యము లన్నియు నా కిప్పు డవగతములై యున్నవి కదా! చింతింపకుము. వాని ప్రయత్నములను నేను ప్రతిఘటింపగలనను ధైర్య మున్నది.

రత్న:— ఏ కాక్షైన నీవేమి చేయగలవు? ప్రయోజనము లేదు. నేను చెప్పినట్లు చేయుము.

జీవన్:— ఏమది?

రత్న:— నీవిచ్చట నే యుండి, ఇచ్ఛాపూర్వకముగ వారికి పట్టువడి, నిన్ను నాయొద్దకు తోడ్కొనిపొమ్మని చెప్పుము. వారట్లు చేయుదురు. తదుపరి కార్యక్రమము నాకు తెలియును.

జీవన్:— సరియే. అట్లే చేయుదును.

అని యాతడు పల్కెనే కాని, ఆతని కర్తవ్యము సహస్ర బాహువులతో పర్వతాగ్ర కుటీరమునుండి యాతని బిలచుచుండెను. అందున్న ఆ యసహాయ వనితను మృత్యుముఖమునుండి తప్పించుట కాతని హృదయము తత్తర పడుచుండెను. రత్నమాల విముక్తయై తిరిగి ప్రజామధ్యమునకు బోవుటతో ఆమె యాపద చేరువయ్యెనని యాత డూహించెను.

అంతలో దూరమున నొక శృంగనాదము విన వచ్చెను. అనంతర మొక పెద్ద కోలాహలము బయల్వెడలి యంతకంతకు చేరువ కాజొచ్చెను.

రత్న:— జీవన్! ఇంక విలంబమున కవకాశము లేదు. ప్రజాసంచలనము ప్రారంభమైనది. మన యిర్వురి క్షేమము నిమిత్తమును నేనింక పోవలయును. జీవన్! నీవు నాకు మహోపకార మొనర్చితివి! నాకై నీ ప్రాణము లొడ్డితివి! నా జీవనముపై అధికారము

నీయది! నీ వెచ్చట నుండినను నన్ను మఱువకని వాగ్దానము చేయుము.

జీవన్:— నా వాగ్దానమునకు ప్రమాణము చూపుటకు అవకాశము లేదు. భగవదనుగ్రహమున సప్రాణముగ స్వదేశమును చేరగల్గినచో, అచిరకాలములోనే తిరిగి యిచ్చటకు వచ్చి మన్నానుకీకంబ మెక్కించు మహోత్సవమునందు నీ దర్శనము చేయుదును. దేవి! ఇంక విలంబము చేయవలదు. వెడలిపొమ్ము. సర్వేశ్వరుడు నీకు తోడ్పడుఁగాక!

రత్న:— జీవన్! పోవుటకు పూర్వము నా స్మృతిచిహ్నముగ నీ యంగుళీయకమును గ్రహింపుము.

అని తన వ్రేలినున్న రత్నాంగుళీయకమును దీసి, యాతని వ్రేలి నలంకరించెను. పిమ్మట బాష్పాకుల నేత్రయై ముఖము వంచుకొని బహిర్ద్వారమును పురోగమించి, రాజవీధినిబడి యేకాకినియై వడివడిగా నడచి పోయెను. దృష్టిగోచర మగునంతవఱకు నామెవైపు జూచుచు జీవన్ అచ్చటనే నిలచియుండి, పిమ్మట ద్వారమును బంధించి, వడివడిగా పెరటి యావరణమును బ్రవేశించి, పూర్వమువలె ప్రాకారకుడ్యము నెక్కి, ఆ పర్వతసానువుపై వనమార్గమునం బడి కుటీరాభిముఖుడై పోయెను. సూర్యాస్తమయమై అప్పటికి సుమారొక గంట యయ్యెను.

# అధ్యాయము 9

క్షణక్షణమును క్షీణించిపోవుచున్న యా సందె వెలుగు నందు వృక్షలతా నిబిడీకృతమై యున్న యా వనమార్గము నందు, చోరునివలె అడుగుపై నడుగు వేసికొనుచు, ప్రాణము లొక చేతను, పిస్తో లొక చేతను పట్టుకొని జీవన్ ఎట్లో ఆ కుటీరావరణమునందు ప్రవేశించెను. నల్లడలను సందెచీకటు లలముకొనుచుండెను. కుటీరమునందు దీపము లేదు. అంతయు నిశ్శబ్దముగా నుండెను. గృహాముచుట్టు నొక్కసారి తిరిగివచ్చెను. ఎచ్చటను నరవాసన లేదు. మెల్లగా ద్వారముకడకు బోయి తలుపు త్రోసెను. తలుపులు విడి లోనికి త్రోవ చూపెను. మార్జాలమువలె నిశ్శబ్దముగ లోన ప్రవేశించి గదిద్వారముకడకు బోయి లోనికి తొంగిచూచెను. అచ్చట నొక మంచముపై నొక స్త్రీ శయనించియుండుట అస్పష్టముగ గోచరించెను. ఆమెను చూచి "అమ్మా!" అని మెల్లగా పిలచెను. ఆ పిలుపు వినినంతనే యామె దిగ్గున మంచముపైనుండి లేచి భయోత్పాతముచే కంపించుచు ఏదో యనబోవునంతలో నాతడు, "అమ్మా! భయపడ వలదు. కేకలిడవలదు. నేను నీకు శత్రువును కాను. నీ శ్రేయోభిలాషిని!" అని మెల్లగా పల్కెను. అంత నామె యించుక ధైర్యము తెచ్చుకొని, "ఎవరు నీవు?" అని ప్రశ్నించెను.

జీవన్:— నా పేరు జీవన్‌లాల్! నేను సహితము నీవలెనే అసహాయ స్థితియందున్న యొకానొక వ్యక్తిని!

నీ క్షేమము కోరి నా ప్రాణములను పిడికిట బట్టుకొని నే నిచ్చటకు వచ్చితిని. నా ప్రశ్నలకు ప్రత్యుత్తర మిమ్ము. ఈమన్నా నీ కేమగును ?

ఆమె :— నా భర్త.

జీవన్ :— నీ విచ్చటికి వచ్చుట ఆతని కిష్టమేనా ?

ఆమె :— లేదు. బలాత్కరించి నే నాతని వెంటబడి వచ్చితిని.

జీవన్ :— నీ విచ్చటికి వచ్చినది మొదలు ఈ కుటీరమునందే యుంటివి కదా ?

ఆమె :— అగును.

జీవన్ :— రత్నమాలాదేవిని నీవు చూచితివా ?

ఆమె :— లేదు.

జీవన్ :— ఆమె యీ ద్వీపమునకు రాణి! త్వరలోనే నీభర్తకు రాణి కాబోవుచున్నది!

ఆమె :— (చకితయై) అనగా ?

జీవన్ :— అనగా, నేడో రేపో నీ భర్త యామెను వివాహ మాడును.

ఆమె :— వివాహమా ? నే నుండగనే ?

జీవన్ :— నీ వుండగా అది జరుగదు. నీ వుండుటయే ఇప్పుడు నీ భర్తకు పెద్ద ప్రతిబంధకమై యున్నది. ఈ ప్రతిబంధకమును తొలగించుకొనుటయే యిప్పు డాతని సంకల్పము.

ఈ పలుకు లామె కర్ణముల బడినంతనే ఒక మహాసముద్ర మామె హృదయమున ఘూర్ణిల్ల జొచ్చెను. ఆమె

యంతర్నేత్రమునకు ఒకానొక చిత్రఫలకమునందువలె మన్నాతిన్ని ఆ ద్వీపమునకు రావలదని చెప్పినది మొదలు ఆ క్షణము వఱకు నడచిన కార్యక్రమ మంతయు విస్పష్టముగ గోచరించెను. జీవన్ పల్కినది వాస్తవమని యామె యంత రాత్మ చెప్పుచుండెను. ఆమె శూన్యదృష్టియందు భయంకర కాలమేఘములు ఘనీభవింప జొచ్చెను. గద్గద స్వరముతో నామె జీవన్ వైపు జూచి, "అయ్యా! ఇప్పుడు నన్నాత డేమి చేయ దలచెను?" అని దీనముగ ప్రశ్నించెను.

జీవన్ :— అమ్మా! నన్ను విశ్వసించెదవా? ఆమె నిమిత్తము నిన్నాతడు హత్య చేయ నున్నాడు. ఆతనికి వర్ధన్ కుడిభుజమై యున్నాడు. వారిద్దరి సంభాషణమును నేను స్వయముగ వినియున్నాను.

అని ఆనాటి రాత్రి తాను చెవులార విన్న మన్నా వర్ధనుల సంభాషణ మంతయు పూసగ్రుచ్చినట్లు చెప్పెను.

"అమ్మా! నీ పేరు 'పద్మ' యని నీ భర్త సంబోధ నమువల్ల గ్రహించితిని. ఇంతవఱకును నీవింక జీవించి యుండుటయే నీ యదృష్టము. ఇంతవఱకును రత్నమాల నా నిర్బంధమునం దుండుటచే నీవు జీవించి యుంటివి. ఇప్పు డిప్పుడే యామె నా హస్తములనుండి విముక్తయైనది. ఇంక నీ కపాయము చేరువ యైనదని గ్రహింపుము.

పద్మ :— ఆమె నా మరణమును కోరుచున్నదా?

జీవన్ :— ఎంతమాత్రమును లేదు. ఆమె నీ క్షేమమే కోరు చున్నది. నీవు భయపడవలసినది ఆమె వలన కాదు.

నీ భర్తవలన ! ఆ పరమ ఘాతకుడు అవివాహితగనిగా ఆమెకు కన్పట్టుటకై నిన్ను హత్యగావింప నున్నాడు!

అంత నామె భయాకుల చిత్తయై తత్తరపాటుతో, " అయ్యా! ఇప్పుడు నా కర్తవ్యమేమి? నేనింక నెచ్చటకు పోవుదును? నన్ను రక్షింపుము " అని యాతని పాదములపై వ్రాలెను.

జీవన్ :— అమ్మా! కంఠమున ప్రాణ మున్నంతవఱకు నీ కాపద రానీయను. కాని... కాని...

అని యొక పెద్ద నిట్టూర్పు విడచి ఏదో యనబోవు నంతలో, గృహావరణమునందు అలికిడి వినవచ్చెను. పిమ్మట నొక గంభీరమైన కంఠధ్వని! " మీ రిచ్చట వేచియుండుడు. నేను పిలచిన తక్షణమే రావలయును." అను మాటలు విన వచ్చెను. ఆ శబ్దమును విని ఆమె తటాలున లేచి తొట్రుపాటుతో, " వర్ధన్ ! వర్ధన్ వచ్చుచున్నాడు! ఆ నిలువుటద్దము వెనుకకుబోయి దాగియుండుము. నాలుగైదు నిముషములలో నేను వానిని పంపివైచెదను." అని రివ్వున పోయి తలుపు చేరవైచి మంచముపై కూలబడెను. జీవన్ నిశ్శబ్దముగ పోయి నిలువుటద్దము వెనుక దాగెను. మరి రెండుమూడు క్షణములలో మత్తగజమువలె వర్ధన్ తలుపు త్రోసుకొని యా గదిలో ప్రవేశించి '' దేవీ! నీ శరీరమునం దిప్పుడు సుఖముగా నున్నదా ?'' అని ప్రశ్నించెను.

పద్మ :— సుఖమా? ఇచ్చటకు వచ్చినది మొదలు నాకు సుఖమే !

వర్ధన్ :— అమ్మా! విచారింపకుడు. త్వరలోనే మీ మనో వేదన లన్నియు తీరిపోవును. మన్నా ప్రభువునుండి యొక వర్తమానము తెచ్చియున్నాను.

పద్మ :— వా రిప్పుడు భోజనమున కిచ్చటకు రారా?

వర్ధన్ :— రారు. మిమ్మే రాజగృహమునకు తోడ్కొని రావలసినదని నన్ను పంపినారు. అచ్చటనే మీరు భుజింతురు. ఆ గృహమునందలి రహస్యము లనేక ములు మీకు చూపదలచినారు.

పద్మ :— ఏమి రహస్యములు?

వర్ధన్ :—అం దొక పాతాళ గృహ మున్నది.

పద్మ :— ఈ స్వర్గగృహమునుండి నన్నా పాతాళగృహము నకు తరలింప నున్నారా? ఎప్పుడో చూడవచ్చును. ప్రస్తుతము శిరోవేదనచే నాతల బ్రద్దలగుచున్నది. ఇచ్చటినుండి కదలి రాజాలను.

వర్ధన్ :— దేవీ! తప్పక తోడ్కొని రమ్మని చెప్పినారు.

పద్మ :— రాజాలనని చెప్పితిని కదా!

వర్ధన్ :— ఎట్లైననుసరే మిమ్ము నేను తోడ్కొని పోవకతీరదు.

పద్మ :— (ఇంచుక తీక్ష్ణముగ) నన్ను బలాత్కారముగ కొని పోయెదవా?

వర్ధన్ :— మెల్లగ, మెల్లగ మాటాడుడు. ఇచ్ఛాపూర్వక ముగ రానప్పుడు బలవంతముగ మోసుకొని పోవలసి వచ్చును. ఈ చెంతనే నా మనుష్యులు, కాశీ,

హాస్యా వేచుకొని యున్నారు. వానిని పిలువు మందురా ?

అని ఉచ్చస్థాయిని జెదరించెను. నిలువుటద్దము వెనుక నిలచియున్న జీవన్ శరీర మాపాదమస్తకమును ఆగ్రహాతిరేకమున భగ్గున మండిపోవుచుండెను. చేతనున్న పిస్తోల్ హుంకించుచుండెను. ఒక్క ప్రేలుడుతో ఆ కిరాతకుని కపాలము ప్రేలి ఖండఖండములై నేల పడును. కాని, ఆ శబ్దము తనకు ప్రమాదకరము. మెఱపు మెఱసినట్లు మెఱసి ఆ భావ మంతరించెను. అద్దము వెనుక తనచెంతనే గోడకు ప్రేలియున్న యొక పెద్ద బాకు ఆతని దృష్టి నాకర్షించెను. నిశ్శబ్దముగ నాతడా బాకు నందుకొనెను.

"ఏమందురు ? పిలువు మందురా, లేచి వచ్చెదరా ?" అని వర్ధన్ మరల గర్జించెను.

"రాను. రానని చెప్పుము" అని యామె నిర్లక్ష్యముగ ప్రత్యుత్తర మిచ్చెను.

"అట్లనా ? మంచిది." అని యాతడు గవాక్షమువైపు రెండడుగులు వైచెను. మూడవ యడుగు పడుసరికి, ఎదుట ఉగ్రాకారుడై బాకు నెత్తిపట్టి జీవన్ ప్రత్యక్ష మయ్యెను. ఆతని జూచి దిగ్భ్రాంతుడై నోట మాటరాక వర్ధన్ ఏలువు గ్రుడ్లతో నిలచిపోయెను. ఉత్తరక్షణమే జీవన్ చేతి బాకు వర్ధన్ గుండెయందు పిడికట్టువరకు నాటిపోయెను. కిక్కురుమనకుండ ఆ మహాకళేబరము నేలబడి గిజగిజ గింజుకొన సాగెను. దాపున నున్న వస్తుసంచయ మంతయు చెల్లాచెదరై గది యంతయు ఫెళఫెళారావములతో ఘూర్ణిల్ల

జొచ్చెను. ఈ శబ్దమునువిని గృహావరణమునందు ఒక చెట్టు క్రింద నిలచియున్న యిద్దఱు వ్యక్తులు వడివడిగా వచ్చు చుండుట జీవన్ కనిపెట్టి, నిర్విణ్ణయై చూచుచున్న పద్మా దేవితో, "అమ్మా! అమ్మా! 'దొంగ! దొంగ! హత్య! హత్య!' అని బిగ్గఱగ కేక లిడుము" అని చెప్పెను.

ఆతని యభిప్రాయమును గుర్తించి ఆమె బిగ్గఱగ, "అయ్యో! అయ్యో! దొంగ! దొంగ! హత్య! హత్య!" అని కేక లిడెను. ముహూర్త మాత్రములో గవాక్ష మార్గమున 'హన్నా' లోనికి లంఘించి తన బలిష్ఠ హస్తముతో జీవన్ చేయి పట్టుకొనెను. జీవన్ ఆతని ముఖమువైపు స్థిర దృష్టితో చూడసాగెను. ఆ ముఖమునందు క్రౌర్యముకాని, రాక్షసత్వముకాని గోచరించుటలేదు. ధీరోదార లక్షణ ములు తీర్చి దిద్దినట్లు పొడగట్టుచుండెను. కండలు తిరిగిన యాజానుబాహువులు కన్నులపండువు చేయుచుండెను. క్షణమాత్ర మిరువురు నొకరిమొగము నొకరు చూచుచు నిలచిపోయిరి. పిమ్మట హన్నా నేలబడియున్న వర్ధన్ రక్తార్ద్ర కళేబరమువైపు దృష్టి సారించి, ఒక్క నిట్టూర్పు విడచి, "ఈ హత్యచేసినది నీవేనా?" అని గంభీరముగ ప్రశ్నించెను.

జీవన్ :— అగును.

హన్నా :— కారణము ?

జీవన్ :— సావధానముగ వినగోరుచున్నాను. రాజగృహము నుండి తప్పించుకొని పోవు నుద్దేశముతో ఈ పర్వత

మార్గమున వచ్చి, ఈ యేకాంత గృహమును జారస్త్రీ గృహమని భావించి, యిందు దాగవచ్చి యిందు నిద్రించుచున్న యీమెను జూచి భయపడి, ఆ యద్దము వెనుక నక్కియుంటిని. ఇంతలో ఈ వృద్ధుఁడు యిందు ప్రవేశించి యీమెను లేపి మన్నా యాజ్ఞానుసారము ఆమెను తనవెంట రాజసౌధమునకు రమ్మని పల్కెను. ఆమె యందు కంగీకరించి సిద్ధమగుచుండగా, ఆతఁడు గవాక్షము చెంతకు బోవుచు అద్దము వెనుకనున్న నన్ను చూచెను. స్వప్రాణ రక్షణమునకై అన్యోపాయములేక తక్షణమే యీ బాకుతో నే నాతని వక్షస్థలమున పొడిచివైచితిని. నీకు పట్టుపడితిని. నీవు నన్నేమి చేసినను చేయవచ్చును.

హన్నా :— మంచిది. నీ యొద్ద నింక నేమైన ఆయుధములు కలవా ?

జీవన్ :— ఇదిగో ఇదియే నాకున్న ఆయుధము.

అని జేబులోనున్న పిస్తోలును తీసి యాతని కందిచ్చెను. ఇంతలో ' కాశీ ' లోన ప్రవేశించి, ఆ దృశ్యమును జూచి, " వీడేనా హంతకుఁడు ! చూచెదవేమి హన్నా ? ఒక్క వ్రేటున తల తెగనేయుము " అని హుంకరించెను.

హన్నా స్థిరస్వరమున వానితో, " కాశీ ! శాంతింపుము. ఈతని నేమిచేయుటకును నీకుకాని నాకు కాని అధికారము లేదు. అది మన్నా యిచ్ఛాధీనము. రత్నమాలాదేవి యాజ్ఞాధీనము. ఈతని తోడ్కొని వారి కడకు పోవుటయే మన కర్తవ్యము." అని పలికి, జీవన్‌తో,

" అయ్యా! నా చేతులయందు నీవు సురక్షితుడవు. నా వెంట రమ్ము." అని యాదేశించెను.

అంత పద్మ, "అయ్యా! ఈ శవజాగరణము చేయుచు నేనిచ్చట నుండజాలను. నన్ను సహితము తోడ్కొని పొమ్ము." అని యర్థించెను. హన్నా అంగీకరించి, ఆ శవము చెంత కాకీని కాపుంచి, వారిరువురితో కుటీరమునుండి బయటకు వచ్చి యొక శృంగము నూదెను. మరుక్షణమున అందందు చెట్లక్రింద వేచుకొని యుండిన పదిమంది సైనికులు ఆయుధహస్తులై యచ్చటకు వచ్చిరి. అనంతరము నలువైపులను వారు నడచుచుండ, పద్మా జీవనులను తోడ్కొని ఆ యర్ధరాత్రమునందు హన్నా ఆ పర్వతమార్గమున దిగి నగరాభిముఖుడై నడువసాగెను.

ఇంతలో దూరమున నొక పెద్ద ఘంటారావము బయల్వెడలి ఆ ప్రశాంత వాతావరణమును కంపింపజేసెను. ఆ శబ్దమును వినినంతనే హన్నా పరిజన సమేతముగ ముందడుగు వేయక పాషాణ ప్రతిమవలె నిలచిపోయెను. సుమారు పదినిముసములపాటు ఆ ఘంటారావము మ్రోగెను. పిదప నొక పెద్ద యాకాశ దీపము దూరమున సుమారు నూఱడుగుల మీాది కెత్తబడెను. అంతవఱకును అన్లే నిమీలిత నేత్రులై చేతులు జోడించి వారందఱును నిలచి, పిమ్మట ముందునకు నడువ ప్రారంభించిరి.

" అయ్యా! ఇందలి విశేషమేమి?" అని జీవన్ ప్రశ్నించెను. హన్నా, " ఇది మొదలు జేపటి యర్ధరాత్రము వఱకు, ఈ ద్వీపవాసులకు దీక్షా సమయము. ఇది

మా ద్వీప సంత్రాణ దేవత యగు రత్నచండి ' పూజాదివ సము. ఈ దినమున ఇచ్చట ఏ ప్రాణియు హింసింప బడరాదు. అయ్యా! నీ యపరాధమునకు నీకు మరణ శిక్ష విధించినను, రేపటి యర్థరాత్రమువఱకును నీకు ప్రాణ భయము లేదు. ధైర్యముగ నుండుము." అని మందహాసము చేసెను.

ఇప్పటికి వారు, రాజమార్గమున బహుదూరము నడచి, ఒక పెద్ద పురాతన గృహముకడకు వచ్చిరి. అచ్చట, పరిజనమును బయట నిలిపి, పద్మా జీవనులతో హన్నా లోన ప్రవేశించి, జీవన్‌తో, "అయ్యా! తెల్లవారు వఱకును మీ రీ గృహమునం దుండవలయును. ఈమె కా పడమటిగది ప్రత్యేకించెదను. నీ వీ తూర్పుగది యందు విశ్రమించుము." అని పల్కెను. అంత పద్మ దీనముగ, "అయ్యా! ఇచ్చట నేనొంటిగ నుండజాలను. నన్ను రత్నమాలాదేవికడకు తీసికొని పొమ్ము." అని యర్థించెను.

"అమ్మా! రత్నమాలాదేవి ప్రస్తుతము రాజపురోహితునింట నున్నది. నే నీ గృహమును విడచి నీవెంట రాజాలను. కాని, అచ్చటకు పోవు మార్గమును నీకు చూపెదను. నిర్భయముగ నీవు పోవచ్చును." అని పల్కి యథోక్తముగ తూర్పు గదియందు తన ఖైదీని విడచి, ద్వారమును బంధించి, పరివారము నచ్చట కాపుంచి, పద్మాదేవిని వెంటబెట్టుకొని పోయి రాజ పురోహితునింటికి దారిచూపి, తిరిగి వచ్చెను.

# అ ధ్యా య ము 10

ఉదయమున జీవన్‌లాల్ కన్నులు విప్పి చూచుసరికి సూర్యకిరణ ప్రసారితమై యా గది యంతయు అరుణరాగ రంజితమై యుండెను. బయట నలువైపుల నుండియు వాద్య సంగీతములు, శంఖారావములు, శృంగనాదములు, ప్రజా ఘోషణములు, శ్రవణగోచరము లగుచుండెను. ఆ నాడు 'రత్నచండి' పూజాదివస మని హన్నూ చెప్పియుండెను. మరణశిక్ష విధింపబడినను ఆ నాడు తనకు ప్రాణభయము లేదని చెప్పియుండెను. "ఈనాడే కాదు, తనుపరి సహితము నీకు ప్రాణభయము లేదు" అని తన యాంతరంగిక దివ్యవాణి ఘోషించుచుండెను. ఆ పాతాళ ప్రవాహము లోనికి దిగిన తన ముప్పురు మిత్రులును కూడ సురక్షితముగ సముద్రమును చేరుకొని రని కూడ, తన యంతర్వాణి తనతో చెప్పుచుండెను. మహోత్సాహముతో నాతడు లేచి, "జై రత్నచండీ! జై జగద్ధాత్రీ!" అని యొక్క నమస్కారము చేసి గవాక్షము చెంతకు పోయెను. ఇంతలో కాళీ ఆయుధహస్తులైన పదిమంది సైనికులను వెంటబెట్టుకొని వచ్చి, తాళము తీసి గదియందు ప్రవేశించి, ఆతనిచే ప్రాతః కార్యముల నిర్వర్తింప జేసి, బయటకు తెచ్చి, యాతనితో సైనికులు ముందు వెనుకల నడువ రాజమార్గమున పురోగమించెను.

నగర మంతయు పుష్పతోరణాలంకృతమై కన్నుల పండువుగా నుండెను. ప్రతి గృహోపరిభాగమునను వర్ణ

వర్ణ పతాకము లెగురుచుండెను. ప్రతి గృహద్వారమును పత్ర తోరణ బద్ధమై యుండెను. పెద్ద పెద్ద భవన ప్రాంగణ ములందు చిత్రమంటపములపై చండీవిగ్రహములు ప్రతిష్ఠింపబడి యుండెను. ఏ వైపు విన్నను "జై! రత్నచండీ! జై! మహాదేవీ!" అను ఘోషణములు నృత్య వాద్య సంగీత శబ్దములతో మేళవించి వినవచ్చు చుండెను. ఇంటింట వెలయుచున్న యీ మహోత్సవమును చూచుచు జీవన్ ఏదో స్వప్నగత ప్రపంచమున పోవుచున్నవానివలె నడచు చుండెను.

కొంత దూరము పోవుసరికి ఒక పెద్ద జనసమూహము నగర సంకీర్తనము చేయుచు నెదురయ్యెను. కాషాయాంబర ధారియైన యెనుబది యేండ్ల వృద్ధు డొకడు పుష్పదామా లంకృతమైన యొక పెద్ద చండీవిగ్రహమును సకీటముగ తలపై నిడుకొని యర్ధనిమీలిత నేత్రుడై ముందు నడచు చుండెను. ఆ విగ్రహమే ఆ ద్వీప సంత్రాణ దేవతయైన రత్నచండీమూర్తి. జయజయ ధ్వానములతో శిశువృద్ధ వనితా సమేతమైన యొక పెద్ద జనసమూహము వెనుక నడచు చుండెను. వారిని జూచినంతనే కాశీ పరివార సహిత ముగ నిలచిపోయి, వారు మలుపు తిరిగిన పిమ్మట వారివెంట తన ఖైదీతో నడువసాగెను.

ఆ జనసమూహ మంతయు పోయిపోయి ఒక విశాల మైన మైదానమున ప్రవేశించెను. ఆ దృశ్య మత్యంత రమణీయముగా నుండెను. చుట్టును పుష్పలతా నిబద్ధములై యున్న ఫలవృక్షములు కట్టని ప్రాకారమువలె కానబడు

చుండెను. ఆ మధ్యను అర్ధవలయాకారమున సుమారు ముప్పది యడుగుల పొడవున ఒక చలువరాతి వేదిక నిర్మించ బడి యుండెను. ఆ వేదికపై కొందరు భద్రవ్యక్తులు అమూల్య వస్త్రాభరణధారులై యాసీనులై యుండిరి. ఇరువైపులను బారులుతీర్చి ఆయుధహస్తులైన సైనికులు నిలచి యుండిరి. నగర సంకీర్తనమును ముగించుకొని వచ్చిన జనసమూహ మంతయు ఆ వేదిక యెదుటకు వచ్చి యాగెను. వేదికపై నున్న వారందఱును లేచి చండీవిగ్రహము కడకు బోయి పాదస్పర్శ యొనర్చి బద్ధాంజలులై యొక్కింతసేపు నిమీలిత నేత్రులై నిలచిరి. అంతయు నిశ్శబ్ద మయ్యెను. పిమ్మట దేవీవిగ్రహము ఒక ప్రక్క నేర్పరచియున్న ఉన్నతాలం కృత పీఠముపై ప్రతిష్ఠింపబడెను. తదుపరి భద్రవ్యక్తు లంద రును తమతమ యాసనములపై నధిష్ఠించిరి.

ఆ భద్రజన మండలిని జీవన్ తదేక దృష్టితో పరిశీ లించెను. రాణి రత్నమాలాదేవి మధ్య కూర్చొని యుండెను. ఆమెచెంత నొక్క స్థానము విడచి మన్నా కూర్చుండి యుండెను. వెనుక హాన్నా నిలచి యుండెను. కాషాయాంబరధారియైన యా వృద్ధుడు దేవిని సుప్రతిష్ఠిత మొనర్చి మెల్లగ పోయి రత్నమాలకును మన్నాకును మధ్య నాసీనుడయ్యెను. యావజ్జన సమూహమును సర్దుకొని యనంతర కార్యక్రమ దర్శన కుతూహలమై నిశ్శబ్దముగ నిలచి యుండెను.

పిమ్మట మన్నా సౌంజ్ఞానుసారముగ నలుగురు సేవకులు రక్తసిక్తమైన వర్ధన్ మృతకళేబరమును

మోసుకొనివచ్చి యెదుట బెట్టిరి. అందరి దృష్టియు ఆ మృతశరీరముపై కేంద్రీకరించెను. క్షణమాత్ర మా నిర్జీవ ముఖమును నిదానించి, జేవురించిన ముఖముతో మన్నా, "ఆ విదేశీయ హంతకు నిట తోడ్కొని రండు." అని యాజ్ఞా పించెను. మరుక్షణమున కాళీ జీవన్‌లాల్‌ను తోడ్కొని వచ్చి, యెదుట నిలిపెను. క్రిక్కిరిసియున్న యా జనసంఘ మంతయు ఊపిరి బిగించుకొని జీవన్ వైపు చూడజొచ్చెను. క్షణమాత్ర మాతనివైపు తేరిచూచి, మన్నా రోషారుణిత నేత్రుడై లేచి జీవన్‌లాల్‌ను చూపుచు ఆ జనసమూహము నుద్దేశించి యేదో చెప్పబోవుచుండగా,

"అగును. ఈ వర్ధన్ ప్రాణములను తీసినది నేను! ఇచ్ఛాపూర్వకముగ నేను వీనిని చంపలేదు. స్వప్రాణ రక్షణమునకై నేను వీనిని పొడిచితిని" అని జీవన్ నిర్భయ ముగా పల్కెను. నేత్రాంచలముల నగ్ని శూలములు వెల్వడ, మన్నా యొక్కసారి జీవన్ వైపు జూచి, ప్రజా భిముఖుడై, "ద్వీపవాసులారా! మన ద్వీపమునకు ఉక్కు స్తంభ మనదగు వర్ధన్ ప్రాణములను హరించిన యీ విదే శీయ హంతకుని చూడుడు! మీ ద్వీపమును కైవసము చేసుకొని, మీ రాణిని భిక్షుకురాలి నొనర్చి, మిమ్మెల్ల బానిసల గావింపవచ్చిన యీ పోగరుబోతును చూడుడు! వీని కేమి శిక్ష విధింపవలెనో మీరే నిర్ణయింపుడు." అని యుద్రేకముతో ప్రశ్నించెను.

"మరణశిక్ష! శిరచ్ఛేదము! చిత్రవధ!" అను భయంకర శబ్దములు మిన్నుముట్టెను.

" నేను 'రత్నచండీ' దివసము. నేను వీనిని చంపుటకు వలనుపడదు. నేను శిక్ష విధించుటకు మాత్ర మభ్యంతరము లేదు. జే హృదయమే వీని నురికంబ మెక్కించవచ్చును" అని మన్నా కూర్చుండెను. అంత రత్నమాలాదేవి లేచి వ్యాప మధుర కంఠముతో, " ద్వీపవాసులారా! ఇంత కలవరమున కేమియు కారణము లేదు. ఈ జీవన్‌లాల్ విదేశీయు డగుటచే మన అంతర్నియమాదికము లేమియు నీతనికి తెలియవు. ధనమిచ్చి యీ ద్వీపమును కొనియుండుటచే ఇది తన సొత్తని తాను భావించుటయందు దోషమున్నదా? ఇంక, వర్ధన్ హత్యావిషయమై, స్వప్రాణరక్షణమునకై యాత డీ పని చేసెను. రక్తపిపాసియై యీ హత్య చేసియుండలేదు. ఈ ద్వీపవాసుల మనోవైఖరి గుర్తించి, ఈ ద్వీపమును తిరిగి యీతడు నా కిచ్చివైచినాడు. ఇదిగో, స్వహస్త లిఖితమైన ఈతని అధికార పత్రము! చూడుడు!" అని తాను గుప్తపఱచిన ఆ దానపత్రమును పైకెత్తి యందఱకును చూపి, చదివి వినిపించెను.

అగ్నిజ్వాలాభీభత్సమై పెటపెటలాడుచున్న యింటి కప్పుపై కుంభవృష్టి కురిసినట్లయ్యెను. ఆగ్రహోద్రిక్తమై ఫూత్కార ఘూర్ణితమైన ఆ సమగ్ర జనసమూహమును చప్పున శాంతించి నిశ్శబ్ద మయ్యెను.

" ఇప్పుడు మీ యభిప్రాయ మేమి? ఈతడు శిక్షార్హుడనియే మీరు భావింతురా? మన ద్వీపమును మనకు ప్రత్యర్పణము చేసివైచెను. ఇంక నీతడు సురక్షితముగ మన

ద్వీపమును విడచి పోవుటకు మీ కేమైన నభ్యంతర మున్నదా ?" అని యామె ప్రశ్నించెను.

"ఏమియు అభ్యంతరము లేదు." అని ప్రజాగణము ఏకగ్రీవముగ ప్రత్యుత్తర మిచ్చెను.

"మన ద్వీపమును మన కిచ్చివేసినాడు కావున వీని నింక సురక్షితముగ పోనీయవచ్చును." అని వృద్ధ పురోహితుడు పల్కెను.

క్షణమాత్రము మన్నా ముఖమండలము ఛాయా గ్రస్త మయ్యెను. కాని, నిగ్గులు తేరిన నిశాత కపటి యగుటచే తక్షణమే సర్దుకొని లేచి, "సురక్షితముగ పోనీయవచ్చునా ?... ద్వీపవాసులారా ! మీ యమాయకత్వమునకు చింతించుచున్నాను. ... మీ రహస్యము లన్నియు గ్రహించి పోవుచున్న వీడు, అన్యోపాయము లేక మీ ద్వీపమును మీ కప్పగించి పోవుచున్న వీడు, గోవా చేరి, అచిర కాలములోనే ప్రభుత్వ బలసహాయముతో తిరిగివచ్చి మీపై అగ్నివర్షము కురిపింపక విడువ డను జ్ఞానము మీకు లేదా ?" అని ప్రశ్నించెను.

మరల ప్రజాసంఘమునందు కలవరము ప్రారంభ మయ్యెను. "అగును, అగును. ఏమైనను చేయగలడు. ఇచ్చటనుండి పోనీయరాదు" అను భాషణములు చెలరేగెను.

అంతట వృద్ధ పురోహితుడు నిలచి, "ఇచ్చటనుండి పోయిన పిదప తానేమి చేయునో వానినే చెప్పనిండు." అని జీవన్ వైపు జూచెను. అంగీకార సూచకముగ రత్నమాల

తల పంకించెను. అంతట జీవన్ ప్రజాగణము నుద్దేశించి యీ విధముగ పల్కెను.

"హంసద్వీపవాసులారా! మీ ద్వీపాధిదేవత యగు ఈ మహాదేవి సాక్షిగ పల్కుచున్నాను. మీ యెడల నాకెట్టి ద్వేషమును లేదు. మీ యభీష్టమును గుర్తించి మీ ద్వీపమును నేను మీ రాణి కర్పించి వైచితిని. ఇచ్చివై చిన దీనిని తిరిగి నే నెన్నటికిని ఆశింపను. ఏ ప్రభుత్వమును అర్థింపను. ఇది మీ సొత్తు. అందునిమిత్తమై ఏ వ్యక్తికిని నేను హాని కలిగింపనని వాగ్దానము చేయుచున్నాను. కాని, ఒకానొక ద్రోహి, మాయావి, మీ వృద్ధ ప్రభువును హత్య గావించిన యొక నరపిశాచము, మీ రాణిని మోసగించు చున్న యొక యధమాధమ కపటి, తన యర్ధాంగియైన యొక యమాయక స్త్రీ కుత్తుక కోయనున్న నీచరాక్షసుడు, మీ ద్వీపమునం దున్నాడు; మీ సంఘమునం దున్నాడు. ఆ పరమ ఘాతకుని ఉరికంబ మెక్కించక విడువను. గోవాకు పోయి, ప్రభుత్వ సహాయముతో తిరిగివచ్చి, న్యాయ విచారణము జరిపించి, ఆ విషకీటకము రూపుమాపి, మీద్వీప మును నిష్కంటక మొనరించి, పిమ్మట నిర్విచారముగ వెడలిపోయెదను."

ఈ వాగ్వర్షము వెలసినంతనే ప్రజాసమూహము నందు "ఎవరు? ఎవరు? ఎవరు?" అను గుసగుసలు బయలుదేరెను. ప్రతి ముఖమునందును చిత్రవిచిత్రములైన భావచ్ఛాయలు తాండవింప జొచ్చెను. అన్యోన్య రహస్య ప్రశ్నలతో జనసమ్మర్ద మంతయు కుతకుతలాడ జొచ్చెను.

అంత నా వృద్ధ పురోహితుడు జీవన్‌లాల్ నుద్దేశించి, "ఆ వ్యక్తి యెవరో చెప్పుము" అని కోరెను. అంత జీవన్, "ఆవ్యక్తి, అదిగో ఆ భద్రవ్యక్తి! మన్నా!" అని విద్యున్మయూఖములనుబోలు దృగ్జాలములను ఆతనిపై ప్రసరింప జేసెను.

"మన్నా ?...మన్నా ?... మన్నా ?" అను వాయు శబ్దములు వాతావరణము నొక్కసారిగ చలింపజేసెను.

"అగును. మన్నా! మన్నా! మీ నాయకుడు మన్నా ప్రభువు! వృద్ధ ద్వీపాధిపతి ఇంద్రవర్మను ఈ భద్రవ్యక్తి పొడిచి చంపెనో లేదో యడుగుడు." అని జీవన్ బిగ్గఱగ వచించెను.

"ఆ వృద్ధ ప్రభువు హత్యయందు మా కందఱకును ఇంతయో అంతయో పాలు కలదు." అని జీవన్ చెంత నున్న కాశీ బదులు పల్కెను. పిమ్మట మన్నా చరాలున లేచి, "అసంభవము. వీని నాలుక చీల్చి వేయవలెను. ఆతని నేను చంపితినా ? ఆగ్రహోన్మత్తులైన ప్రజలబారినుండి నేనాతని తప్పింప యత్నించితిని. ఆవేశపరవశుడై నన్ను సహితము త్రోసివైచి ఈ వర్ధన్ ఆతని పొడిచివైచెను." అని సమయస్ఫూర్తితో సమాధాన మిచ్చెను.

చచ్చినవారు సాక్ష్య మీయజాలరుకదా! వీ దోష మైనను చచ్చినవానినెత్తిని పడవైచి సురక్షితముగ నుండ వచ్చును. ఈ మహానీతి మన్నాకు తెలియనిది కాదు. కాని, అమాయక ప్రజలకు తెల్లని వన్నియు పాలు, నల్లని

వన్నియు సీల్ఖ్య! ఆ సమాధానమునకు ప్రజలు సంతృప్తు లగుచుండిరి. అంత నాతడు, "ద్వీపవాసులారా! ఇపుడు మనము వీనిని విడచివైచినచో, వీడు పోయి నాకు విరుద్ధముగ ప్రభుత్వమునకు నచ్చజెప్పి నాపై నుసిగొల్పును. ప్రభుత్వము నన్నొక్కనితో విడచిపెట్టునా? నాతోపాటు మిమ్మందఱనుకూడ శిక్షింపక విడచునా? ఈ పర్యవసానము మీకు శ్రేయస్కరమో, కాదో, యోచింపుడు" అని మరియొక బాణమును ప్రయోగించెను. ఇది ప్రజా హృదయమున మరల నాటుకొనెను. ఆరిపోవుచున్న యగ్నిహోత్రము తిరిగి రగులుకొనెను.

"అగును, అగును. వీనిని విడువరాదు. తక్షణమే చంపివేయుడు." అను నినాదములు మరల చెలరేగెను.

అంతలో, ఆ ప్రజామధ్యమునం దొకచోట నిలచియున్న యొక వృద్ధస్త్రీ జీవన్ దృష్టి నాకర్షించెను. వృద్ధప్రభువు మరణసమయమున ఆతనిచెంత కాపుండిన వృద్ధదాసియే ఆమె! ఆమెను చూచినంతనే జీవన్ ఒక్క విసరున ఆమెకడకు బోయి ఆమె చేయి బట్టుకొని ముందునకు లాగుకొని వచ్చి, "దాసీ! నిజము చెప్పుము. మీ వృద్ధప్రభువును పొడిచిన దెవ్వరు? మీ ప్రభువు కొనయూపిరితో ఎవనిపేరు చెప్పెను?" అని అందఱును వినునట్లు బిగ్గఱగ ప్రశ్నించెను. వృద్ధదాసిశరీర మాపాదమస్తకమును గజగజ వణక జొచ్చెను. భయాకులదృష్టితో నామె మన్నావైపు తెప్పవేయక చూచుచుండెను.

"సత్యము పల్కుము. నిర్భయముగ చెప్పుము" అని యతడు మరల గద్దించెను.

అంత, గద్గదికావరుద్ధమైన యామె కంఠనాళము నుండి, భయప్రకంపితము లగుచున్న పెదవులను ఛేదించు కొని, "వ...ర్ధ...న్" అనుమాట మెల్లగా నూడిపడెను. ఈ మాట వినినంతనే మన్నా పెద్ద నవ్వు నవ్వి, "వింటిరా?" అని బిగ్గఱగ నఱచెను.

అంత జీవన్ ప్రజాభిముఖుడై, "అసత్యము! మన్నాకు భీతిల్లి యీ వృద్ధదాసి అసత్యము పల్కినది. ఈ 'రత్నచండి' పవిత్ర పాదములను ముట్టి సత్యము చెప్పు మనుడు. అప్పు డీమె తిరిగి వర్ధన్ పేరే చెప్పినచో, ఈ క్షణమే నన్ను శిరచ్ఛేదము చేయుడు." అని గంభీరముగ పల్కెను.

"మంచిది, అట్లే కానిండు. అట్లే కానిండు." అను అంగీకార వాక్యము ఏకగ్రీవముగ వినవచ్చెను. వృద్ధ పురోహితుడు లేచివచ్చి ఆ వృద్ధదాసిని ఆ పవిత్ర దేవతా మూర్తి సమక్షమునకు తోడ్కొనిపోయి, "దాసీ! ఈ మహాదేవిపాదములంటి సత్యము పల్కుము." అని యాదేశించెను.

బలాత్కారముపై ఆమె దేవిపాదములను స్పృశించి, గుభాలున నేల కూలబడి ముఖము చేతులతో కప్పుకొని వెక్కి వెక్కి యేడువసాగెను.

"భయపడవలదు. ఉన్నది యున్నట్లు చెప్పుము." అని ధైర్యము గొల్పుచు వృద్ధ పురోహితు డామెను

లేవనెత్తెను. అంత నామె ప్రజాభిముఖయై, "అయ్యలారా! నన్ను చంపివేసిన చంపివేయుడు. నేను నిజము చెప్పుచున్నాను. ప్రభువువారిని పొడిచినది వర్ధన్ కాదు, మన్నాబాబు! 'చంపకుడు, చంపకుడు. మీ యిచ్ఛానుసారమే చేసెదను' అని ప్రభువువారు చెప్పుచున్నను, ఆ దొమ్మిలో మన్నాబాబే దొంగపోటు పొడిచినారు. కొనయూపిరితో ప్రభువువారు, 'మన్నా! మన్నా! పొడిచితివా? పొడిచితివా?' అని యరచుచు ప్రాణములు విడచినారు."

అని సత్యమును వెల్లడించి, కన్నీటితో మన్నా కడకు పోయి "మహాప్రభూ! దేవిపాదములను ముట్టి అసత్యము చెప్పలేకపోయితిని. రక్షింపుడు! రక్షింపుడు!" అని యాతని పాదములపై బడెను. కొన్ని నిముషములవరకు వాతావరణ మంతయు నిశ్శబ్ద మయ్యెను.

# అధ్యాయము 11

ఇంచుక సేపు హన్నా తలవంచుకొని యూరకుండి, పిమ్మట పాదములపై బడియున్న వృద్ధదాసిని ప్రక్కకు త్రోసివైచి, ప్రేటువడిన నాగసర్పము వలె నిటారున నిలువబడి కన్నుల నిప్పులు రాల, "అగును. ఆ వృద్ధుని పొడిచినది నేనే! ఈ ద్వీపము నమ్మి మిమ్ము బానిసీంద్రగ చేసిన యపరాధమునకు నే నా వృద్ధుని చంపితిని. మా ద్వీపమును కొని మా స్వేచ్ఛ నపహరింప వచ్చి, మా వర్గ ప్రాణముల హరించిన ఈ విదేశీయు నిప్పుడు చంపబోవుచున్నాను. మాలో దేశభక్తి, ఆత్మగౌరవము, కలవా రెవరైన నున్నచో నావైపు రండు. దేశద్రోహులు వాని పక్షము నిలువుడు." అని గర్జించెను.

ప్రజాసంఘమునందు కలకలము ప్రారంభ మయ్యెను. గుసగుసలు, బుసబుసలు, హుంకారములు, ఝుంకారములు, క్షణక్షణోద్రిక్తములు కాజొచ్చెను. ఏకముఖముగ క్రమబద్ధముగ నిలచియుండిన ప్రజాగణ మంతయు భిన్నభిన్నమై గుంపులు గుంపులుగ చీలిపోయెను. ఆయుధహస్తులైనవారు ఆయుధములను సవరించుకొనుచుండిరి. క్షణమాత్రములో ప్రశాంతమై యుండిన యాప్రదేశ మంతయు నొక యుద్ధభూమి కానున్నదా యను సందేహము కలిగించెను. ఈ పటాటోప మంతయు స్థిరదృష్టితో హన్నా గమనించుచుండెను. ఆ యాపత్సమయమునందు జీవన్ ప్రాణరక్షణము తన బాధ్యతగా నతడు భావించి యుండినట్లు ఆతని ముఖ

లక్షణములు స్పష్టము చేయుచుండెను. మన్నా తన స్థానము నుండి కదలలేదు. కాని గర్వోద్రేకమున నలువైపుల దృష్టి సారించి, కాశీవైపు జూచి, "చూచెదవేమి?" అని హుంకరించెను. తక్షణమే కాశీ తన ఖడ్గము నోరనుండి తీసి జీవన్ పైకెత్తెను. ముహూర్తమాత్రమున జీవన్ మూర్ధము ముక్కలైపోవును. మహోద్వేగకంపితయై రత్నమాల లేచి నిలచెను. అంతలో హన్నా ఒక్క విసరున వచ్చి ఉగ్రాకారుడై కాశీయెదుట నిలచి వాని ఖడ్గహస్తమును పట్టుకొని, "నా కంఠమునందు ప్రాణములుండ నా రక్షణమందున్న యీ వ్యక్తిని నీవు ముట్టజాలవు." అని సింహగర్జనము చేసెను. అంత మన్నా అనుచరులైన పదునైదుగు రాయుధహస్తులు విఱచుకొనుచు వచ్చి జీవన్ సహితుడైన హన్నాను ముట్టడించిరి. ఈ భయంకర పరిస్థితిని గమనించి రత్నమాల ధనుర్ముక్తమైన బాణమువలె వారి యెదుటకు పోయి, "ఆగుడు. ఆతని చంపదలచినచో ముందు నన్ను చంపి వేయుడు. ఆతని నేను ప్రాణాధికముగ ప్రేమించుచున్నాను. ఆతడు మరణించిన మరుక్షణమున నేను ప్రాణత్యాగము చేసెదను." అని కోమల గంభీర మధుర స్వరమున పల్కెను. ఈ పల్కులకు మంత్రముగ్ధమైన మహానాగము వలె, సైనికబృందసమేతముగ, సమగ్ర జనసంఘమును నిశ్చేష్టమై, నిశ్శబ్దమై, స్తంభించిపోయెను.

అంత మన్నా చకితుడై దిగ్భ్రాంతుడై, సుడిగాలి యందు చిక్కువడిన పండుటాకువలె మానసము పరిభ్రమించ, ఆమెవైపు జూచి, "రత్నమాలా? ఏమంటివి? నీవు వీనిని

ప్రాణాధికముగ ప్రేమించుచుంటివా ? నీ హృదయము నీవలకే నాకిచ్చివేయలేదా ? మన వివాహముహూర్తమునకై యీ ద్వీపవాసు లెదురు చూచుటలేదా ? ఇప్పు డీ యసభ్య భాషణ మేమి ?'' అని ప్రశ్నించెను. ఈ ప్రశ్నకు ప్రత్యుత్తరము రాకపూర్వమే జీవన్ మన్నా నుద్దేశించి, "మరల నీకు వివాహమా ? ఈ రాణిని రెండవ భార్యగా గ్రహింప బోవుచుంటివా ? ఆ భార్య నేమిచేసితివి ?'' అని ప్రజ లందఱును వినునట్లు ప్రశ్నించెను. ఈ ప్రశ్న శూలమువలె మన్నా హృదయమున నాటుకొనెను.

"ఆ భార్య! ఎవరా భార్య? మన్నా వివాహితుడా?" అను వాయుశబ్దములు నల్గడలను ప్రతిధ్వనించెను.

"అగును. ఆ భార్య! మన్నా ఈవఱకు వివాహమాడిన భార్య! వలదన్నను వెంటబడి యీతనితో నీ ద్వీపమునకు వచ్చిన భార్య! పర్వతాగ్ర కుటీరమునందు రహస్యముగ తాను దాచియుంచిన భార్య! నిన్నరాత్రి వర్ధన్ చే బలవంతముగ మృత్యుముఖమున కీడ్చుకొని పోబడనున్న తఱి నాచే రక్షింపబడిన భార్య!— మన్నా! ఆ భార్యయేమైనది ? ఎచ్చటనైన జీవించి యున్నదా లేక అప్పుడే పాతాళగహ్వరమును చూపించితివా ?" అని జీవన్ ఆవేశపూరితుడై ప్రశ్నించెను. ప్రజాగణమునం దొకానొక యపూర్వ సంచలనము ప్రారంభ మయ్యెను.

అంత మన్నా ఏమియు నెఱుగనివానివలె, "అసంభవము! ఈ యసత్యవాది నాలుక ఖండింపుడు. నాకు భార్యయా ?" అని యఱచెను.

" ఆ పత్వాత కటీరమునం దొక స్త్రీ యుండినది మాత్రము వాస్తవము! కాని యిప్పు డచ్చట లేదు." అని హన్నా పల్కెను.

" ఎచ్చట నున్నది? ఏమైనది? ఆమెయే మన్నా భార్య! ద్వీపవాసులారా! వర్ధన్ సహాయమున ఆమెను హత్యగావించి, అమాయిక యగు మీ రాణిని మోసగించి వివాహమాడి, ఈ ద్వీపాధిపత్యమును కైవసము చేసుకొను టయే ఈ భద్రవ్యక్తి యాశయము!" అని జీవన్ నిర్భయ ముగ పల్కెను.

పరిస్థితులు విషమించుచుండుట గ్రహించి మన్నా అమాయకత్వమును నటించుచు, జీవన్‌పై నిప్పులు గ్రక్కుచు, ప్రజాభిముఖుడై " సోదరులారా! ఈ విదేశీయుడు ఆ స్త్రీ యెచ్చట నున్నదని నన్ను ప్రశ్నించుచున్నాడు. అది నేను వాని నడుగవలసిన ప్రశ్న. ఆమె నిచ్చటకు తెచ్చి మీ యెదుట నిలిపి నే నసత్యవాదినని ఋజువుచేయవలసిన బాధ్యత వీనితలపై నున్నది. నేను మీకు క్రొత్తనుకాను. నా ప్రవర్తనము మీకు క్రొత్తకాదు. అయినను తన తలను తాను కాచుకొనుటకై యీ యసత్యములను ప్రేలుచున్న యీ నీచుని మీరు విశ్వసించెదరా? ఎవ్వతెను నేనీవఱకు వివాహమాడి యుండలేను. నా భార్య యనునది యెవ్వ తెయు లేదని నేను ప్రమాణము చేసిన విశ్వసింతురా?" అని యడిగెను.

" తప్పక విశ్వసింతుము. ఆ మహాదేవి పాదములు ముట్టి ఈ విదేశీయుడు పల్కిన దసత్యమని ప్రమాణముచేయుడు,"

అని యేక కంఠమున ప్రజలు వాక్రోశించిరి.

"ఈ స్వల్ప విషయమున కా మహాదేవి పాదముల స్పృశించుటేల ?" అని యాతడు వికటహాసము చేసెను.

"కాదు, కాదు. ఆ పవిత్ర పాదములను ముట్టియే ప్రమాణము చేయవలయును" అని ప్రజ లాదేశించిరి. విధిలేక ఆత డందుకు సిద్ధపడెను. ప్రజ లందఱును ఆ ప్రమాణమును విన నుత్సాహము చూపుచుండిరి. కాని, ఒక్క కాశీ మాత్రము దాని కిష్టపడినట్లు కన్పట్టలేదు. వాని ముఖమునం దొక భయోత్పాతము కన్పట్టుచుండెను. యమదూతలను చూచుచున్నవానివలె వాని కన్నులును నోఱును తెఱచినవి తెఱచినట్లే యుండిపోయెను. చేతనున్న ఖడ్గము వణకుచుండెను. కాశీయందు పొడగట్టుచుండిన యీ విపరీత లక్షణము లన్నియు జీవన్ జాగ్రత్తగ కనిపెట్టుచుండెను. ఇంత దైవభీతి కలవాని కిట్టి రాక్షసత్వ మెట్లు కలిగెనా యని యాత డచ్చెరు వందెను.

పాపచింత కాని, దైవభీతి కాని, యణుమాత్రమైన లేని కరాళ హృదయుడు మన్నా, నిశ్శంకముగ నా రత్నచండీ మూర్తికడకు పోయి, పాదస్పర్శ మొనర్చి, "ఈ విదేశీయుడు పల్కినది యసత్యము, అసత్యము" అని ప్రమాణము చేసెను. ప్రజ లందఱును హర్షధ్వానము లొనర్చిరి. "ఇప్పు డేమందువు ?" అని యేకగ్రీవముగ ప్రశ్నించుచున్నట్లు అందఱును జీవన్ వైపు చూచిరి. జీవన్ లేశమాత్రమైన చలింపక, "సరియే. మన్నా ఆంతరంగిక సహకర్మియైన

ఈ కాశీచేత సహితము ప్రమాణము చేయించి సత్యము పల్కనిండు.'' అని వచించెను.

కాశీ మీచిప్రాణములు మీదికి పోయెను. ముఖము వెల్లబారి, ముచ్చెమటలు పట్టెను. పెదవులు వణకసాగెను.

"కానిండు. కాశీ సహితము ప్రమాణము చేయవలెను.'' అని ప్రజలు కోరిరి. దేవిగుడి కీడ్చుకొని పోబడు గొఱ్ఱెపోతువలె కాశీ ఆ చండీమూర్తి సమక్షమున కీడ్చుకొని పోబడెను.

"దేవిపాదములు ముట్టి సత్యము పల్కుము" అని వృద్ధ పురోహితు డాజ్ఞాపించెను. బిక్కమొగముతో కాశీ నిశ్చేష్టుడై మన్నావైపు చూచెను. "భయపడవలదు. నేనున్నాను'' అని మన్నా దృగ్జాలములు వానితో చెప్పుచుండెను. కాని, సహజముగ దైవభీతిపరుడగుటచే, ప్రమాణ మొనర్చి అసత్యము పల్కుటకు సాహసింపలేకుండెను. ఒక్కింతసేపు కన్నులు మూసికొని, తన హృదయాంతరాళమున జరిగిన దేవదానవ యుద్ధము ముగిసిన పిమ్మట, "సోదరులారా! మహారాణీ! నేను సత్యము పల్కినచో నా కెట్టి హానియు కలుగదని మీ రెల్లరు నభయ మిచ్చినచో ప్రమాణము చేసెదను.'' అని గద్గదికతో పల్కెను.

"నీ కెట్టి హానియు కల్గదు. నిజము చెప్పుము'' అని రాణి రత్నమాల అభయదానము చేసెను. ఈ యభయ నాదమును ప్రజాగణము ప్రతిధ్వనించెను.

అంత కాశీ, "నిజము చెప్పెదను. నిజము చూపె దను. అందరును నా వెంట రండు" అని ఆ యావజ్జన సమూహమును వెంటబెట్టుకొని ముందు నడువ సాగెను. నిస్తేజమైన ముఖమును వంచుకొని వెలవెల బోవుచు ఆతని వెనుక మన్నా నడచుచుండెను. మహాబలుడైన హన్నూ వేయికన్నులతో నాతని కనిపెట్టుచుండెను. స్త్రీజన పరివేష్టితమై రత్నమాలాదేవి అనుగమించు చుండెను. ఆమె వెనుక పురోహితాది భద్రజనమండలితో కలసి జీవన్ నడచుచుండెను. ఆ వెనుక జనసమూహ మంతయు మౌనముద్ర వహించి సాగిపోవుచుండెను.

ఇట్లు సమస్త ప్రజానివహమును తోడ్కొనిపోయి, కాశీ శూన్యమైయున్న వర్ధన్ గృహముకడ నాగి, తలుపు తెఱచి, "లోనికి రండు" అని పల్కి గృహాంతర్భాగమున నున్న యొక విశాలమైన ప్రాంగణమునందు అందఱను నిలిపి, గొంతు సవరించుకొని యిట్లు పల్కెను.

"మహారాణీ! ద్వీపవాసులారా! మహాదేవి 'రత్న చండి' సాక్షిగ సత్యము పల్కుచున్నాను, వినుడు —

నిన్న రాత్రి ఆ పర్వత కుటీరమునం దుండిన స్త్రీని బలాత్కారముగ మోసుకొనిపోవుటకై వర్ధన్ నన్నును హన్నూను తోడ్కొనిపోయెను. మమ్ము బయటనిలిపి యాతడు లోనికి బోయెను. ఆతని పిలుపు లోనుండి వినిన తక్షణమే మమ్ము లోనికి రమ్మని యాజ్ఞాపించెను. అయిదు నిముషము లైనదో లేదో, 'హత్య! హత్య!' అను కేకలు లోనుండి వినవచ్చెను. తక్షణమే హన్నూ గవాక్షమార్గ

మున లోనికి లంఘించెను. వెంటనే నేను సహితము లోనికి పోయితిని. రక్తహస్తముతో జీవన్ నిలచియుండెను. వర్ధన్ కత్తిపోటుతిని రక్తపు మడుగునందు నేలబడి యుండెను. పిమ్మట హన్నూ్మ నన్నూ్మ మృతశరీరముచెంత కావలియుండు మని చెప్పి, హంతకుడైన జీవన్‌లాల్ హస్తమును దృఢముగ బట్టి బయటకు తీసుకొనిపోయెను. ఆ స్త్రీ భయభ్రాంతయై యచ్చట నుండజాలక హన్నూ్మ వెంటబడెను. తదుపరి కొంతసేపటికి నేను సహిత మచ్చటనుండక, వర్ధన్ మరణ వార్త తెలుపుటకు మన్నూ్మకడకు పోయితిని. ఆ వార్త విని మన్నూ్మ దద్దరిల్లి, తక్షణమే గృహమువిడచి నన్ను వెంటగొని వడివడిగా పురమార్గమున పోజొచ్చెను. అప్పటి కర్ధరాత్రము గడచిపోయినది. ఆ పురాతన గృహమును దాటి పదియడు గులు నడచితిమో లేదో, అందుండి హన్నూ్మ బయటకు వచ్చుచుండుట గమనించితిమి. అతని వెంట నా స్త్రీ యుండెను.

"అమ్మా! ఈ మార్గముననే సరాసరి పొమ్ము. కుడివైపున నొక దేవాలయము కనబడును. దాని యెదుట నున్న పెద్ద భవనమే రాజపురోహితునిది. అందే రత్నమాలా దేవి ప్రస్తుత మున్నది. తిన్నగ నడచిపొమ్ము. నీకేమియు భయములేదు." అని హన్నూ్మ ఆ స్త్రీతో చెప్పి వెనుకకు మరలెను. ఆమె యేకాకినియై ఆ మార్గమున పోవుచుండెను. అంత మన్నూ్మ వడివడిగా ఆమె వెంటబడి, తటాలున వెనుక పాటున ఆమెనుపట్టి, తన చేరుమాలు నామె నోట గ్రుక్కి వాగ్బంధనము చేసెను. పిమ్మట, మేమిరువురమును ఆమెను మోసుకొని ఈ స్థలమునకు తెచ్చితిమి. ఇచ్చట నామెను

బిగియబట్టి నేల పరుండబెట్టి, కాలుసేతులు గట్టిగ కట్టి వైచితిమి. పిమ్మట నాతడు, "కాశీ! తరువాతపని నీకు తెలియును. ఇదిగో, తీసుకొనుము." అని పది బంగారు నాణెములను నాచేత బెట్టి, తా నా స్థలమును విడచి వెడలిపోయెను. తత్క్షణమే నేను కత్తితీసి ఒక్కవ్రేటున తల తెగనేయుటకు పైకెత్తితిని. కాని ఆ యసహాయస్త్రీ దీనదృష్టి నా పాషాణహృదయమును కఱగించివైచెను. కత్తి నొరయం దుంచి, మూర్ఛాగతయై కన్నులు మూసుకొనిన యామెను రెండుచేతులతో నెత్తి మోసుకొనిపోయి, అదిగో, ఆ మూలగదియందు మెల్లగ పరుండబెట్టితిని. పిదప నామెను బంధించియున్న త్రాళ్ళను మెల్లగ విప్పి, ఆ గదితలుపు బయట గొళ్ళెమువైచి, మన్నాయొద్దకు వడి వడిగా పోయితిని. తన పని పూర్తి చేసితినని యాతనితో బొంకి, ఆ మృతశరీరము పూడ్చివచ్చెద నను మిషతో తిరిగి యిచ్చటకు వచ్చి ఆ యమ్మ నొక నిరపాయస్థలమును చేర్చు టయే నా సంకల్పము. కాని, మన్నా నన్ను వెంటనే విడువ లేదు. నా సంకల్పము పూర్తి కాలేదు. మహారాణీ! ఆ గది తలుపు తెఱచి చూడుడు!" అని తన కథాక్రమమును ముగించెను.

ఊపిరి బిగియబట్టి యీ విచిత్ర సంఘటనమును వినుచుండిన ఆ సమస్త ప్రజానివహమును ఒక్క పెద్ద నిట్టూర్పు విడచెను. పర్వతకుటీరమున జరిగిన హత్యాకాండమును గూర్చియు, తా నా యర్ధరాత్రమున ఆ స్త్రీకి రాజపురోహి తుని గృహమునకు దారిచూపుటను గూర్చియు, కాశీ పల్కి

నది సత్యమని హాన్నా సాక్ష్యము పల్కెను. తదుపరి సంఘటనములకు ప్రమాణము ఆ మూలగది తెరచి చూచినచో లభించగలదని అందఱును ఒక్కుమ్మడి నా మూలగది కడ మూగిరి.

రత్నమాలాదేవి ముందు పోయి ఆ గది గొళ్ళెము తీసి తలుపులు తెఱచెను. అందరి దృష్టియు అందు కేంద్రీకరించెను. ఆ దృశ్య మత్యంత హృదయవిదారకముగా నుండెను. వాయునిర్దళితమైన కాలమేఘమువలె చిందర వందరమై ముఖబింబము నావరించిన కేశజాలములతో, కనుకొలకులనుండి చెక్కిళ్ళమీదుగ నేకధారగ ప్రవహించిన కన్నీటి జాడలతో, కఱకు త్రాటికట్లచే చారలు తేరిన కరచరణములతో, క్రుక్కువడిన నోటనుండి స్రవించిన రక్తపు జాడలతో, పదునెనిమిది యేండ్లకు మించని నవయౌవనవతి యగు నొకస్త్రీ ఆ ఱాతినేలపై మూర్ఛాగతమై పడియుండెను. "అదిగో, ఆమెయే ఆ దీనవనిత!" అని కాశీ, హాన్నా, జీవను లేకకంఠమున బలికిరి. చెంత నామె కాలుసేతులు బంధించిన త్రాళ్ళు పడియుండెను. కాలసర్పమువలె మీదికెత్తబడిన కాశీచేతి విచ్చుకత్తిని జూచి ఆ యమాయక ప్రాణ మెంత సొమ్మసిల్లిపోయెనో కాని అప్పుడు మూతపడిన కన్ను లిప్పటికిని తెరువబడలేదు!

"ఎంత ద్రోహము! ఎంత ఘోరము!" అను హాహాకారములతో ఆ ప్రాంగణమంతయు ప్రతిధ్వనించెను. చిక్కనను ముఖమునందు నెత్తురులేక నిర్జీవప్రతిమవలె మన్నా తలవంచుకొని నిలచియుండెను. హాన్నా యినుప

పిడికిలియందు చిక్కి, యాతని హస్తమునందలి రక్తప్రసారము స్తంభించిపోవుచుండెను. అందరి దృష్టియు ఆ నికృష్టలజ్జావనత ముఖమునందే లగ్నమై యగ్ని జిమ్ముచుండెను.

రత్నమాల మెల్లగ లోనికిబోయి మూర్ఛాగతమై యున్న యాజవ్వని ముంగురులు సరిదిద్ది, ఫాలభాగమును ముద్దిడుకొని, "అమ్మా! కరుణామయుడైన సర్వేశ్వరుడు నీకు తోడుకలడు." అని యశ్రువులు విడచెను. స్త్రీ జనమంతయు నామెచుట్టు మూగి అశ్రువర్షము కురిసిరి.

ఆద్యంతము కాశీ పల్కిన దంతయు సప్రమాణముగ ఋజువగుటచే ఆ యశేష ప్రజాసందోహమునందును ఒక్క కంఠమైనను మన్నా పక్షమున వెల్వడలేదు. అంత హమ్నా ఒక్క యూపున సగము చచ్చియున్న మన్నాను ముందున కీడ్చి, "ద్వీపవాసులారా! నేడు రత్నచండీ పవిత్రదివసము! ఈ విషకీటకమును నేడు చంపుటకు వీలుపడదు. రేపటి యుదయమే వీని నురికంబ మెక్కింతము." అని తీవ్రముగ పలికెను. వృద్ధపురోహితునివంక నొకసారి చూచి, అంగీకార సూచకముగ రత్నమాల తల యూచెను. ప్రజాగణము హర్షధ్వానము లొనర్చెను. ఆ సందడియందు, అనన్యగోచరములై రత్నమాలా జీవన్‌ల దృగ్జాలము లొక్కసారి కలుసుకొని విడిపోయెను.

తదుపరి స్త్రీజన సహాయమున, నేలపడియున్న ఆ యువతి నెత్తి యచ్చటనుండి తోడ్కొనిపోయి యొక విశాలమైన గదియందు ప్రక్కపై పరుండబెట్టి, నలుగురైదుగురు పరిచారికల నచ్చట కాపుంచి, రత్నమాలాదేవి ఆ వృద్ధ

పురోహితునివెంట నాగృహము విడచి బయటకు వచ్చెను. ఆమెవెంట కట్టతెగిన ప్రవాహమువలె ఆ జనసమూహ మంతయు బయటకు వచ్చి రాజభవనాభిముఖముగా నడువ సాగెను. మార్గమునందు కారాగృహముగ వాడబడుచున్న యా పురాతన గృహముకడ అందఱును ఆగిరి. అచ్చట హన్నా పసువు నీడ్చుకొని పోయినట్లు మన్నాను లోని కీడ్చుకొనిపోయి, గతరాత్రి జీవన్ బంధింపబడిన గదియందే నిర్బంధించి, "ఇదియే నీ కడసారి రాత్రి! దైవప్రార్థనము చేసికొనుము." అని యాతని హెచ్చరించి, బయటకు వచ్చెను. పిమ్మట "జై! రత్నచండీ! జై!" అను జయ ధ్వాన మొక్కసారిగా మిన్నంటెను.

ఈ ధ్వని ముగిసినదో లేదో, పర్వతసానువులు బ్రద్ద లగునట్లు సముద్రతీరమునుండి యొక పెద్ద ఫిరంగి శబ్దము వెల్వడి భూమిని కంపింపజేసెను. భయభ్రాంతమై ఆ యావ జ్జనసమూహమును సముద్రాభిముఖముగ చూచెను. ఒక పెద్ద పతాకనౌక సముద్రతీరమున పొగలు గ్రక్కుచు దృగ్గోచర మయ్యెను. "గోవా పతాకనౌక! ప్రభుత్వనౌక! రాజ ప్రతినిధి!" అను నినాదములు చెలరేగెను. "చెదరిపొండు. చెదరిపొండు" అను కేకలు మిన్నంటెను. ఏకప్రవాహముగ నడచుచుండిన ప్రజాగణమంతయు నిమేషమాత్రిమున గుంపులు గుంపులుగ చెదరిపోయెను. రాణి రత్నమాల పరి వార సహితముగ రాజగృహమునకు వెడలిపోయెను. గుంపులు గుంపులుగ చెదరిపోయిన జనసంఘమంతయు నిశ్శేషముగ కలిగిపోయెను. మూడు నిముషములలో రాజమార్గమంతయు

నిర్మానుష్య మయ్యెను. ఒక్క జీవన్ మాత్రము ఎటు పోవుటకును తోచక యేకాకియై సముద్రాభిముఖుఁడైపోయెను. ఆ సమయమునందు రాజప్రతినిధి ఆ ద్వీపమునకు వచ్చుటకు కారణమేమి? ఆ ప్రశ్నకు ప్రత్యుత్తరముగ ఆతని యంతరంగ మేమి చెప్పుచుండెనో యాతనికే తెలియును.

# అ ధ్యా య ము 12

ప్రభుత్వదృష్టియందు ఇంకను తానే యా ద్వీపమున కధిపతియగుటచే రాజప్రతినిధి నభ్యుద్ధాన మొనర్పవలసిన బాధ్యత తనదిగనే భావించి జీవన్ వడివడిగా పోవుచుండెను. ఇంకను సుమారు నూఱుగజముల దూరమునం దుండగనే ఆతని దృష్టి నౌకోపరిభాగమునందు ఎట్టయెదుట అవిరామముగ ఊచబడుచున్న యొక్క యుత్తరీయముచే నాకర్షింపబడెను. ఆవైపు నిదానించి చూడగా అట్టహాస విలసితమైన శంకర్ ముఖమండల మాతనికి విస్పష్టముగ గోచరించెను.

"శంకర్! శంకర్!" అప్రయత్నముగ నొక పెద్ద కేకవైచి పరుగున పోయి నౌకాశ్రయమున అాతికట్టు నాను కొనియున్న నౌకను సమీపించెను. తక్షణమే శంకర్ పైనుండి యొక త్రాటి నిచ్చెనను క్రిందకు జారవిడచెను. ఆ నిచ్చెనపై వడివడిగా నెక్కి జీవన్ శంకర్‌ను కౌగిలించుకొనెను. ఇంతలో చెంతనే యున్న బాజీ గోపీలు కూడ పరుగున వచ్చి యాతని కరచరణములకు సంకెలలు వైచిరి.

"జీవన్! నిన్ను మరల నీజన్మమున చూచుట కల్ల యనుకొంటిమి. ఈ మొసళ్ళ గుంటయందు ఇంతవఱకును నీ వెట్లు జీవించి యుండగలిగితివి?" అని శంకర్ ప్రశ్నించెను.

జీవన్:— భగవత్కృప! నా గాథ చాల పెద్దది. సావకాశముగ చెప్పెదను. కాని, అయగాధ పాతాళ ప్రవాహమునుండి మీ రెట్లు బయటపడితిరి? ఇంత శీఘ్రముగ ప్రభుత్వ సహాయమును దోడ్కొని మీ

రెట్లు రాగలిగితిరి? మీ వృత్తాంతము ముందు చెప్పుడు.

శంకర్:— ఇదియు భగవత్కృపయే! ఆ పాతాళ ప్రవాహమునందు పడి, మున్కలు వైచివైచి, ముగ్గురము ఒకరి వెనుక నొకరము ఎట్లో భగవదనుగ్రహమున అచ్చటి భయంకర జలావర్తములను తప్పి, కొట్టుకొని పోయి పోయి యెట్టకేలకు సముద్రమును చేరితిమి. అచ్చట, కొనయూపిరితో కొట్టుకొనుచున్న మమ్ము జూచి కొందరు జాలరులు మమ్ము దరిజేర్చిరి. మమ్మెట్లైనను గోదావరీతీరమును చేర్పుడని వారిని బ్రతిమాలితిమి. కాని, తమ నావలు అంతదూరము పోజాలవనియు, వలసినచో తమతో తమ నివాసద్వీపమునకు దోడ్కొని పోవుదు మనియు వారు చెప్పిరి. ఇంతదనుక కాపాడిన భగవంతుడు ఇకపైమాత్ర మేదో దారి చూపడా యని వారితో నావపై బయలుదేరితిమి. సుమారు మూడుగంటలా నావపై పోయిన పిదప, దూరమున పొగలగ్రక్కుచు ఈ పతాకనౌక మాకు దృగ్గోచరమయ్యెను. మమ్మా నౌకకడకు చేర్చుడని జాలరులను ప్రార్థించితిమి. అందు కంగీకరించి వారు నావను నౌకాభిముఖముగ నడపిరి. మా నావను చూచి, మా సౌంజ్ఞలను మన్నించి, ఈ నౌకాధిపతి దయతలచి నౌక నాపి మమ్ము లోని కెక్కించుకొని మా సమాచార మడిగెను. జరిగిన కథ యంతయు, మే మాతనికి పూసగ్రుచ్చి నట్లు వివరించితిమి. అంత నాతడు మమ్ము రాజప్రతి

నిధి యొద్దకు దోడ్కొనిపోయి, వృత్తాంత మంతయు నాతనికి తెలియబఱచెను. ఆత డదియంతయు సావధానముగ విని, కాన్త్యాంతరమున నెచ్చటికో పోవు చున్న ఆ నౌకను తక్షణమే హంసద్వీపమునకు మఱలింపు మని యాతని కాజ్ఞాపించెను. ఇది మాకథ! జీవన్! తిరిగి నీవు మాకంట పడుదువని మేము కలలో నైన తలంపకుంటిమి! నే డెట్టి సుదినము! రమ్ము. నిన్ను రాజప్రతినిధియొద్దకు తీసికొని పోయెదను. నిన్ను జూచినచో ఆత డానందించును.

అని యాతని దోడ్కొని, యుపరిభాగమునందు సమలంకృతమై రక్షకభట పరిరక్షితమై యున్న రాజప్రతినిధి గదియొద్దకు పోయెను. లోన సోఫాపై రాజప్రతినిధి మొరాకో పాషా చేరబడి యేవో ప్రభుత్వ పత్రములను పరిశీలించు చుండెను. నలుబదియేండ్లకు మించని నడివయస్సు! దట్టమైన కనుబొమలచే నావరింపబడిన పులికన్నులు! నల్లని పురిమీసములు! రెండంగుళముల చిరుగడ్డము! క్షమ, కరుణ, కనికరము, కలికమునకైన కానరాని కఠోరముఖవైఖరి! ప్రభుత్వాధికారము మూర్తీభవించినట్లు పొడగట్టుచున్న రాచఠీవి! చూచినంతనే యీతడు చండశాసను డని చెప్ప వచ్చును. ఆ ద్వీపవాసులు ఆతని రాకకు అంత భయపడుటకు కారణము జీవన్ ఇప్పుడు గ్రహించెను. యథోచితముగ ముం దాతని యనుజ్ఞబడసి జీవన్‌తో శంకర్ లోన ప్రవేశించి యాతని యెదుట నిలచి, "ప్రభూ! ఈతడే మా మిత్రుడు జీవన్‌లాల్!" అని పరిచయము చేసెను.

అంత నాతడు, "జీవన్‌లాల్! నిన్నుగూర్చి నీ మిత్రులు నాకు చెప్పియున్నారు. ఈ యనాగరక ద్వీపమున నిన్ను సప్రాణముగ చూడగల్గుదునని నే నాశించియుండలేదు. ఇంతవఱకును నీవు సురక్షితుడవై యున్నందుకు మనసార అభినందించుచున్నాను." అని మందహాసము చేసెను.

"ప్రభువుల యనుగ్రహమునకు కృతజ్ఞుడను!" అని జీవన్ సగౌరవముగ చేతులు జోడించెను.

"ఇంక నీ కెట్టి భయమును లేదు. నిశ్చింతగ నుండుము. నీ వలన నేను తెలుసుకొనవలసిన విశేషము లనేకము లుండును. కాని, ముందు నీ మిత్రులతో ఆనందముగ కొంత వఱకు గడపుము. ఒక్క గంటలో నేను తిరిగి నిన్ను పిలువ నంపెదను." అని వారిని పంపివైచెను.

తదనంతరము నలుగురు మిత్రులును ఏకాంతముగ నున్న మీది వసారాలోనికి బోయి చతికిలపడి, సర్వచింతా విదూరమైన స్వర్గమందిరమున సుఖాసీనులైన పగిది మహానందపరవశులై యిచ్చాగోష్ఠి ప్రారంభించిరి. భూగర్భ కుహరమునందు వారినుండి విడిపోయినది మొదలు, తిరిగి యిప్పుడు కలుసుకొన్నవఱకు జరిగిన కథాకాండ మంతయు జీవన్ వారికి సమగ్రముగ వివరించెను. ఆ భయంకర సంఘటనము లన్నియు వినిన పిదప, ఒక భీషణ దుస్స్వప్నమునుండి మేల్కాంచినవారివలె హృదయభార వివర్జితులై, విపత్పరంపరలను గడచి విజయద్వారము చేరుకొనిన జీవన్ అప్రతిమాన సాహసము నభినందించుచు ఆ ముువ్వురు మిత్రులును

మహోత్సాహమున మైమఱచి చిందులు ద్రొక్కిరి. పూర్తిగ నొక గంట కాలము వారి కొక నిముషమువలె గడచిపోయెను.

అంత రాజప్రతినిధినుండి జీవన్‌కు పిలుపు వచ్చెను. తక్షణమే యాతడు లేచి రాజప్రతినిధి సముఖమునకు పోయెను. ఆతని సగౌరవముగ నాసీను జేసి, ఆ ద్వీపము నందు జరిగినదంతయు నాతనినోట వినగోరెను. అంత జీవన్ తా నా ద్వీపమునకు చేరినది మొదలు, ఆనాటి యుదయము వఱకు జరిగినదంతయు సవిస్తరముగ విన్నవించెను.

"జీవన్‌లాల్! ప్రాణాపాయము గడచి ఇంతవఱకును నీవు సురక్షితుడవై యున్నందుకు నేను నిన్ను మరియొకసారి యభినందించుచున్నాను. ఈ ద్వీపవాసుల తత్వము నాకు బాగుగ తెలియును. వారికి సహితము నా తత్వము కొంత వఱకు తెలియును. ఈసారి పూర్తిగ తెలుసుకొందురు. — రమ్ము. నగరములోనికి పోవుదము."

అని లేచి నౌకావరోహణ మొనర్చి ఆయుధహస్తులగు రక్షకభటులు వెంట నడువ జీవన్‌తో రాజమార్గమున బయలుదేరెను. ఆవశ్యకమైనచో, యావద్వీపమును ఒక్కసారిగ కబళించివేయుదు నన్నట్లు నౌకోపరిభాగమునం దమర్చబడియున్న ఫిరంగి నోరు తెఱచుకొని ద్వీపాభిముఖమై యుండెను.

దారి పొడవునను వస్త్రభూషాలంకృతులైన భద్ర వ్యక్తులు ఒక్కొక్కరు కలసి భక్తిశ్రద్ధాంజలులు సమర్పించు చుండిరి. గవాక్షములనుండియు, మిద్దెలపైనుండియు, స్త్రీ జనము ఆ ప్రభుత్వాధికారిని వీక్షించుచుండిరి. అట్లు పోయి

పోయి ఆతడు కారాగృహముగ నిర్ణయింపబడిన ఆ పురా తన గృహమును సమీపించగనే అచ్చట కావలి కాయు చున్న సైనికబృందము యథోచితముగ సైనికవందన మొన ర్చిరి. అంత జీవన్, "ఈగృహమునందే ద్రోహియైన మన్నా మరణదండనము విధింపబడి బంధింపబడియున్నాడు" అని యాతని కెఱుకపరచెను.

"అట్లనా ?" అని యాతడొకసారి తల పంకించి, "ఇందలి విషకీటక మొక్కటి చచ్చినను కొంత భూభారము తగ్గిపోవును" అని మందహాసము చేయుచు ముందునకు నడచిపోయెను. అచ్చటినుండి వారు సరాసరి రాజభవనము నకు పోయిరి. బహిర్ద్వారముకడ సపరివారముగ రత్న మాల రాజప్రతినిధి కభ్యుద్ధాన మొనర్చి లోనికి తీసి కొని పోయెను. జీవన్ ఆమె నాతనికి పరిచయ మొన ర్చెను. రత్నమాల సగౌరవముగ నాతని నాసీనుజేసి, సవినయముగ "ఆర్యా! తా మీ ద్వీపమునం దుండు నంతకాలమును ఇచ్చటనే విడిసి మా యాతిథ్యమును స్వీకరించ బ్రార్థించుచున్నాను.'' అని పలికెను. అంత నాతడు ''సంతోషము. ఇచ్చట విడిదిచేయుటకు నాకేమియు నభ్యంతరములేదు. కాని, ఇతర ప్రయత్నము లనవసరము. మా పరివారము ఆ విషయమును చూచుకొనును. సకాల మున నేను నిన్ను కలసి మరల మాటాడెదను, ప్రస్తుతము నీకు శ్రమ కలిగింపను. లోనికి పోవచ్చును.'' అని యామెను లోనికి బంపెను.

పిదప జీవన్ వైపు జూచి, "జీవన్‌లాల్! ద్వీపాధికారి వైన నీ యాతిథ్యమును నేను గ్రహించుట యుక్తము. కాని, నీవు నా కాతిథ్యమిచ్చు స్థితియందు లేవు. కావున, నేనే నీ కాతిథ్య మిచ్చెదను. ఇచ్చటనే యుండగోరెదను" అని మందహాసము చేసెను. "చిత్తము" అని తలవంచుకొని జీవన్ తన యంగీకారమును సూచించెను.

పిమ్మట మొరాకీపాషా కుర్చీపై చేరబడి, హుక్కా పీల్చుచు ధూమమేఘములను వెదజిమ్ముచు, ఏదో దీర్ఘా లోచనమునందు నిమగ్నుడయ్యెను. చెంత సోఫాపై జీవన్ మౌనముద్ర వహించి కూర్చుండి యుండెను. అట్లు సుమారు పదినిముషములు నిశ్శబ్దముగ గడచిపోయెను. పిమ్మట మొరాకీ ఆ నిశ్శబ్దమును ఛేదించి, "జీవన్‌లాల్! ఈరాణి రత్నమాలనుగూర్చి నీ యభిప్రాయ మేమి?" అని యడిగెను.

జీవన్ :— ఈ స్వల్పకాలములో ఆమె యొక అమాయక బాలిక యని నేను గ్రహించితిని.

మొరాకీ :— మన్నాకును ఈమెకును వివాహసంబంధము స్థిరపడెనట కాదా!

జీవన్ :— ఒకవిధముగ స్థిరపడి యుండెనట. కాని, అది యిప్పుడు భగ్నమై పోయినది.

మొరాకీ :— ఎట్లు?

జీవన్ :— మన్నా ద్రోహమును గుర్తించి, బహిరంగముగ వాని మరణశిక్ష కామె యంగీకరించినది.

మొరాకీ :— (తలపంకించి) ఇంక నిప్పు డెవ్వనిపై యామె దృష్టి యున్నది?

జీవన్ :— తెలియదు.

మొరాకీ :— ఇప్టే అవివాహితయై యుండునా?

జీవన్ :— ఏమో తెలియదు.

మొరాకీ :— అంతటి యందకత్తె అవివాహితయై యుండుట ఈ ద్వీపమునందు శాంతిభద్రతలకు వాంఛనీయము కాదని నా యభిప్రాయము.

జీవన్ :— చిత్తము.

మొరాకీ :— (కొంచెమూరకుండి) ఈ విషయమై యింకను యోచింపవలసి యున్నది. ఇందు నీ సహకారము సహితము అవసరము.

జీవన్ :— చిత్తము.

ఇంతలో సాయంసమయ మైనది. లోనుండి పరిచారకులు ఫలాహార సామగ్రి కొని తెచ్చి యెదుట నమర్చిరి. ఇరువురును భేదభావములేక ఇష్టాగోష్ఠి సలుపుచు భోజనములను ముగించిరి. పిదప మొరాకీ, "నీ మిత్రులు నీ కొఱకై నౌకపై వేచుకొని యుందురు. నీతో సంభాషణమునకై యాతురపడుచుందురు. పోయిరమ్ము. రేపుదయము మరల మనము కలుసుకొందము." అని యాతని పంపివైచి, తన నివాసమునకై ప్రత్యేకింపబడిన గదికి పోయెను.

జీవన్ సరాసరి సముద్రతీరమునకు బోయి, మిత్రులను కలుసుకొని, ఆరాత్రి యంతయు మహానందమున అచ్చటనే వారితో గడపెను.

# అధ్యాయము 13

తెల్లవారగనే లేచి సముద్రస్నాన మొనర్చి, జీవన్ తిరిగి రాజభవనమునకు పోయెను. రాజప్రతినిధి మందహాసము చేయుచు నాతని లోని కాహ్వానించి యాసీను జేసి సగర్వముగ తన జేబులోనుండి యొక పత్రమును దీసి, "జీవన్‌లాల్! ఇదిగో, ఈ రాణి రత్నమాలకు ఈ ద్వీపమును నీవు ప్రత్యర్పణము జేయుచు వ్రాసియిచ్చిన పత్రము!" అని తాను వ్రాసిన పత్రమును తనకు చూపెను.

జీవన్:— (విస్మయముతో) ఈ పత్రము నామె మీ చేతి కిచ్చినదా?

రాజ:— అగును. ఆమెను పిలిపించి ఈ పత్రమును తిరిగి పుచ్చుకొంటిని. తీసికొనుము.

జీవన్:— ఇది తీసికొనవలసిన ఆవశ్యకత లేదు. దీనిని ఇచ్ఛాపూర్వకముగనే నే నామెకు వ్రాసియిచ్చితిని.

రాజ:— కావచ్చును. ఈ ద్వీపమును నీ వామె కిచ్చివేయ వచ్చును. కాని, దానికి ప్రభుత్వమునుండి యంగీకారము వచ్చువఱకును నీవే ఈ ద్వీపమున కధిపతివి.

జీవన్:— (నవ్వి) బాగున్నది! ద్వీపమును సంపాదించుట కన్న ద్వీపమును వదలించుకొనుటయే కష్టముగా నున్నదే!

రాజ:— అగును జీవన్! ప్రపంచమున అన్నియు నట్లే! చూడు, ప్రేమ వ్యవహారములు చూడు! స్త్రీ లంప

టము తగిలించుకొనుట సులభమా, వదలించుకొనుట సులభమా? — అన్నట్లు, అడుగ మఱచితిని. ఈ ద్వీపమునందలి కథాకాండ మంతయు చెప్పితివికాని ఒక్కవిషయము దాచివైచితివి కాదా?

జీవన్ :— ఏమది?

రాజ :— నాకు చిక్కిన కొన్ని రహస్యములందు నీకును రాణికిని సంబంధించిన రహస్య మొక్కటి యున్నది.

జీవన్ :— ఏమది?

రాజ :— రత్నమాల హృదయమున మన్నా ఆక్రమించి యుండిన స్థానమును నీ వాక్రమించితివట కాదా?

జీవన్ :— ఓహో! ఆ విషయమా? (పకపక నవ్వి) అగును. అట్లు దురభిప్రాయపడుటకు కారణము లేకపోలేదు. కాని, ఏ పరిస్థితులలో ఆమె యావిధముగ పల్కినదో గమనించవలయును కదా?

రాజ :— ఏ పరిస్థితులలో?

జీవన్ :— నా మెడపై కత్తివ్రేటు పడనున్న క్షణమునందు, నన్ను కాపాడుటకై యామె యట్లు పలికినది.

రాజ :— కావచ్చును. కాని, నిన్ను ప్రేమించుటకు ఆమెకు తగిన కారణముకూడ కలదు. ఆమెను మహావిపత్తు నుండి నీవు కాపాడితివి. దానికి ప్రతిఫలముగ ఆమె తన హృదయమును నీకర్పించుటయు న్యాయమే. ఆమెను నీవు పరిగ్రహించుటయు న్యాయమే. ఈ

ద్వీపమునకు వారసత్వ మామెకు కలదు. అధికార ముద్ర సీకు కలదు. అంతయు సమంజసముగనే యున్నది.

జీవన్ :— (మందహాసము చేయుచు) అట్టి యమూల్యాభరణాము ధరించుటకు నాకు యోగ్యత చాలదని నా యభిప్రాయము.

రాజ:— యోచింపుము. అన్నివిధముల నీ వామెను వివాహ మాడుటయే ఉచితము.

జీవన్ :— (తల వంచుకొని యోచించుచుండును)

రాజ:— అటుకాకపోయినచో —— ఆరత్నమును గ్రహించుట కింక నెవ్వాని కధికారము కలదో నీవే యోచింపుము.

ఈ విపరీతధోరణి జీవన్ కేమియు నర్థమగుటలేదు. నిరుత్తరుడై యూత డూరకుండెను.

రాజ:— నీవు కాకున్న..... నేను కావలెను. ఏమందువు?

ఈ మాటలకు జీవన్ చకితుడై, "ప్రభువువారు హాస్యమాడుచున్నట్లున్నది!" అని లోనుబుకుచున్న యొకానొక యపూర్వమైన యుద్రేకము నణచుకొని కృత్రిమమైన మందహాసముతో మారు పల్కెను.

రాజ:— నేను హాస్యమాడుటలేదు. నా భార్య మరణించినది. తిరిగి వివాహమాడు సంకల్పమున్నది. ఈమెకు సహితము వివాహ మాడవలసిన యవసర మున్నది. ఈ విషయమై మరల మనము సంభాషింతము. ప్రస్తుతము

వేఱొక ప్రభుత్వ వ్యవహారమును పరిష్కరింపవలసి యున్నది. నేను పోయివచ్చెదను.

అని లేచి, తన గదిలోనికి బోయెను. పిమ్మట జీవన్ ఏకాకియై కొంత సేపచటనే కూర్చుండెను. అతని యంతర్దృష్టి యేదో భావనాగోళమున సంచరించుచుండెను. ఇంతలో మేడమెట్లపై అడుగుల చప్పుడు వినవచ్చెను. తిరిగి చూచు సరికి క్రిందిమెట్టుపై రత్నమాల ప్రత్యక్షమై యుండెను. తక్షణమే యాతడు లేచి యామెను సమీపించెను. ఆమె ముఖము కళావిహీనమై యుండెను. చిరునవ్వుతో నామె యాతని పలుకరించెను. ఆ సమయమున ఆమెతో నేమి సంభాషింపవలెనో యాతనికి తోచలేదు. కొన్ని క్షణముల వరకు ఆ స్త్రీ పురుషుల నేత్రములు మాత్రమే నిశ్శబ్ద సంభాషణము గావించుకొనిన పిదప జీవన్, "దేవీ! మన్నా న్యాయవిచారణానంతరము మరల నీతో సంభాషింపగల యవకాశము నాకిప్పుడే చిక్కినది! నా ప్రాణరక్షణమునకై బహిరంగముగ నీవు పల్కిన వాక్యము ఇంకను నా కర్ణముల మారుమ్రోగుచున్నది! అందుకు నా కృతజ్ఞత వెలి బుచ్చుటకైన ఇంతవఱకు నాకు సమయము చిక్కినదికాదు.

రత్న :— నా ప్రేమదానము నందలి యంతరార్థము నీవు గ్రహించితివా జీవన్!

జీవన్ :— గ్రహించితిని. అది కేవలము నా ప్రాణరక్షణము నకై నిర్దేశింపబడిన ప్రయోగమని నేను తక్షణమే గ్రహించితిని.

రత్న :— నేను పల్కినది నీ హృదయమును చాల వేధించిన దేమో! మఱచిపొమ్ము జీవన్!

జీవన్ :— మఱచిపోవుటయా? జన్మాంతరమందైన మఱువ జాలను.

ఆ ముహూర్తమునందు ఆ యువతీ యువకుల యంత రంగములం దెట్టి భావము లుద్రేకించుచుండెనో వారికే యెఱుక! ఇంతలో లోపలి గదిలోనుండి రాజప్రతినిధి వికట హాసము వినవచ్చెను. దానిని విని రత్నమాల భయ విహ్వలయై, "జీవన్! ఆ వికటహాసమును వింటివా? క్రిందటిసారి ఈతడు మా ద్వీపమునకు వచ్చినప్పుడు, ఇట్టి వికటహాసమునే చేయుట నేను వినియుంటిని. ఆ వెంటనే, మా ద్వీపమునం దర్ధభాగము నిర్ధూమధామమై పోయినది. తిరిగి, ఇప్పు డట్టి వికటహాసమే వినవచ్చుచున్నది. దీని పర్యవసాన మేమగునో యని భయమగుచున్నది. అమా యకులగు ద్వీపవాసులకు హానిరాకుండ చూడుము జీవన్!

జీవన్:— ద్వీపవాసుల కెట్టి హానియు జరుగనీయను. కాని, ఈతనివలన వ్యక్తిగతముగ నీ కేమైన భయము కలదా?

రత్న:— నాకేమి భయము? నన్నత డేమి చేయగలడు? నీవు లేవా? ......కాని...... ఎంతకాలము నీ వీ ద్వీపమునం దుండగలవు?

జీవన్:— ఎంతకాల మావశ్యకమైన అంతకాల ముండగలను. ఇచ్చటనే యావజ్జీవమును గడపుటకు సహితము నా హృదయ మభిలషించుచుండును.

ఇంతలో తలుపు తెఱచుకొని మొరాకీ ద్వారముకడ ప్రత్యక్షమయ్యెను. ఆతని చూడగనే రత్నమాల కలవరపడి తల వంచుకొనెను. జీవన్ చెక్కుచెదరక ఆతని కభిముఖుడై నిలచెను. మొరాకీ వారిని సమీపించి జీవన్‌తో మందహాసము చేయుచు, "జీవన్! నీవు దాచినను రహస్యము దాగినది కాదు. నీకు వివాహము స్థిరపడినదట కాదా?" అని ప్రశ్నించెను.

జీవన్ :— ఎచ్చట?

మొరాకీ :— బొంబైనగరమునందు.

జీవన్ :— బొంబైనగరమునందా?

మొరాకీ :— అగును. అచ్చటనున్న మా రాయబారిని మీ వా రెవ్వరో కలసి నిన్నుగూర్చి ప్రశ్నించిరట! ఆతని ద్వారా వారు నీకు వర్తమానము పంపినారు. అది ప్రభుత్వపత్రములతో చేర్చి నాకు పంపబడినది. కార్యాంతరములందు తగుల్కొని వివాహముహూర్తమును నీవు మఱచిపోవుదువేమో యని హెచ్చరిక చేయుచున్నారు. ఇదిగో ఆ పత్రము.

అని యొక పత్రమునుదీసి జీవన్‌చేతి కందిచ్చెను. ఆతని కేమియు నర్థముకాలేదు. తనకు బొంబైనగరమునందు వివాహ సంబంధమేమి? ముహూర్త నిర్ణయమేమి? తన వారెవ్వరు? రెండు మూడు నిముషములుమాత్రము ఆతడు శూన్యచిత్తుడై ఆ వింతపత్రమును చూచుచు నిలచెను. పిదప ఆతని మానసమునందు తళుక్కున మెఱపు మెఱసి నట్లయ్యెను.

ఆ పత్రము నిస్సందేహముగ రాజప్రతినిధి కపోలకల్పితమని యాతడు గుర్తించెను. అందలి యంతరార్థము ఆతని యంతర్నేత్రమునకు విస్పష్టముగ గోచరించెను. రాజప్రతినిధి ప్రారంభింపనున్న రత్నమాలా వివాహ సన్నాహమునందు తానొక పెద్ద ప్రతిబంధకమని తలంచి, ఆ ప్రతిబంధకమును తొలగించుటకు ఆతడు పన్నిన పన్నాగ మిది యని జీవన్ సులభముగా గ్రహించెను. రత్నమాల సముఖమునందే ఆ వివాహవార్త వెలిబుచ్చినచో ఆమె హృదయమింక జీవన్ వైపు తిరుగనొల్లదని యాతడు భావించెను. ఆతని మనోగతమును పూర్తిగ గ్రహించి, జీవన్, "ఇదియు మంచిదే! ఈ వివాహవార్తను కల్పించి మీరు నాకు మహోపకారమే చేసినారు. ఇకముందు రత్నమాలకు నావలన కలుగు సహాయమునందు నిష్కలుషమగు గౌరవము తప్ప, అన్యభావమునకు తావుండదు." అని సంతోషించి, మొరాకీ నుద్దేశించి చిరునగవుతో, "అగును. ఆ విషయము నేను మఱువలేదు. ఇచ్చటి కార్యక్రమము ముగిసిన వెంటనే వెడలిపోవుటకు నిశ్చయించుకొని యున్నాను. ఈ వార్త తమ రాయబారి ద్వారా మావారి కందజేయుడు", అని పల్కెను.

మొరా:— ఇచ్చట నింక నేమి కార్యక్రమ మున్నది?

జీవన్:— మన్నా నురికంబ మెక్కించవలసి యున్నదికదా! స్వయముగ గోవా పోయి మిమ్ము దోడ్కొనివచ్చి ఆ పని చేయించదలచితిని. దైవికముగ తామే వచ్చితిరి. ద్వీపవాసు లీవఱకే వాని కాశిక్ష విధించినారు. ఇంక వాడు ఉరికంబ మెక్కుటమాత్రమే మిగిలియున్నది.

మొరాకీ:— అగును. ఆ విషయమై పరిశీలించుచున్నాను. నేడో, రేపో ఆ నిర్ణయము చేయుదును. ఆ కారాగృహముకడ ద్వీపవాసులైన భటులను తీసివైచి నా స్వకీయ రక్షకభటులను కాపుంచినాను. ఈ ద్వీపవాసులయందు నాకు విశ్వాసము లేదు. — రాణీ! నీతో కొన్ని విషయములు ప్రత్యేకముగా మాటాడవలసి యున్నది. సమయము చూచుకొని కబురంపెదను. — జీవన్! నే నింకను చూడవలసిన ప్రభుత్వ పత్రము లనేకము లున్నవి. నీకు సంబంధించిన పత్రము కంట బడగనే, అది నీకు చూపవచ్చితిని. పోయివచ్చెదను. నేను వచ్చుట కొంచె మాలస్యమగును.

అని పల్కి, తిరిగి తనగదిలోనికి పోయెను. ఆతడు చూచుచుండగనే రత్నమాల తిరిగి మెట్లెక్కి మేడమిదాదికి పోయెను. జీవన్‌లాల్ ఒంటిగ కొంతసే పచ్చట కూర్చుండి, మొరాకీ భవిష్యత్కార్యక్రమమును గూర్చి యోచింపసాగెను.

"వీనిమూలమున ఈ ద్వీపమునందు మరల నొక పెద్ద తుపాను సంభవించునని తోచుచున్నది! కానిమ్ము. నా ప్రతిభావిశేషమున కిది యొక గీటురాయి!" అని సగర్వముగ నచ్చటనుండి లేచి బయటకువచ్చి ఆకాశముపై నాల్గు వైపుల నుండియు క్రమ్ముకొని వచ్చుచున్న మేఘపంక్తులవైపు తదేకదృష్టితో చూచుచుండెను. ఇంతలో వెనుకపాటున హాన్సూ వచ్చి యాతని భుజముపై తట్టి, జీవన్‌లాల్! ఏమి చూచుచున్నావు? మేఘములు క్రమ్ముకొనుచున్నవి!

ఉరుములతో, మెఱపులతో, పిడుగులతో వర్షము వచ్చుచున్నది! నీ ప్రారక చూచుటయేనా, లేక —

జీవన్ :— ఏమిచేయుమందువు ?

హాన్నా :— మొరాకీతృష్ణాబాణమునకు రత్నమాలాదేవి గురికానున్నది. మన్నాహస్తములనుండి తప్పించి ఆమె నిప్పుడు మొరాకీహస్తములందు విడచి వైచెదవా ?

జీవన్ :— అసహాయుడను నేనేమి చేయగలను ?

హాన్నా :— నీకు సహాయముగ నేనున్నాను. మన మిర్వురము కలసి ఆమె నీ విపద్గోళమునుండి తప్పింపవలయును.

జీవన్ :—ఆమెసహితము మనకు సహాకరింపవలయును కదా!

హాన్నా :— తప్పక సహాకరించును. ఆమె హృదయము నే నెఱుగుదును.

జీవన్ :— ఎట్లు ?

హాన్నా :— ఆమెయొద్ద నాసోదరి దాసిగా నున్నది. ఈరాత్రి మొరాకీ ఆమెను పిలిపించి తన్ను వివాహమాడుమని నిర్బంధించును. ఆమె తప్పక ప్రతిఘటించును. మొరాకీ అంతటితో విడచువాడుకాడు. దాని పర్యవసాన మెట్లుండునో నీ వూహించుకొనుము. ఈరాత్రియే ఆతనియొద్దనుండి తిరిగివచ్చిన పిమ్మట నీ వామెను కలసి కార్యక్రమమును నిర్ణయించుకొనవలయును.

అర్ధరాత్రి గడచినపిమ్మట, వెనుకటి నిచ్చెనదారిని నీవు పెరటి డాబామీదికి కెక్కుము. అచ్చట నీకై రత్నమాలాదేవి వేచుకొని యుండునట్లు నేను నా సోదరిద్వారా ఏర్పరచెదను. కంటికి ఱెప్పవలె నేను నిన్ను కనిపెట్టుకొనియే యుండెదను. జీవన్! అర్ధరాత్రి గడచినపిమ్మట నిశ్శబ్దముగ పెరటి యావరణమునకు రమ్ము. అచ్చట నిచ్చెన సిద్ధపఱచి నేను వేచుకొని యుండెదను. ఇంక పొమ్ము. మీరాకకై చూచుచుండును.

అని భుజముతట్టి తన మార్గమున పోయెను. నూతనోత్సాహము నేత్రాంచలముల చిందులాడ జీవన్ తిరిగి రాజభవనమున ప్రవేశించెను.

# అ ధ్యా య ము 14

అర్ధరాత్రి కావచ్చెను. చిన్న వర్షము కురిసి వెలసెను. ఆకాశ మంతయు మేఘాక్రాంతమై యుండెను. మేఘమాలికల నీలి తెరలందు నక్షత్రములు దాగుడుమూత లాడుచుండెను. గవాక్షమార్గమున ఆ ప్రకృతి విన్యాసములను పరికించుచు జీవన్ తెప్పవాల్చక క్షణములను లెక్కించుచుండెను. రాజభటు డొకడు మేడమెట్లెక్కి పోవుటయు, తక్షణమే యొక పరిచారికతో రత్నమాల మెట్లు దిగివచ్చి రాజప్రతినిధి గదిలో ప్రవేశించుటయు నాతడు గమనించెను. పిమ్మట ఆ గదియందు జరిగిన వాక్ సంఘర్షణము అస్పష్టముగ నాతని కర్ణముల బడెను. తదుపరి తలుపు తెరచుకొని పరిచారికా సహితముగ రత్నమాల చరచర మేడమెట్లెక్కి పోవుటయు నాతడు గమనించెను. పిమ్మట సుమారొక గంటవఱకు రాజప్రతినిధి గదిలోని దీపము వెలుగుచునే యుండెను. అనంతరము దీప మార్పివేయబడెను. గృహమంతయు నిశ్శబ్దమై యుండెను.

జీవన్ మెల్లగ లేచి సుపరిచితమైన యా గృహము నందలి ద్వారము లన్నియు గడచి మార్జాలమువలె పెరటి యావరణమున ప్రవేశించెను. డాబాచెంత నిచ్చెన యమర్చబడి యుండెను. చెంతనే నిలచియున్న హసూ్నా జీవన్‌తో "వచ్చితివా! ఇదిగో నిచ్చెన. మీదికి పొమ్ము. నీ రాకకై ఆమె వేచుకొని యుండును" అని పల్కెను. జీవన్ వడివడిగా

మెట్లనెక్కి మీదికి పోయెను. మీదిమెట్టుపై నుండగనే రత్నమాల ఆతనికి చేయూత నిచ్చెను.

జీవన్ :— దేవీ! నాకై వేచుకొని యుంటివా?

రత్న :— అగును. ఈ రాత్రి వానితో యుద్ధముచేసి వచ్చితిని. తెల్లవారిన పిదప యేమగునో తెలియదు.

జీవన్ :— నిర్భయముగ నుండుము. నీ నిమిత్తమై యిప్పుడు నేనొక కపటనాటక మాడెదను. నే నే మొనర్చినను అది కేవలము నటనయే అని మాత్రము నీవు గ్రహించి అందుకు సమ్మతించవలయును.

రత్న :— నీ వేమిచేసినను నాకు సమ్మతమే.

జీవన్ :— ఆనాడు నా ప్రాణరక్షణమునకై నీవు నీ హృదయమును నా కర్పించినట్లు నటించితివి. నీ క్షేమమునకై యిప్పుడు నేను నీ ప్రేమహృదయమును స్వీకరించి నట్లు నటించెదను. కేవలము నటనయే. నీకు సమ్మతమేనా?

రత్న :— నీవేమి చేసినను నాకు సమ్మతమే. కాని, నా నిమిత్తమై యొక మహావిపత్తిని నీ వెదుర్కొనవలసి యుండును.

జీవన్ :— అన్యోపాయము లేదు. దేవీ! నీ నిమిత్తమై యెట్టి యాపద నెదుర్కొనుటకైనను నేను సిద్ధముగ నున్నాను. మన వివాహము నిశ్చయమైనదనియు, నా స్వదేశమున వివాహకార్యము జరుపుకొనెద ననియు, మనతో హన్నా సోదరీ సహితముగ వచ్చు

సనియు, ఱేపుదయమే వానితో చెప్పి ఈ ద్వీపము నుండి వెడలిపోవుదము.

రత్న :— ఆతడు మనలను పోనిచ్చునా ?

జీవన్ :— ఏల పోనీయడు ? —— కాని, నా స్వదేశమునందు నీ వెచ్చటనుందువు ? అచ్చట నీ కెవ్వరైన బంధువులు కలరా ?

రత్న :— బొంబై సమీపమందు నా తండ్రికి ప్రాణమిత్రుడైన యొక జమీందారుడు కలడు. అచ్చట కొంతకాల ముండగలను.

జీవన్ :— మంచిది. నిన్నచ్చటకు చేర్చెదను. తదుపరి కార్యక్రమము చూచుకొందము.

రత్న :— కాని, నీ వివాహసంబంధ మీవటుకే స్థిరపడినట్లు మొరాకీ యెఱుగును కదా ?

జీవన్ :— అయిన నేమి ? పీటలపై పెండ్లిండ్లు తప్పిపోవుట లేదా ? ఈ సంబంధ మిప్పుడు స్థిరపడినదని చెప్పినచో ఆ పూర్వసంబంధమునకు స్వస్తి చెప్పినట్లు కాదా ?

ఇట్లు వారు డాబాపై సంభాషించుచుండ, క్రింద "ఎవరు నీవు ? ఇచ్చట ఈ నిచ్చెన యేల ?" అని సుపరిచితమైన యొక కంఠము ప్రశ్నించెను.

"మొరాకీ !! మాయావి, నిద్రించినా డనుకొంటిని. దేవీ ! నీవు నీ గదిలోనికి వెడలిపొమ్ము" అని జీవన్ ఆమెను పంపివైచి, తాను డాబా యంచుపై నిలచి కనిపెట్టుచుండెను.

"నిచ్చెన, మీదికెక్కుటకును, మీదినుండి దిగుటకును పనికివచ్చును. అడుగనేల?" అని హన్నా బింకముగ బదులు పల్కెను.

"అట్లనా? ఎట్లు పనికివచ్చునో నేనెక్కి చూచెదను." అని మొరాకీ యెక్కబోయెను.

"ఎక్కుటకు వలనుపడదు. దూరముండుము." అని హన్నా తీవ్రముగ పలికెను.

"ఏమీ! నేనెవరినో గుర్తించితివా?" అని మొరాకీ గర్జించెను. అంత డాబామీదనుండి జీవన్, "హన్నా! హన్నా! ఏమది! రాజప్రతినిధినే గుర్తింపలేకపోయితివా?" అని బిగ్గఱగా పల్కెను. ఆ మాటలను విని మొరాకీ నివ్వెరపోయి, "ఎవరువారు? జీవన్! నీవా?" అని మొగమెత్తి ప్రశ్నించెను.

జీవన్ :— ఔను ప్రభూ! మీరు నిద్రించుచున్నారనుకొంటిని. పిల్లి కన్నుమూసినప్పుడేకదా యెలుకలకు రవంత స్వేచ్ఛ!

అనుచు నిచ్చెనదిగి క్రిందికి వచ్చెను.

మొరాకీ :— డాబామీద నీ వెవ్వరితోడనో మాటాడుచున్నట్లున్నది!

జీవన్ :— (నవ్వుచు) అగును. తెల్లవారగనే మీతో చెప్పదలచితిని. లోలోపల కుములుచుండిన యొక వ్యవహార మిప్పుడు స్థిరపడినది. అన్యోన్యాంగీకారముపై రత్నమాలకును నాకును వివాహము నిశ్చయమైనది.

మొరాకీ :— (చకితుఁడై) ఎట్లు? నీ వివాహ మీవలకే యొకా నొక బొంబైయువతితో స్థిరపడి యుండెను కదా!

జీవన్ :— దానికేమి! అది యిప్పుడు రద్దుకాబడును.

ఇట్లు సంభాషించుకొనుచు ఇరువురును తిరిగి గృహము జొచ్చి చావడిలోనికి వచ్చిరి. ఆరిన దీపము తిరిగి వెలిగించబడెను. ఆ దీప జ్యోతియందు ఇరువురును ముఖాముఖి గూర్చుండిరి. రాహుగ్రస్తమైన మొరాకీ వదనబింబమును జూచి జీవన్ ముఖశ్రీ మందహాసము చేయుచుండెను. క్షణమాత్రము మౌనము వహించి మొరాకీ "ఓయీ! నీ మనస్తత్వము నాకేమియు నర్థమగుటలేదు." అని పలికెను.

జీవన్ :— ఏమి?

మొరాకీ:— వివాహ మనగా పసిపాపల బొమ్మలాట యనుకొంటివా?

జీవన్ :— ఎన్నటికిని కాదు. అది భిన్న భిన్నములైన రెండు జీవాత్మల యావజ్జీవ సంయోగము. అన్యోన్యాంగీకారముపై ఆ పవిత్ర సంయోగము జరుగవలయును. కావుననే పూర్వసంబంధమును రద్దుపఱచి, ఈ సంబంధమును స్థిరపరచుకొనుట సంభవించినది.

మొరాకీ:— పూర్వ సంబంధమును నీ వంగీకరించలేదా?

జీవన్ :— మనస్ఫూర్తిగ అంగీకరించిన అచ్చటనే యుండక ఈ మారుమూల ద్వీపమున కేల వత్తును.

మొరాకీ:— అట్లయిన వివాహామునకు వెఱచి పలాయనమై వచ్చితివన్నమాట! వచ్చి యిచ్చట నీ నాటకము నారంభించితివన్నమాట!

జీవన్:— నేను ఏ నాటకము నారంభించ లేదు.

మొరాకీ:— మరి దీని కేమందురు ?

జీవన్:— ఏమందురో నాకు తెలియదు. అన్యోన్య సహాయమునందు మొలకలెత్తిన యొక ప్రేమలత మా యిద్దరను బంధించినది. ఆ ప్రేమలత సుస్థిరమైన వైవాహిక బంధము కానున్నది. అంతే. ఇందు నాటక మేమున్నది ?

మొరాకీ:— అట్లు జరుగ నేరదు జీవన్ !

జీవన్:— కారణము ?

మొరాకీ:— ఒకానొక స్త్రీ నీవలన మోసగింపబడుచున్నది. ప్రభుత్వము అట్టి యవినీతిని సహింపదు.

జీవన్:— ఏ ప్రభుత్వము ?

మొరాకీ:— మా ప్రభుత్వము.

జీవన్:— ఆ యువతికిని మీ ప్రభుత్వమునకును సంబంధ మేమి ? ఇంతకును మీ ప్రభుత్వముతో నా కేమి పని యున్నది ? నేను గోవాప్రభుత్వ పౌరుడను కానని గుర్తించుడు.

వాగ్వివాదము క్రమక్రమముగ శ్రుతిమీరుచుండెను. తాత్కాలికమైన మానసికోద్వేగముచే తాను హద్దుమీరి

యవివేకముగ ప్రవర్తించితినని మెురాకీ శీఘ్రముగనే గుర్తించుకొనెను. భావికార్యక్రమమునకు అవరోధము కలిగించుకొనుచుంటినని తెలుసుకొనెను. చతురుపాయ ధురంధరమైన రాజకీయ తంత్రమునందు ఆరితేరిన మాయావి యగుటచే, ఆంతరంగిక మనఃప్రవృత్తిని ప్రచ్ఛన్నమొనర్చి, క్షణమాత్రమున ముఖవైఖరి మార్చివైచి, మందహాసము తొలకరింప జీవన్‌తో నిట్లనెను.

"జీవన్ ! మెచ్చితిని. నీ హృదయదార్ఢ్యమునకు సంతోషించితిని. నీ మనస్తత్వమును పరీక్షింపగోరి నేను పలికిన అసభ్యవాక్యములకు నీవన్యథా భావింపకుము. రాణి రత్నమాలను నీవే వివాహమాడుట యుక్తమని నే నిదివరకే చెప్పియుంటిని. అవశ్యము మీకు వివాహము జరుగుగాక ! అందుకు సంతోషించువారిలో మొదటివాడను నేనని గ్రహింపుము."

జీవన్ :— ప్రభువువారి యభిమానమునకు మే మిరువురమును కృతజ్ఞులము. నా స్వస్థలమైన బొంబైనగరమునందు వివాహకార్యము నిర్వర్తించుకొన నిశ్చయించుకొంటిమి. సోదరీసహితముగ హన్నా మావెంట వచ్చుట కంగీకరించెను. తమ సెలవైనచో రెండు మూడు దినములలో బొంబై పోయి వచ్చెదము. ఈలోపున మన్నా శిక్షావిధానముకూడ పూర్తి యగును.

మొరాకీ :— అవశ్య మట్లే యగుగాక ! కాని, ఇచ్చటనే ఆ మహోత్సవము జరిగినచో మేము సహితము అందు పాల్గొనగల్గుదుము.

జీవన్ :— నిశ్చయమే. కాని, నా బంధువర్గ మంతయు నచ్చట నున్నది. మరియు, పూర్వ సంబంధమును ముందు రద్దుచేసుకొనవలసిన బాధ్యత నా మీాదనే కలదు కదా! కావున, అచ్చటకుపోయి, ఆ కాండమంతయు పూర్తిచేయ దలచితిని.

మొరాకీ:— మంచిది. అట్లనే కానిమ్ము. నిర్విఘ్నముగ శుభ కార్యమును చేసికొనిరండు. రాత్రి చాల గడచి పోయినది. ఇంక నీవు నిశ్చింతగ విశ్రమించుము.

అని లేచి, తన గదిలోనికి బోయెను. జీవన్ లాల్ తన మేను ప్రక్కపై చేరవైచెనేకాని కంటికి కూర్కు రాలేదు. పరిపరివిధముల యాలోచనములతో ఆతని తల బరువెక్కు చుండెను. వాతపడిన బెబ్బులి దంష్ట్రావక్త్రి మావులించి మరుక్షణముననే ప్రసన్నత చూపినది. ఈ ప్రసన్నతను విశ్వసించుటకు జీవన్ లాల్ మానస మొప్పుటలేదు. ఈ కథ యింతటితో ముగియునది కాదని యాతని యంతర్వాణి ఘోషించుచుండెను.

# అ ధ్యా య ము 15

తెల్లవారినదో లేదో, రాజప్రతినిధి గదియందు ఒక పెద్ద తుపాను రేగుచున్నదా యనునట్లుండెను. ఇంటి కప్పు ఎగిరిపోవునట్లు మొరాకీ గర్జించుచుండెను. పరిజనులు కొందఱు గదిముందు గుమికూడి బిక్కమొగములతో నొకరి నొకరు చూచుకొనుచుండిరి. తుపాకి గుండ్లవలె రాజప్రతినిధి నోటనుండి ఆజ్ఞాపరంపరలు వెలివచ్చుచుండెను. ఈ ప్రళయము ఆగదియం దెంతకాలమై ప్రారంభమైనదో తెలియదు. దూరమునుండి కొంతకాలము వినివిని జీవన్ మెల్లగ ఆ గదియందు ప్రవేశించెను. ఆతని జూచి మొరాకీ "జీవన్ ! సర్వనాశనమైనది ! అభాజనులైన నా పరిజనుల అజాగ్రత్తచే కారాగృహమునుండి మన్నా తప్పించుకొని పోయినాడు !" అని చెప్పెను.

జీవన్ :— (ఆశ్చర్యముతో) ఏమీ ! మన్నా తప్పించుకొని పోయెనా ?

మొరాకీ :— గవాక్షమంతయు పెల్లగింపబడినదట ! అంత పని జరుగుచున్నంతకాలమును కావలియున్న ఆ కునుకుబెద్దులు ఏమిచేయుచుండిరో ! ఆశ్చర్యముగ నున్నది ! పైనుండి సహచరు లెవ్వరో మన్నాకు సహాయము చేసియుందురు.

జీవన్ :— (కొంచెము యోచించి) ఎవరి సహాయము లేక ఇట్టి పని జరుగునా ? ఈసరికి ద్వీపమునుండియే తప్పించుకొని పోయెనేమో !

మొరాకీ:— అసాధ్యము. వర్తమాన మందిన యుత్తరక్షణమే తీరమంతయు భద్రపఱచు నిమిత్త మాజ్ఞాపించితిని. ఇంక నెచ్చటకు పోగలడు ?

జీవన్ :— ఆతని భార్య వసించుచున్న పర్వతకుటీరమునందు:—

మొరాకీ:— వెదకించితిని. అందు లేడు. పర్వత ప్రదేశ మంతయు గాలింపించితిని. ఎచ్చటను వాని జాడ కానవచ్చుట లేదు. కానిమ్ము. ఎచ్చటకు పోగలడు ? ఈ క్షణమే ఈ ద్వీపమునందలి ప్రతి గృహమును పరిశీలించెదను. ఈ సంఘటనము నా ప్రతిష్ఠకే భంగ కరమై యున్నది. జీవన్ ! నీ ప్రయాణమునకు పూర్వమే వాని శిక్ష పూర్తిచేయదలచితిని. దైవ మన్యథా తలచినట్లున్నది ! ఏమైనను వానిని తిరిగి బంధింపక విడువను. నీవు నీ ప్రయాణసన్నాహమునం దుండుము. నే నొక్కసారి నగరములోనికి పోయి వచ్చెదను.

అని సపరివారముగ బయలుదేరెను. జీవన్ మెల్లగ మరల చావడిలోనికి వచ్చి సోఫాపై చేరబడెను. ఈ హఠాత్ సంఘటనము ఆతని కేమియు నర్థము కాలేదు. ఆతని మానసము సంశయాకులమయ్యెను. ఈ 'తప్పించుకొని పోవుట' సత్యమగునా ? గతరాత్రి తనకును రాజప్రతినిధికిని జరిగిన సంఘర్షణమునకును, తదుపరి కుదిరిన తాత్కాలిక సమాధానమునకును, దీనికిని సంబంధముకలదా? ద్వీపవాసులు విశ్వసనీయులు కారని వారిని తీసివైచి, తనవారినే కారా గృహముకడ కాపుంచెను. అవసరమగుచో, మన్నాను తన

చేతి ఆయుధముగా నుపయోగించుకొనుటకా ? పూర్వాపర ములనెల్ల యోచించినకొలదియు ఆతని మానసమున అచంచలమైన సందేహము ఘనీభవింపజొచ్చెను. ఏమైనను తనచే పడగపై వ్రేటుపడిన మహాసర్ప మొక్కటి యిప్పుడు బంధవిముక్తమై యున్నది. నిశ్శంకమై, నిరపాయమై యుండిన యాతని జీవనము ఒక్కరాత్రిలో తిరిగి మహావిపద్గోళము నందు పడినది! కాని ఆతని హృదయము చలింపలేదు. జీవన్మరణములను తృణప్రాయముగ పిడికిటబట్టి కార్యరంగమున కుఱికెడి వజ్రహృదయుడు! ఇదియంతయు మొరాకీ పన్నిన పద్మవ్యూహ మని యాతని కల్పనానేత్రమునకు విస్పష్టముగ గోచరించెను.

"కానిమ్ము, దైవమే కలడు!" అని లేచి, ఒక్కసారి పెరటి యావరణములోనికి పోయెను. దివారాత్రము లచ్చటనే యొకవిధముగ కావలి కాయుచున్న హాన్నా కానబడెను.

జీవన్ :— హాన్నా! వింటివా?

హాన్నా :— వింటిని! అందలి రహస్యమును గ్రహించితివా?

జీవన్ :— గ్రహించితిని. ఇది స్వకార్యసాధనమునకై మొరాకీ కల్పించిన మాయావ్యూహము! రాజప్రతినిధి యగుటచే స్వయముగ బయల్పడ నొల్లక, నిమిత్త మాత్రముగ నుండుట కా విషకీటకమునకు స్వేచ్ఛ నిచ్చి స్వాధీనపరచుకొనినాడు! వాని మూలమున నన్ను కడతేర్ప దలచినాడు! నాకేమి సంభవించి నను నేను విచారింపను కాని, అసహాయమైన

రత్నమాలాదేవికై నా హృదయము తహతహలాడు
చున్నది! హాన్ప్సూ! ఇప్పుడు మన కర్తవ్యమేమి?

హాన్ప్సూ:— ఆమె క్షేమమునకై ఆత్మార్పణము చేయుటకై మనము సిద్ధపడుటయే కర్తవ్యము. నా కంఠమునందు జీవము లుండునంతవఱకు ఆమె కెట్టి యాపదయు కలుగజాలదు.

జీవన్:— సరియే! నీప్రాణములకును నాప్రాణములకును లంకె కదా! కానిమ్ము. సర్వేశ్వరుడే కలడు. ప్రస్తుతము నే నొకపని చేయదలచితిని. నీ విచ్చటనే యుండుము. నే నొకసారి ఆ పర్వత కుటీరముకడకు పోయి చూచివచ్చెదను.

హాన్ప్సూ:— వలదు. అది చాల ప్రమాదకరము. ఆ కుటీర పరిసర మంతయు మొరాకీ భటవర్గముచే పరిరక్షితమై యున్నదని వింటిని.

జీవన్:— ఉండనిమ్ము. నే నిప్పుడు రాజప్రతినిధికి బహిరంగముగ మిత్రుడనే కదా! నిరాఘాటముగ పోగలను. మన్నా అందు నిశ్చయముగ దాగియుండును. బాహాటముగ నేను వానిని పట్టియిచ్చినచో మొరాకీ వ్యూహ మంతయు భగ్నమైపోవదా! నీ విచ్చటనే యుండుము.

అని పల్కి జీవన్ ప్రాకారకుడ్య మెక్కి వడివడిగా కుటీరాభిముఖుడై పోసాగెను. కుటీరప్రాంతము చేరుసరికి ఆయుధహస్తులైన సైనికులు కొందఱు అందందు అప్రమత్తులై

కావలి యుండుట ఆతడు చూచెను. కాని, వెనుకంజ వేయక ముందునకు పోసాగెను. ఇంతలో నొక యుద్యోగి యాతని సమీపించి "అయ్యా! ఎచ్చటకు పోవుచున్నారు?" అని ప్రశ్నించెను.

జీవన్:— ఆ కుటీరమునకు పోవుచున్నాను.

ఉద్యోగి:— పోవుటకు వలనుపడదు. వెనుకకు మరలిపొండు.

జీవన్:— నేను రాజప్రతినిధి సన్నిహితవర్గములోనివాడనని మీకు తెలియునుకదా?

ఉద్యోగి:— కావచ్చును. కాని, దోమనైన ఈ త్రోవను పోనీయరాదని రాజప్రతినిధి యాజ్ఞ! నేనేమి చేయుదును. దయయుంచి మరలిపొండు.

అని మృదువాక్యములతోడనే అవరోధించెను. చేయునదిలేక జీవన్ వెనుకకు మరలెను. ఆ కుటీరమును భద్రపరచుటకే ఈ ప్రయత్నమంతయు చేయబడినదని తాను ముందే గ్రహించెను. ముఖ్యముగ తన్నవరోధించుటకే ఈ రక్షకవర్గము నియమింపబడినదనియు, ఆ విషసర్పము విశ్రృంఖలమై అందు సురక్షితముగ దాచబడెననియు ఆతని యంతరాత్మ చెప్పుచుండెను. కాని, చేయునదిలేక, ఖిన్నమనస్కుడై యాతడు తిరిగి యథాస్థానమునకు వచ్చెను. జరిగిన యుదంతము హసన్నా చెవినివైచి అప్రమత్తముగ నుండుమని చెప్పి, సముద్రతీరమునందు నౌకావాసము చేయుచున్న తన ముప్పురు మిత్రుల నొక్కసారి కలసి, వారికీ నూతన విపత్తు తెలియబఱచి దేనికైనను సర్వసిద్ధముగ

నుండుడని చెప్పుటకు సముద్రాభిముఖుడై వడివడిగా పోసాగెను. మార్గమధ్యమున నొక బాలుడు పరుగిడుచు వచ్చి యొక లేఖ నాతనిచేతి కందిచ్చెను. అది శంకర్ తనకు వ్రాసినది. అం దిట్లుండెను—

" జీవన్,

విసుగెత్తి చిన్న సముద్రయాత్ర చేయుటకు బయలుదేరుచున్నాము. రాజప్రతినిధి వేరువనే వచ్చి మా యాత్రకు సదుపాయము లన్నియు చేసినాడు. రెండు రాత్రు లన్యత్ర గడపి మూడవనాటికి తిరిగి వచ్చెదము. మన్నా తప్పించుకొనిపోయె నన్న విషయము రాజప్రతినిధియే మాతో చెప్పినాడు. వానిని తప్పక పట్టితీరెదనని యాతడు దృఢముగ చెప్పినాడు. మేము వచ్చువఱకు నీవు అనవసర ప్రమాదములను తెచ్చిపెట్టుకొనవలదు. జాగ్రత!

ఇట్లు
శంకర్."

ఈ జాబు చూడగనే జీవన్ విభ్రాంతుడయ్యెను. ఎదుట సముద్రముపై నౌక యప్పుడే బహుదూరము పోయి యుండెను. "సెబాస్! మొరాకీ! అమోఘమైన నీ తంత్రజ్ఞతకు జోహార్!" అని తనలో తాను అప్రయత్నముగ మొరాకీ కార్యదక్షతను ప్రశంసించెను. బద్ధవైరియైన మన్నాకు స్వేచ్ఛనిచ్చి తనపై ప్రయోగింపనుండుటయేగాక, సన్నిహితమైయున్న మిత్రసహాయమును సహితము దూరము చేసి తన్ను ఏకాకిని జేసెను! ఇంక చేయునదేమి? అయినను ధైర్యమును మాత్రము విడువక, పరంపరాగతము లగుచున్న

సహస్రభావములచే సందడించుచున్న హృదయముతో జీవన్ తిరిగి రాజగృహోన్ముఖుడై నడువసాగెను. గృహము చేరుసరికి మొరాకీ ద్వారముకడ నిలచి "జీవన్! నిష్కారణముగ నచ్చటి కేల పోయితివి? నీ మిత్రుల నౌకాయాత్రను గూర్చి నేనే నీకు చెప్పియుందునుకదా!" అని మందహాసము చేసెను.

జీవన్ :— తెలిసినచో నేనుసహితము వారితో పోయియుందును. ఈ ద్వీపాంతరవాసము నాకు విసుగు పుట్టినది.

మొరాకీ :— నీవు చెప్పియుండినచో వారితో తప్పక పంపియుందును. ఇప్పు డింక ప్రయోజనమేమి?...సరికాని ఆ కుటీరమునకు నీవు పోవ యత్నించితివని వింటిని. ఎంతప్రమాదము. చిక్కినచో మన్నా నిన్ను బ్రతుక నిచ్చునా ?

జీవన్ :— ఆ కుటీరమునందు మన్నా దాగియున్నాడా ?

మొరాకీ :— అసంభవము. అది యింతకుముందే పరిశీలింపబడినది.

జీవన్ :— కాని, ...

మొరాకీ :—ఏమి, సందేహముగా నున్నదా? సరియే రమ్ము. మన మిద్దఱమును పోయి చూచివత్తము.

జీవన్ :— అనవసరము. తాము ధ్రువముగ చెప్పుచుండగా ఇంక నేల ?

మొరాకీ :— అటుకాదు. నీ సందేహ నివృత్తికొఱకు పోయి వత్తము రమ్ము.

అని యాతని దోడ్కొని పెరటి యావరణములోనికి బోయెను. అంత ధైర్యముగ తానాతని తోడ్కొని పోవు చున్నాడనగా, ఆ పక్షి యీసరి కాకుటీరమునుండి యెగిరి పోయియే యుండునని జీవన్‌కు తెలియును. అయినను, సూక్ష్మదృష్టి కచ్చట విశేషము లేమైన గోచరించునేమో యని జీవన్ ఆతనివెంట బోయెను. ఈ విధముగ తన్నా గృహామునుండి దూరస్థునిచేసి రత్నమాల కపాయము కలి గించదలచెనేమో యను సందేహ మాతని కుండెను. కాని, ప్రాకారకుడ్యముపై కెక్కి యొక్కసారి వెనుతిరిగి చూడగా ఒక పొదచాటునుండి హన్నూ, "నేనున్నాను. భయము లేదు. పోయిరమ్ము." అనునట్లుగా సైగచేసెను. దానిని గ్రహించి జీవన్ నిశ్చింతగా మొరాకీవెంట నడువసాగెను.

రక్షకభటులను గడచి యిరువురును కుటీరమును సమీపించిరి. తలుపులు మూయబడి యుండెను. మొరాకీ మెల్లగా తలుపు తట్టెను. ఎవ్వరును పలుకలేదు. తలుపు త్రోసుకొని యిరువురును లోన ప్రవేశించిరి. కుడివైపున నున్న గదితలుపు తెఱువబడి యుండెను. అం దెవ్వరును లేరు. రెండవగది తలుపు మూయబడి యుండెను. ఆ గదియొద్దకు బోయి మొరాకీ తలుపు త్రోసి జీవన్‌తో లోన ప్రవేశిం చెను. గవాక్షము మూయబడి యుండుటచే గది యంతయు చీకటిగా నుండెను.

"ఇం దెవ్వరును ఉన్నట్లు లేదు. ఈ చీకటిలో నేమియు తెలియుటలేదు. ఆగుము." అని మొరాకీ కిటికీ

తలుపు తెఱచి, "ఇప్పుడు చూడుము. గదియం దెవ్వరైన కలరా ?" అని ప్రశ్నించెను. జీవన్ నలువైపులను దృష్టి ప్రసరించుచు ఒకమూల కేంద్రీకరించి భూతగ్రస్తునివలె మిడిగ్రుడ్లతో చూడజొచ్చెను. అచ్చట నొక మేజా ప్రక్క నొకవ్యక్తి మేజాపై తలవాల్చి నిద్రించుచున్నట్లు గోచరించెను. నిస్సందేహముగ నా వ్యక్తి మన్నా భార్య పద్మలతాదేవి! మేజాపై చేతులు జాచి యుండెను. ఆ చేతుల నడుమ తల యిమిడి యుండెను. ఏమియు చైతన్యము లేదు. నిశ్శబ్దముగ సౌంజ్ఞ చేసి జీవన్ ఆ దృశ్యమును రాజప్రతినిధికి జూపెను. చూచుచుండగనే ఆమె వెన్ను భాగమున గాఢముగ నాటబడి యున్న యొక బాకు గోచరించెను. అది చూచి జీవన్, "అయ్యో! హత్య! హత్యగావింపబడినది!" అని రివ్వున ఆమె చెంతకు బోయి, "అయ్యో! పాప మీ యువతి అతి దారుణముగ హత్య చేయబడినది! దుర్మార్గుడు, తనకు లభించిన స్వేచ్ఛను వినియోగ మొనర్చినాడు!" అని, ఆ స్వేచ్ఛకు కారణభూతుడవు నీవు సుమా యనునట్లు ఒకానొక యుద్రేక భీషణమైన తీవ్రదృష్టితో మొరాకీ వైపు జూచెను. ఆ దృష్టియందలి యంతరార్థమును మొరాకీ గ్రహించెను. కాని, ఆ హత్యావిషయము మాత్రము ఆతని కేమియు తెలియదనుటకు ఆతని ముఖమున విస్పష్టముగ గోచరించుచున్న విస్మయభావమే సాక్షి.

"మన్నా యీమెను హత్యచేసె ననుటకు నిదర్శన మేమి ?" అని శాంతముగ నాతడు ప్రశ్నించెను.

"ఇంక నెవరు? ఆ విషయము నేను రూఢిగ చెప్ప గలను. ద్వీపమునందలి ప్రతి వ్యక్తియు చెప్పగల్గును. మొన్న ఈ హత్య చేయింప యత్నించెను. నేడు స్వయముగ తానే చేసెను."

"కావచ్చును, కాకపోవచ్చును. మనము చూడ లేదు. ఆ విషయము పరిశీలింతము. ప్రస్తుతము ఈమె నీ మంచముపై పరుండబెట్టుదము రమ్ము."

ఇరువురును పట్టి రక్తసిక్తమై యున్న యా నిష్ప్రాణ కళేబరమును మంచముపై పరుండబెట్టిరి.

"తక్షణమే యిద్దరు పరిచారికల నిచ్చటకు పంపెదను. అంతవఱకును సురక్షితమైన యీ స్థలమున కెవ్వరును రాలేరు. రమ్ము పోవుదము." అని మొరాకీ ద్వారము దాటి యావలకు బోయెను. సూక్ష్మదృష్టితో అచ్చటి విశేషములను పరిశీలింపదలచి, జీవన్ ఒక్కసారి యా మేజాకడకు పోయెను. మేజాపై, ఆ నెత్తురుజాడల నడుమ నొక సిరాపాత్ర పడియుండెను. చెంతనే యొక లేఖిని మొనవిరిగి పడియుండెను. నేలపై నొక చిన్న పత్రము రక్తరంజితమై నెత్తురుమడుగున పడియుండెను. అత్యాతురమున ఆ పత్రము నాతడు తీసి చూచి, "అయ్యా!" అని బిగ్గఱగా రాజప్రతినిధిని పిలచెను. మొరాకీ తిరిగి లోన ప్రవేశించెను. "అయ్యా! ఈ పత్రమును చూడుడు. ఇది ఈ యభాగిని వ్రాయుచుండిన యొక యసంపూర్ణలేఖ! నాపేర వ్రాయబడుచుండెను. ఈ లేఖ పూర్తియగులోపుననే ఈమె హత్యగావింపబడినది!"

మొరాకీ :— ఏదీ, చూడనిమ్ము.

జీవన్ :— చదివెదను. వినుడు. — అతిస్వల్పము.

"జీవన్,

మొరాకీచే ఆతడు విడుదలచేయబడెను. ప్రమాదము. జాగ్రత్త. ఇంక ... .... —"

అంతే. — వింటిరా ?

అని యొక యలోకసాధారణమైన నిశాతదృష్టి నాతని ముఖముపై కేంద్రీకరించెను. మొరాకీ నోట మాట రాలేదు. ఆతని ముఖమండలము ఛాయాగ్రస్తమై కాంతిహీన మయ్యెను. పెదవులు అప్రయత్నముగ వణకజొచ్చెను. జీవన్ కరాళదృగ్జాలములందు ఆతని సర్వాంగములును మలమల మాడిపోవుచున్నట్లుండెను. సుమారొక నిముషము పాటు ఇరువురును ఒకరి మొగ మొకరు చూచుకొనుచు శిలావిగ్రహములవలె నిలచి యుండిరి. పిమ్మట మొరాకీ యొక పెద్ద నిట్టూర్పు విడచి, "పాపము! ఎట్టి దురభిప్రాయ ముతో నీమె మరణించినది! రమ్ము." అని గదిలోనుండి బయటకు వచ్చెను.

"సత్యాసత్యములను కాలమే విశదీకరింపగలదు." అని జీవన్ ఆ లేఖను మడచి తన జేబునం దుంచుకొని, మొరాకీ వెంట నడచెను. ఇరువురును గృహావరణమును దాటి యీవలకు వచ్చి, సంపూర్ణమౌనముతో సరాసరి రాజ గృహమును ప్రవేశించిరి. అంతకాలమును ఆ మానవవ్యక్తుల మానసికాంతరాళములందు ఏయే భావము లుప్పతిల్లు చుండెనో వారికే తెలియును.

ఇరువురును చావడిలో ముఖాముఖి గూర్చుండిరి. ఇంచుక సేపు జీవన్ వైపు నిదానించి మొరాకీ, "ఓయీ! ఆ స్త్రీకి కల్గిన దురభిప్రాయమే నీకుకూడ కలదా?" అని ప్రశ్నించెను.

జీవన్ :— అయ్యా! ఈ ద్వీపమునందు ప్రస్తుత వాతావరణముచే నాకు క్షణక్షణమును మతిభ్రమణము అధికమగుచున్నది. ఏది సత్యమో, ఏది యసత్యమో, ఏది నలుపో, ఏది తెలుపోకూడ నేను గుర్తింపజాలకున్నాను. ఆ యువతి వ్రాసినట్లు తామే మన్నాస్వేచ్ఛకు కారణభూతులై యుండినచో, ఈ స్త్రీ హత్యాపాతకము మన్నాదికాదు, మీది యని గ్రహింపుడు. ఏ క్షణముననైన ఆ విషసర్పము నన్ను సహితము హత్యచేయవచ్చును. అందుకు నేను భీతిల్లుటలేదు. సిద్ధముగనే యున్నాను. కాని, అప్పుడు ఆ హత్యాదోషముకూడ మీతలమీదనే యుండును అని మాత్రము గ్రహింపుడు.

మొరాకీ :— (చిరునవ్వుతో) జీవన్! నీకు నిశ్చయముగనే మతిభ్రమణము కలుగుచున్నట్లున్నది! నిర్హేతుకముగ కలవరపడకుము. త్వరలోనే నీవు సత్యము గ్రహింపగలవు. భూగర్భమును ఛేదించియైన ఆ ద్రోహిని నేను పట్టితెచ్చినపిదప అంతయు నీకే తెలియును. నిశ్చింతగ నుండుము. నీ ప్రయాణమునకు రేపొక్కదినమేకదా యింకను మిగిలియున్నది! రేపు దినమంతయు స్వేచ్ఛగ నీవు ప్రయాణసన్నాహము

గావించుకొనుము. రాణీసహితము నీతో పూర్తిగ సహకరించుటకు నాకెట్టి యభ్యంతరమును లేదు. ఎవ్వరును లోనికి రాకుండ నా పరిజనము కావలి యుండునట్లాజ్ఞాపించెదను. వేకువనే లేచి నేనా ద్రోహిని పట్టుటకు తగిన సన్నాహములు చేయబోయెదను. దినమంతయు మీ యేకాంతమునకు నేను సహితము భంగము కలిగింపను. తిరిగి ఎల్లుండి యుదయమున కలుసుకొందము.

అని చెప్పి, లేచి తనగదిలోనికి బోయెను.

# అ ధ్యా య ము 16

ఆ రాత్రి చాలసేపటివఱకు జీవన్ కన్ను మూతబడ లేదు. "రేపు దినమంతయు స్వేచ్ఛగ నీవు ప్రయాణ సన్నాహ మొనర్చుకొనవచ్చును. రాణీసహితము నీతో పూర్తిగ సహకరింపవచ్చును. దినమంతయు నేనుసహితము మీ యేకాంతమునకు భంగము కలిగింపను" మొరాకీ పల్కిన యీ పలుకులు ఆతని కర్ణముల మారుమ్రోగు చుండెను. "ఆ గృహమందలి రహస్యమార్గమును గూర్చి మొరాకీ యెఱుగడా? ఎఱిగియు పూర్తిగ నొక దినమును ఒక రాత్రియు ఆ గృహమును మా స్వేచ్ఛకు విడచు చున్నాడు. ఈ బిలద్వారమున మేము పలాయనము కాగల మని ఆత డూహించుకొనజాలడా? తప్పక ఇందేదో విశేష ముండును." అని యోచించి, జీవన్ మెల్లగ లేచి, పెరటి యావరణములోనికి బోయి, అచ్చట వేచుకొనియున్న హసన్ను కలుసుకొని, పర్వత కుటీరమునందు జరిగిన హత్యా విశేషమును, అనంతరము తనకును మొరాకీకిని జరిగిన సంభాషణమును సమగ్రముగ నాతనితో జెప్పెను.

"కానిమ్ము, జీవన్! వానికిని నీకును మధ్య ఇంతవఱ కును అన్యోన్య హృదయాచ్ఛాదన మొనర్చుచు ఒకానొక కృత్రిమ ఫలకము నిలచి యుండెను. ఇప్పు డది పోయినది. మీ యిరువురకును మధ్య నిప్పుడు ఖచ్చితమైన పల్లీ గీయబడినది. ఇంక బలాబల ప్రదర్శనము మాత్రమే మిగిలి యున్నది. అది రేపే జరుగగలదు. చూచుటకు నేను

నీ చెంతనే యుండెదను కదా!'' అని హన్నా పకపక నవ్వెను.

"వేకువనే నీవు నాకడకు రమ్ము. అనేక విషయములు మనము మాటలాడుకొనవలసి యున్నది. రాణిసహితము వచ్చును. మాకు తే పాతడు స్వేచ్ఛ ప్రసాదించెనుకదా! తప్పక రమ్ము.'' అని జీవన్ తిరిగి లోనికి బోయి విశ్రమించెను.

వేకువనే చెప్పిన ప్రకారము రాజప్రతినిధి యా గృహమును విడచి సపరివారముగ నెచ్చటికో పోయెను. ఆయుధ హస్తులగు కొందఱు భటులు మాత్రము రాజగృహము నలువైపుల కావలి యుండిరి. ఈ కాపుదల ఇతరులను లోనికి రానీయకుండ చూచుటకన్న లోనున్నవారిని బయటకు పోనీయకుండుటకే యుద్దేశింపబడి యుండునని జీవన్ భావించుచుండెను. మూడు దినములై కలకలలాడుచుండిన యా భవన ప్రాంగణ మంతయు నిప్పుడు నిశ్శబ్దమై నిర్జీవమై యుండెను. తెల్లవారుసరికి హన్నా జీవన్ యెదుట ప్రత్యక్షమయ్యెను.

జీవన్:— చూచితివా, గృహమంతయు దిగ్బంధనము చేయబడి యున్నది! నలువైపులను మొరాకీ భటులు కావలి కాయుచున్నారు. ఎందునిమిత్తమో తెలియునా? ప్రయాణసన్నాహమునందు నాకును రాణికిని స్వేచ్ఛ నిచ్చుటకు! మా యేకాంతమున పరులెవ్వరును వచ్చి భంగము కలిగింపకుండుటకు! దిగ్బంధనము నడుమ స్వేచ్ఛ! దీని కేమందురు హన్నా?

హాన్నా:— కారాగృహమందు మాత్రము ఏకాంతము, స్వేచ్ఛ లేదా?

జీవన్:— మొరాకీ నిశ్చయముగ ప్రశంసాపాత్రుడు! కాని యిందలి రహస్యమార్గము వానికి తెలియనిదా? ఈ రహస్యమార్గమును స్వేచ్ఛగ మనకు విడిచిపెట్టినా డన్న, ఇం దేదియో విశేష ముండక తీఱునా?

హాన్నా:— తప్పక మోసముండును. ఈ మార్గము మన కెంతమాత్రమును గమనయోగ్యము కాదు. కాని. ఈ కారాగృహవాసము మన కంతకంటె ప్రమాద హేతువు. మొరాకీ యేమిచేయ సంకల్పించెనో యది నేడే జరుగును. సాధ్యమైనంత శీఘ్రముగ ఈ గృహ మునుండి రాణీసమేతముగ మనము బహిర్గతము కావలెను. ఈ బిలమార్గముతప్ప మనకు గత్యంత రము లేదు. ఎట్టి ప్రమాదమునకైనను సిద్ధపడి మనము రాణిని తప్పించవలెను.

జీవన్:— ఆమె సిద్ధముగ నున్నదా?

హాన్నా:— సర్వసిద్ధముగ నున్నది.

జీవన్:— ఈ భూగర్భ మార్గమునకు ఆవలిచివర నేమున్నది?

హాన్నా:— సముద్రము. తక్షణ సముద్ర యానమునకు ఏదైన నౌక యచ్చటనే లభింపవచ్చును. లేనిచో కొంతకాలము రహస్యముగ నిరీక్షించవలెను.

ఇట్లు వారు సంభాషించుకొనుచుండ, భూగర్భమునం దేదో యస్పష్టశబ్దము జీవన్ కర్ణముల సోకెను. బిలమార్గము

షం దేదో యలికిడి! అడుగుల చప్పుడు! నిశ్శబ్దముగ నుండు మని సౌంజ్ఞ చేసి జీవన్ హన్నా దృష్టిని ఆ బిలద్వారము వైపు మరల్చెను. ఇరువురును నిశ్శబ్దముగ మూయబడి యున్న యా ద్వారముచెంతకు పోయి పొంచియుండిరి. రెండు మూడు నిముషములు మాత్రమే గడచెను. బిలద్వారమును మూసియున్న కవాటము మెల్లగ తెఱువబడెను. ఊపిరి బిగియబట్టి హన్నా యొకప్రక్కను, జీవన్ ఒకప్రక్కను విచ్చుకత్తులవలె కాచుకొని యుండిరి. అంధకారమయ మైన యా భూగర్భమునుండి యొక వ్యక్తి మెల్లగ తలయెత్తి చేతనున్న పిస్తోలు మీది కెత్తుచుండెను. కనుఱెప్పపాటులో హన్నా యినుప పిడికిలియందు ఆ వ్యక్తి పిస్తోలుచేయి పట్టువడెను. కుడ్యద్వారములు కంపించునట్లు పిస్తోలు ప్రేలెను. ఆ భయంకర సంఘర్షణమున పిస్తోలు జారి నేల బడెను. హన్నా పిడికిటనుండి విడిపడి యా వ్యక్తి బిల మార్గమున వెనుతిరిగి పరువిడజొచ్చెను. హన్నా తటాలున లోనికి లంఘించి వానిని వెన్నాడుచు పోయెను. వానివెంట జీవన్ పరుగిడజొచ్చెను. పిస్తోలు శబ్దమును విని రాణి రత్నమాల వడివడిగా మేడ దిగివచ్చి తెఱువబడియున్న బిల మార్గమును జూచి, విషయమును గ్రహించి, ధనుర్ముక్తమైన బాణమువలె ఆ బిలమును జొచ్చి 'జీవన్! జీవన్!' అని యఱచుచు పర్విడసాగెను. దూరమునం దడుగుల చప్పుడు వినబడుచుండెను. ఈమె యఱపు కర్ణముల బడినంతనే జీవన్ మంత్రబద్ధునివలె నిలచి భయాతుర సంచాలితమైన హృదయముతో వెనుతిరిగి ఆ యంధకారములోనికి దృష్టి

సారించెను. రెండు నిముషములలో రాణి వగర్చుచు నాతని యెదుట నిలచి, "జీవన్! ఏమైనది? ఆ తుపాకి ధ్వని యేమి? ఏమైన ప్రమాదము సంభవించినదా?" అని తొట్రుపాటుతో ప్రశ్నించెను.

జీవన్:- దేవీ! ఏమియు ప్రమాదము సంభవించలేదు. అంతయు నేను శంకించినట్లే జరిగినది.

రాణి:- ఏమి జరిగినది?

జీవన్:- సావకాశముగ చెప్పెదను. ఇప్పుడు సమయము లేదు. బిలమార్గమునందు మన్నా పరుగిడుచున్నాడు! హన్నూ వానిని వెంటాడుచున్నాడు! ఇచ్చటనే యుండుము. తిరిగి వచ్చెదను.

అని చెప్పి జీవన్ మరల పరుగిడిపోయెను. వెనుకటి పాతాళప్రవాహమునకు పైనున్న యా వంతెనకడకు వచ్చి యాతడు తటాలున నిలచిపోయెను. దృశ్యాదృశ్యముగ నున్న యా వంతెనపై భయానకమైన యొక దృశ్య మాతని కంటబడెను. మన్నా హన్నూ లిర్వురును ఆ వంతెన నడిమి భాగమున నేలబడి మహానాగములవలె బుసకొట్టుచు పెనగు లాడుచుండిరి. జానెడుమేర కుడి కొఱగినను ఎడమ కొఱగినను ఇరువురును ఆ పాతాళప్రవాహమున కూలిపోవుట రూఢి! ఆ శరీరద్వయము ముడిపడి కుడి యెడమల కూగిస లాడుచుండెను. ఆ భీషణదృశ్యమును జూచుచు జీవన్ మతి భ్రమణము పొందుచుండెను. క్షణమున కెన్ని వేల సారు లాతని హృదయము కొట్టుకొనుచుండెనో చెప్పజాలము. ఆ పట్టున తా నేమాత్రమైన జోక్యము కలిగించుకొనెనా

అందఱకును ప్రమాదము తప్పదు. చేయునది లేక ఊపిరి బంధించి ఱెప్పపాటు లేక ఆత డా భయంకర దృశ్యమును జూచుచు పాషాణప్రతిమవలె నిలచిపోయెను. చూచుచుండ గనే పెనవైచుకొని ముడిపడియున్న యా శరీరద్వయము ఒక్కయూపున వంతెనపైనుండి దొర్లి, ఆ యగాధ పాతాళ మునందు కూలపడెను.

ఒక పెద్ద పాషాణము కూలిపడినట్లు ఆ పాతళ ప్రవాహమునుండి ప్రతిశబ్దము వినవచ్చెను. తదుపరి అంతయు నిశ్శబ్దము. "హన్నా!" అని జీవన్ ఒక పెద్ద కేకవైచెను. ప్రత్యుత్తరము లేదు. మన్నా సహితముగ హన్నా పాతాళ గర్భముపాలై పోయెను. అప్రయత్నముగ జీవన్ నేత్రాం చలములనుండి యశ్రుధారలు వెల్వడెను. ఆ యశ్రుబిందువు లతో నిష్కలుషమైన హన్నా పవిత్రాత్మకు తర్పణ మొనర్చి, జీవన్ ఆ ప్రదేశమును విడచి వెనుకకు మఱలి వేయికండ్లతో తనకై వేచుకొనియున్న రాణికడకు వచ్చి దుఃఖావరుద్ధమైన కంఠముతో, "దేవీ! మన్నాసహిత ముగ మన ప్రాణమిత్రుడు హన్నా పాతాళ ప్రవేశ మొనర్చినాడు!" అని చెప్పెను.

రాణి:— ఎట్లు? ఏమైనది?

జీవన్:— ఆ వంతెనమార్గముపై ఇరువురును పెనగులాడి అన్యోన్య బాహు బంధనములతో దొర్లి యాపాతాళ ప్రవాహమునందు పడిపోయిరి.

రాణి:— (దుఃఖముతో) హన్నా మరణించెనా? నానిమి త్తము ప్రాణత్యాగ మొనర్చెనా?

అని బొటబొట కారుచుండిన కన్నీరు తుడుచుకొనుచు వెక్కి వెక్కి యేడువ జొచ్చెను.

జీవన్ :- దేవీ! విధివిధానమునకు మనమేమి చేయగలము? గతమును గూర్చి చింతించిన ప్రయోజనము లేదు. నిజ ప్రాణములను బలిదాన మొనర్చి ఒకానొక ప్రబల శత్రువునుండి మనలను తప్పించి హనూన్మా కృతకృత్యుడైనాడు. కాని అంతకుమించిన ఘోరశత్రువు మొరాకి ఇంకను మిగిలియున్నాడు. ఈశత్రువునుండి విముక్తులము కాగల యుపాయమును మనము యోచింపవలయును. ఇప్పుడు మనము వెనుకకు మఱలి తిరిగి గృహము జొచ్చుట అపాయకరమని నా యంతరాత్మ చెప్పుచున్నది. ఈ మార్గముననే మనము పురోగమించి సముద్రమును చేరుట యుక్తమని తోచుచున్నది. ఏమందువు?

రాణి :- అట్లనే కానిమ్ము. సముద్రమును చేరినపిదప మన యదృష్ట మెట్లో యట్లే జరుగుగాక!

అని ఆపత్కాల సహజమైన మొండిధైర్యముతో ఇరువురును ముందునకు నడువసాగిరి. మెల్లగ, జాగ్రత్తగ, ప్రమాదకరమైన యా వంతెనను గడచి యావలకు బోయిరి. పర్వతసానువులు తిరిగి మార్గమున కిరుప్రక్కల నమరియుండెను. అంధకార మంతకంత కధికమగుచుండెను. రత్నమాలాదేవి కామార్గము చిరపరిచిత మగుటచే ఆమెయే జీవన్‌కు మార్గదర్శినియై వెనుక నడచుచుండెను. క్రమ క్రమముగ దారి పల్లమునకు దిగుచున్నట్లుండెను. అడుగడు

గునకు మెలికలు తిరిగి యగమ్యాగోచరమైయున్న యీ మార్గమున సుమారొక యరగంటసేపు వారు నడచినపిమ్మట ఎదుట సుమారు నూఱుగజముల దూరమున కొంచెము వెలుగు గోచరించెను.

రాణి :— జీవన్! అదిగో గుహాద్వారమునుండి వెలుగు! చూచితివా? మన మచ్చటకు పోవుసరికి మన పాదములకు సముద్రజలము తగులును.

జీవన్:— సముద్రజల మీ గుహలోనికే చొచ్చియున్నదా?

రాణి:— అగును. సుమారిరువదిగజముల మేర ఆ జలమిందు చొచ్చియుండును.

జీవన్:— అట్లయిన మన మచ్చటనుండి బయటకు పోవుట యెట్లు?

రాణి:— అచ్చట లోతు రెండడుగులకు మించియుండదు. నడచిపోవచ్చును. కాని, పైనుండి వచ్చు జాలరులు తమ నావల నిచ్చటనే యుంచి పోవుచుందురు. నూటికి తొంబదిపాళ్ళు మనకు తప్పక అచ్చట నొక నావ లభించగలదు. దానిపై మనము సరాసరి సముద్రముమీదికి పోగలము.

ఇట్లు సంభాషించుచు వారు నడచుచుండగనే వారి పాదములకు సముద్రజలము తగిలెను. మిలమిలలాడుచు పురోభాగమున సన్నని జలమార్గము గోచరించెను. చూచుచుండగనే పర్వతసానువు నానుకొని నీటిపై తేలియాడుచు నొక చిన్న నావ కన్పట్టెను. ఇరువురును ఆ నావను

సమీపించిరి. దానిని నడపుటకు వలయు తెడ్లుకూడ అందే యుండెను. మహోత్సాహముతో జీవన్ దాని నీవలకీడ్చి రాణీసహితముగ నందాసీనుడై ముందునకు నడుపసాగెను. మూడు నాలుగు నిముషములలో నావ గుహాముఖమును చేరెను. జ్యోతిర్మయమైన బహిఃప్రపంచము ప్రత్యక్షమయ్యెను. అనంతమైన మహాసముద్రము కన్నులపండువు చేయుచుండెను.

మహోత్సాహముతో జీవన్, "దేవీ! ఇంక మన యాపదలన్నియు గడచినట్లే!" అని మందహాసముచేసెను.

ఈ మాటలు జీవన్ పెదవులను దాటినవో, లేదో, గుహాద్వారము పైనుండి యొక పెద్ద వికటహాసము వినవచ్చెను. వారు మొగమెత్తి చూచుసరికి పర్వతకుడ్యముపై రాజప్రతినిధి మొరాకీ వికటహాసము చేయుచు ప్రత్యక్షమయ్యెను.

# అ ధ్యా య ము 17

ఆతని జూచినంత నే వారికి నిర్మేఘమైన యాకసము నుండి పిడుగుపడిన ట్లయ్యెను. ధైర్యరాశియైన జీవన్ సహితము స్తంభించిపోయెను. రాణి సర్వాంగములును కంపింపజొచ్చెను. క్షణమాత్రమున జీవన్ తెప్పరిల్లి, యాత నితో, "ఓహో! ప్రభువువారా? తామిచ్చట వేచుకొని యుందురని నేను ముందే యూహింపవలసియుండెను." అని మందహాసము జేసెను.

మొరాకీ:- జీవన్! బుద్ధిశాలివి! ఆ మాత్ర మూహించు కొనజాలక పోయితివా? పోనిమ్ము. నావ నిటు త్రిప్పుము.

అని పర్వతకుడ్యమునుండి క్రిందికి దిగెను. ఇంతలో ఆయుధహస్తులగు అయిదుగురు సైనికులు నీటజొచ్చి నావ నొడ్డున కీడ్చిరి. ఆ సైనికులలో మనకు పూర్వపరిచితుడైన కాశీ యొకడు. వానినిజూచి జీవన్ ఏమాలోచించెనో యించుక ముఖము చిట్లించెను. రాణీసహితముగ నాతడు నావ దిగి మొరాకీ యెదుట నిలచెను.

మొరాకీ :- మీకు మార్గముచూపుటకు మన్నాను పంపితిని. ఏడీ ఆత డెచ్చట?

జీవన్:- మన్నా? — మాకు మార్గము చూపుటకు వచ్చి యుండెనేమో కాని, అట్లుచేయక తానే మార్గము చూచుకొనెను.

మొరాకీ:- ఏ మార్గము?

జీవన్:- పాతాళ ప్రవాహ మార్గము! వానికొఱకు రెండు మూడు దినములు తాము వేచుకొని యుండవలె నేమో! సజీవ వ్యక్తులకన్న నిర్జీవ కళేబరములు బయటకు వచ్చుటకు కొంత యాలస్య మగునని వింటిని.

మొరాకీ:- (చకితుడై) ఆ పాతాళ ప్రవాహమున నీ వాతని త్రోసివైచితివా?

జీవన్:- ఆ పని నేను చేయలేదు. నా మిత్రుడు హన్నా!

మొరాకీ:- ఆతడేడీ?

జీవన్:- ఆతడు మన్నాకు తోడైపోయెను. ఆ రెండు కళేబరములను జేపో మాపో సముద్రముపై మనకు లభించగలవు. —ఇంతకును, అయ్యా! మీ యభిప్రాయము నాకు తెలియుటలేదు. ఒక్క ప్రశ్నకు సమాధానమిండు. మేము కేవలము మీ యధీనమునందే యుంటిమికదా? ఇప్పుడు మమ్ము మీరేమి చేయదలచితిరో, ఆ పని ముందే చేయకపోతిరేల?

మొరాకీ:- మంచి ప్రశ్న యడిగితివి. ఏపని చేయుటకును తగినంత కారణ ముండవలదా? లేకున్న లోకము సహించునా? ఇప్పుడు నీవు చేసిన నేరము నిన్న చేసి యుండలేదు.

జీవన్:- ఏమి నేరము?

మొరాకీ:- ఈ రాణిని తోడ్కొని నీవు రహస్యముగ పలాయనము చేయుచుంటివికదా! మన్నా హత్య

సంభవించినది కదా? కావలసినన్ని కారణము లిప్పుడు కల్గినవి. — జీవన్! ఇప్పు డంతయు నేను నీతో చెప్పుచున్నాను వినుము. నిన్ను హత్య గావించుటకు నేనే మన్నాను విడుదలచేసి ఈరహస్య బిలమార్గమున పంపితిని. నిన్ను వాడు చంపెనా, మంచిది. లేక నీచే వాడు చచ్చెనా, ఈ రాణీసమేత ముగ నీవు తప్పక ఈబిలమార్గమున తప్పించుకొన యత్నించెదవని నాకు తెలియును. కావుననే నీ కొఱ కిచ్చట వేచుకొని యుంటిని. హాహ్హాహ్హా!!

ఇంత బాహాటముగా మొరాకీ తన హృదయమును బహిర్గత మొనర్చుటకు కారణము జీవన్ ఊహింపకలైను. చంపబడనున్న వానికి ఏరహస్యము చెప్పినను ప్రమాదము లేదుకదా! మొరాకీచేతలయందు తన మరణమున కిది సూచీప్రకరణ మని యాతడు గ్రహించెను. అయినను ధైర్య మునుమాత్రము విడువలేదు.

మొరాకీ:— జీవన్! నేను దాపరికములేక ఉన్న రహస్య మును నీకు చెప్పివైచితిని. ఈ రహస్యము నీ వెఱిగి నను ప్రమాదములేదు.

జీవన్:— అగును. మీ యభిప్రాయము నేను గ్రహించితిని. నే నందుకు సిద్ధముగనే యున్నాను.

మొరాకీ:— మంచిది. అంతవఱకును నీవీ సైనికుల రక్షణము నం దుండుము.

అని, ఆతని నా స్థలమునుండి కదలకుండ కాచియుండు డని నలుగురు సైనికుల కాజ్ఞాపించి అయిదవ సైనికుని

స్వేచ్ఛగ విడచి, ఇంచుక దూరమున భయవిహ్వాలయై నిలచి యున్న రత్నమాలాదేవికడకు బోయెను. అత డామెతో నేమి సంభాషించెనో జీవన్‌కు వినవచ్చుటలేదు.

ఆ అయిదవ సైనికుడు కాశీ. వాడు ఏదో ఫలసామగ్రితో నిండియున్న యొక సంచితో సుమా రొక నూఱు గజముల దూరముపోయి, అచ్చట నొక రాతిపైగూర్చుండి, మొలనున్న చురకత్తితో ఆ ఫలములను కోసుకొని తినుచుండెను. జీవన్ వానివైపు నిదానించుచుండెను, కాని వాడు మాత్రము జీవన్‌వైపు చూచుటలేదు. తినుట ముగిసిన పిమ్మట కాశీ తన కత్తిని అరచేతిపై అటునిటు జాడించి శుభ్రముచేసి వాడి పరీక్షించుచు తదేక మనస్కుడై యుండెను.

రత్నమాలతో కొంతవఱకు సంభాషించి, మొరాకీ తిరిగి జీవన్‌కడకు వచ్చి, "జీవన్! ఈ రాణి నిన్ను విశేషముగ ప్రేమించియున్నది. నీ జీవన రక్షకై యీామె నన్ను వివాహమాడుటకు సిద్ధము కాగలదు." అని మందహాసము చేసెను.

జీవన్:- అట్టిపని యెన్నడును జరుగదని మాత్రము తెలుసుకొనుడు.

మొరాకీ:- ఆమె యెట్లును నన్ను పరిగ్రహింపక తీరదు. కాని, అందువలన నీవు రక్షింపబడుట ఆమెకు సంతోషహేతువుకదా? చూడు, జీవన్! విదేశీయుడవైన నీవు ఈ ద్వీపమును కొనుటయే తప్పు! ఈ ద్వీపవాసులు పరమ ఘాతకులు!

కత్తి నూర్పు పూర్తి జేసి యప్పుడే కాశీ అప్రయత్న ముగ నొక్క హుంకారమును వాయుతరంగములందు ప్రయోగించెను. ఆ హుంకారము విస్పష్టముగ జీవన్ మొరాకీల కర్ణములందు బడెను.

మొరాకీ:- ఈ కాశీ సోదరుని మూడేండ్ల క్రిందట నేను ఉరితీయించితిని. వీడు సహితము సామాన్యుడుకాడు. వీనినికూడ తన సోదరునికడకు పంపదలచితిని. కాని, నిన్ను పట్టుటయందు వీడు నాకు తోడ్పడి తన ప్రాణములను తాను కాపాడుకొనినాడు. ఇంచుక తాళుము. ఒక్కసారి వానితో మాటాడి వచ్చెదను.

అని సరాసరి కాశీయొద్దకు బోయెను. కాశీ సగౌరవ ముగ నిలచి యభివందన మొనర్చెను. జీవన్ ఱెప్ప వేయక వారివైపు నిదానించుచుండెను. ఆతని కనిపెట్టుకొని యుండిన సిపాయిలు తుపాకుల భుజములపై చేరవైచి, నిశ్చింతగ చుట్టును తలవంచుకొని కూర్చుండి యుండిరి. రాజ ప్రతినిధి రత్నమాలతోడను, జీవన్‌తోడను, ఇప్పుడు కాశీతోడను జరుపుచుండిన సంభాషణములందు వారికేమియు శ్రద్ధలేదు. అధికారియాజ్ఞలకుతప్ప అన్యములకు వారి చెవులుకాని కండ్లుకాని చలింపవు. కాని, దూరమున సాగుచుండిన కాశీ మొరాకీల మంతనములందు జీవన్ బహిరంతర్నేత్రములు ఒకానొక యసామాన్య విశేషమును గమనించుచుండెను. ఆతని దృష్టియంతయు నందే కేంద్రీకరించి యుండెను. వారి ముఖవైఖరులను బట్టి వారి భావముల

నూహించుచుండెనుకాని, వారి సంభాషణమునం దొక్క-శబ్దమైనను ఆతనికి వినవచ్చుటలేదు.

మొరాకీ మందహాసము జేయుచు జీవన్‌వైపు చూపి యేదో యనుచుండెను. కాశీ దృష్టి జీవన్‌వై పొక్క-సారి మరలెను. పిమ్మట మొరాకీ యేదో చెప్పెను. కాశీ అనిచ్ఛాసూచకముగ తల యూపెను. మొరాకీ యేదో వానిని నిర్బంధించు చున్నట్లుండెను. వాడు కనుబొమలు ముడివైచుచు అసమ్మతి రూపించుచుండెను. రాజప్రతినిధి ముఖము ముడుతలు పడుచుండెను. తీక్ష్ణదృష్టి సారించుచు వానితో నేదో బింకముగ చెప్పుచున్నట్లు గోచరించెను. కాశీ ముఖమునం దశాంతి ప్రస్ఫుటమగుచుండెను. వాని నేత్రములనుండి యొక యుజ్జ్వలకిరణము వెల్వడి జీవన్ దృష్టి నెదుర్కొ-నెను. అందేదో యొక యపూర్వ సందేశము జీవన్‌కు స్ఫురించెను. ఊపిరి బిగియబట్టి యాతడు కాశీ ముఖమువైపే చూచుచుండెను. కాశీ ముఖమునం దొక యాకస్మిక పరివర్తనము గోచరించెను. ముడిపడియున్న ముఖము ప్రశాంతమయ్యెను. మొరాకీ మందహాసముచేయుచు నేమో యనుచుండెను. కాశీ మరియొకసారి జీవన్‌వైపు చూచెను. మొరాకీ యాతని భుజముతట్టి కిలకిల నవ్వెను. కాశీ తల వంచుకొని తన కుడిచేతనున్న చురకత్తిపై దృష్టి నిలిపెను. మెల్లమెల్లగ, క్రమక్రమముగ, ఆ దక్షిణహస్తము మీది కెత్తబడుచుండుట జీవన్ కనిపెట్టుచుండెను. ఆతని యూపిరి స్తంభించిపోయెను. నిలువుగ్రుడ్లతో, ఏమిజరుగునో యని యెదురుచూచుచుండెను. తత్క్షణమున కాశీచేతనున్న చుర

కత్తి సూర్యకిరణములందు తళుక్కున మెఱసి ఒక్క యూపున మొరాకీ వక్షస్థలమున నాటుకొనెను. ఒక భయంకర హాహాకార మొనర్చి, ఆ క్షతకళేబరము నేలఁ్రవాలి నెత్తురు మడుగునందు గిజగిజ గింజుకొని శాంతించిపోయెను. పాపా ణములను ప్రతిధ్వనింపజేయుచు కాశీ యానెత్తుటికత్తి నెత్తి యొక పెద్ద వికటహాస మొనర్చుచు, "ఇప్పటికి నా హృదయ దాహము శాంతించినది! మొరాకీ! నా సోదరుని నిష్కా రణముగ నఁజితీయించిన ఫల మనుభవించితివా?" అని ఆ నిర్ప్రాణ కళేబరముపై పదాఘాత మొనర్చి ఉగ్రాకారుడై నిలచెను.

ఆ హాహాకారమును వినినంతనే యా సైనికులు నలు గురును ఉలికిపడి వెనుజూచి, లేచి కాశీవైపు పరువిడజొచ్చిరి. వారు సమీపించగనే కాశీ, "సైనికులారా! ఇదే మీ ప్రభువు! తోడ్కొనిపొండు. మీరు నన్ను చంపుటకు వచ్చుచున్నారా? మీరు నన్నేమి చేయగలరు?" అని యానెత్తుటికత్తిని వారు చూచుచుండగనే తన వక్షస్థలమున పొడుచుకొని నేలఁ్రవాలెను. సైనికులు వానిని సమీపించు సరికి ఆ కళేబరమున మరి జీవము లేదు. ద్విగుణీకృతమైన యా రక్తపు మడుగునందు ఆరెండు కళేబరములును తేలియుండెను. సైనికులు దిగ్భ్రాంతులై దిక్కులు చూచుచు నిలువబడిరి. దూర మున నిలచియుండిన రాణి రత్నమాల భయోత్పాతమున పరుగిడిపోయి జీవన్ చెంత నిలచెను. ఆమెనోట మాట వచ్చు టలేదు. ధైర్యరాశియైన జీవన్ ముఖమునందు సహితము చాంచల్యము తోచుచుండెను. అప్రయత్నముగ నాతఁడు

రాణి చేయిబట్టుకొని వడివడిగా ఒడ్డున తేలియాడుచున్న నావయొద్దకు తోడ్కొనిపోయెను. అదిచూచి యా సైనికులు నలుగురును ఆ కళేబరములను విడచి, తుపాకులెత్తి వారి వైపు పరువిడ జొచ్చిరి. నావయందు రాణి నెక్కించి, వచ్చుచున్న సైనికులవైపు చూచుచు జీవన్ నిలచియుండెను. సైనికులు సమీపించి, "ఆగుడు. ఎచ్చటకు పోయెదరు?" అని ప్రశ్నించిరి.

"ఎచ్చటకును మేము పోవుటలేదు. మీ ప్రభువు మృతకళేబరమును విడచివచ్చుట మీకు సవ్యముగ నున్నదా?" అని జీవన్ పలికెను.

"ఆ కళేబరముతో కూడ మీరు సహితము మా వెంట రావలయును" అని యా సైనికుల నాయకుడు గర్జించెను.

"ఎచ్చటకు?"

"మా పతాక నౌకయందున్న నౌకాధిపతియొద్దకు."

"మంచిది నడువుడు."

అని యా కళేబరములవైపు దారితీసెను. నలుగురు సైనికులును మొరాకీ కళేబరము నెత్తిపట్టిరి. తిరిగి యందఱును నౌకకడకు వచ్చిరి. కాళీ మృతశరీర మచ్చటనే విడువబడెను. నౌకపై మొరాకీ కళేబర మెక్కించబడెను. ఆసమయమున మొరాకీ ధరించిన దుస్తులనుండి యొక చిన్న పుస్తకము నేల పడుచుండగా, ఇతరుల దృష్టిని పడకుండ జీవన్ దానిని సంగ్రహించెను. అందఱును ఆసీనులైన పిదప

ఆ నావ పతాకనౌక యున్న నౌకాశ్రయమువైపు నడుప బడెను.

మార్గమునందు జీవన్ తాను సంగ్రహించిన మొరాకీ చిరుపొత్తమును మెల్లగ విప్పి పరిశీలింపజొచ్చెను. అందు తన పేరు స్ఫుటముగ ముద్రింపబడియున్న మూడు చిన్న పత్రికాఖండములు గోచరించెను. ఆ మూడింటిని జాగ్రత్తగ నాతడు చదువుకొనెను. నాల్గవపత్ర మొకటి మొరాకీ చేతి వ్రాత యుండెను. దానిని చదివినపిమ్మట ఇంకొక పత్రము దానిక్రింద గోచరించెను. అందేమియు వ్రాసియుండలేదు. కేవలము శూన్యము. ఈ పత్రములన్నియు నొకదానివెనుక నొకటి చూచి, ఆతడొక పెద్ద నిట్టూర్పు విడచి, ఆ పొత్తమును తిరిగి తన దుస్తులయందు భద్రపఱచుకొనెను. ఒక మహావ్యూహము ఆ చిరుపొత్తమునం దిమిడి యుండెను. ఆతని ముఖము వికసించెను. ఇంతలో ఆ నౌక నౌకాశ్రయమును చేరుకొనెను. ప్రభుత్వ పతాకనౌక పొగలుగ్రక్కుచు నెదుట నిలచి యుండెను.

# అధ్యాయము 18

సైనికనాయకుడు నావ దిగి సరాసరి పతాకనౌకపై కెక్కెను. సుమా రొక గంట గడచిపోయెను. అనంతరము పైనుండి జీవన్‌కు పిలుపు వచ్చెను. జీవన్ నౌకాధిపతియొద్దకు గొనిపోబడెను. ఆత డొక తురుష్కుడు. మధ్యవయస్కుడు. ఔదార్యము, సహిష్ణుత, గౌరవ ప్రపత్తి, ఆతని విశాల ఫాలఫలకముపై తాండవించుచుండెను. కలకలలాడుచున్న నవ్వు మొగముతో నాతడు జీవన్ వైపు జూచి, "అయ్యా! చాల ఘోరము జరిగినది!" అని పల్కెను.

జీవన్:— అగును. ఒక ప్రసిద్ధవ్యక్తి అస్తమించిపోయెను.

నౌకాధిపతి:— చాల ఘోరమగు మరణము. ఈ హత్యవలన మీరు చాల క్లిష్ట పరిస్థితియందు జిక్కుకొంటిరి.

ఆతని ముఖలక్షణములను బట్టి, మొరాకీ హత్య కాత డంతగా ఖేదపడుటలేదని జీవన్ గ్రహించెను. మొరాకీ మరణానంతరము అచ్చట సర్వాధికారము నింక నాతనిదే యని కూడ జీవన్ గుర్తించెను. ప్రసన్నవదనుడై యున్న యాతని సమక్షమున అణుమాత్రమును సంకోచమున కావశ్యకత లేదని యాతడు భావించి, "ఆర్యా! రాజప్రతినిధికిని నాకును ఈ ద్వీపమునందు కలిగిన సంబంధ మెట్టిదో మీకు తెలిసియుండదు." అని చిరునవ్వుతో పల్కెను.

నౌకాధిపతి:— తెలియదు.

జీవన్:— అగును. తెలియవలసిన యవసరము లేదు. ఇంత వఱకును మీరు కేవలము నౌకాధిపతులే. కాని,

ఇంకపై, గతించిన రాజప్రతినిధి స్థానమున వ్యవహరింపవలసిన యధికారులు. కావున, ఆ విషయము మీరు సమగ్రముగ తెలుసుకొనవలసి యున్నది. ఆజ్ఞాపించితిరేని, ఆత్మసాక్షిగ అంతయును మీకు వివరించెదను.

నౌకాధిపతి:— చెప్పుము.

అంత జీవన్ ఆ ద్వీపమునందు మొరాకీ అడుగు పెట్టినది మొదలు, ఆ క్షణమువఱకు జరిగిన యుదంత మంతయు నిశ్శేషముగ వివరించెను. అంతయును సావధానముగ విని నౌకాధిపతి "అగును. మొరాకీ హృదయప్రవృత్తి నాకు బాగుగ తెలియును. ఆతని కెప్పుడో యిట్టి మరణమే కలుగునని నేనీవఱకే యూహించి యుంటిని. జీవన్ ! మొసలినోట చిక్కువడి నీవు నిరపాయముగ వెల్వడగలిగినందుకు నేను నిన్ను హృదయపూర్వకముగ నభినందించుచున్నాను" అని యాతని భుజము తట్టెను. ఈ పలుకులకు ఇతోధికమైన ధైర్యము వహించి జీవన్ ఆతనితో, "అయ్యా! రాజప్రతినిధిచే భద్రముగ దాచి యుంచబడి, నాచే సంగ్రహించబడిన ఈ పత్రముల నించుక చదివి చూడుడు." అని తాను సంగ్రహించిన యా చిరు పొత్తమును జేబునుండి తీసి, దానియందున్న మూడు ముద్రిత పత్రికా ఖండములను ఆతని చేత బెట్టెను. అందు, మొదటి దానియం దిట్లుండెను.

"హంసద్వీపము :— కొద్దికాలముక్రిందటనే ఈ ద్వీపమును కొని యిచ్చట నివాసమేర్పఱచుకొనిన జీవన్

లాల్ అను భద్రవ్యక్తి భయంకర రోగగ్రస్తుడై మంచము పట్టి యున్నాడని తెలుపుటకు విచారించుచున్నాము."

రెండవ పత్రికాఖండమునం దిట్లుండెను.

"హంసద్వీపము:— ఈ ద్వీపాధిపతియైన జీవన్‌లాల్ స్థితి చాల ప్రమాదకరముగా నున్నది. ఇచ్చటకు వచ్చియున్న రాజప్రతినిధి ఆతని చికిత్సావిషయమునందు మిక్కిలి శ్రద్ధ తీసికొనుచున్నారు."

మూడవ పత్రికాఖండమునం దిట్లుండెను.

"హంసద్వీపము:— ద్వీపాధిపతి జీవన్‌లాల్ నిన్న రాత్రి యేడుగంటల పదినిముషములకు మరణించెనని తెల్పుటకు విచారించుచున్నాము."

ఈ మూడు పత్రికా ఖండములను చదివి నౌకాధిపతి విస్మితుడై చూచుచుండెను. అంత జీవన్, "అయ్యా! విస్మితులగుచుంటిరా? దీనిని చిత్తగింపుడు" అని మరియొక పత్రమును దీసి యాతనిచేత బెట్టెను. ఇది ముద్రితము కాదు. మొరాకీ స్వహస్త లిఖితము. అందు ఈ విధముగ వ్రాయబడి యుండెను.

"హంసద్వీపము:—జీవన్ లాల్ మరణించెనని ప్రకటింపబడిన వార్త అసత్యము. జీవన్‌లాల్ విరుద్ధముగ ఈ ద్వీపవాసులయందు ఏదో విప్లవోద్యమము నడచుచున్నట్లు తోచుచున్నది. రాజప్రతినిధి ఆ విషయమును పరిశీలించుచున్నారు. జీవన్‌లాల్‌కు ప్రాణోపద్రవము కలుగకుండ తగిన చర్యలు తీసుకొనుచున్నారు. ఆతనిపట్ల నౌక విద్వేషభావము ప్రజలలో చెలరేగుచున్నది."

ఈ పత్రమును చదివిన పిమ్మట నౌకాధిపతి విస్మయము ద్విగుణీకృత మయ్యెను. అప్పవాల్చక ఆతడు చూచుచుండెను. ఇంతలో జీవన్ ఆ పాత్రమునుండి మరియొక పత్రమును దీసి యాతనిచేత బెట్టెను. అందేమియును వ్రాయబడి యుండలేదు.

"ఏమిది?" అని నౌకాధిపతి ప్రశ్నించెను.

జీవన్:- ఆర్యా! ఇది శూన్యపత్రము. వ్రాతకు సిద్ధముగ నున్న పత్రము. మొరాకీ జీవించి యున్నచో ఇందేమి వ్రాయబడి యుండెడిదో నేను వ్రాసి చూపెదను కెండు.

అని యా పత్రము నందుకొని దానిపై నీవిధముగ వ్రాసెను.

"హంస ద్వీపము:- జీవన్‌లాల్ నేటి యుదయమున 'కాశీ' యను నొక ద్వీపవాసిచే హత్య గావింపబడెను. హంతకుడు చంపివేయబడినాడు. రాజప్రతినిధి ఈ హత్యా విషయమును పరిశోధించు చున్నారు."

ఇట్లు వ్రాసి నౌకాధిపతికి చూపెను. దానిని చూచి నౌకాధిపతి "జీవన్! నా కేమియు అర్థమగుటలేదు. ఇది యంతయు నొక యింద్రజాలమువలె నున్నది!" అని మందహాసము చేసెను.

జీవన్:- అయ్యా! ఇది యింద్రజాలము కాదు. ఇది యొక పెద్ద పద్మవ్యూహము! ఈ వ్యూహమును నేను భేదించి మీకు చూపెదను, చూడుడు. మొరాకీ

యేకైక లక్ష్యము రాణిని తాను గ్రహించునిమిత్తము అందుకు అవరోధముగ నున్న జీవన్‌లాల్ హత్య గావింపబడుట! ఆ హత్యతో తనకెట్టి సంబంధమును లేనట్లు లోకమునకు రూపింపవలయును. నిశ్చితార్థమైన జీవన్ మరణమునకు ఆ మొదటిపత్రము నాంది ప్రస్తావన! రెండవ పత్రము కొంచెము శ్రుతి హెచ్చింపు! మూడవ పత్రము, పాపము, అతి విశ్వాసముచే కొంచెము తొందరపాటున మొరాకీ పత్రికకు పంపిన ప్రకటన! మన్నాను బంధవిముక్తుని జేసి రహస్యమార్గమున నన్ను హత్య గావింప బంపెను. అట్లు తప్పక జరిగితీరునను దృఢవిశ్వాసముతో, ముందుగనే జీవన్ మరణించెనని ప్రకటించెను. కాని, అట్లుకాక అన్యథా జరిగినది! ఇది తెలుసుకొనిన తక్షణమే, చేసిన తప్పు అయ్యవారు దిద్దుకొనుటకు వ్రాసి ప్రకటనార్థము పంప సిద్ధపరచిన పత్రమే ఆ నాల్గవది; ఆతని స్వహస్త లిఖితము! తదుపరి మన్నాచేత చేయింపదలచిన హత్య కాశీ చేత చేయింప యత్నించెను. కాని పాపము, నా హృదయమును చీల్చివేయు ననుకొన్న కాశీచేతి చురకత్తి ఆతని హృదయమునే చీల్చివైచెను!! అట్లుకాక నేనే కాశీచే హత్యగావింపబడి యుండినచో, ఈ శూన్యపత్రముపై నేను వ్రాసినదే ఆతడు వ్రాసి ప్రకటనార్థము పంపియుండును. కాని, పాపము, విధివిధానము వక్రించినది! అయ్యో! ఈ యద్భుతి వ్యూహమును మీ రిప్పుడు గమనించితిరా?

నౌకాధిపతి :- ఆశ్చర్యము! జీవన్! ఇప్పుడు నాకంతయు సువ్యక్తమైనది. ఈ స్వల్పకాలములో మూడుసార్లు మా వార్తాహరుడు ఏవో ప్రధానపత్రములను తోడ్కొని ప్రత్యేక ధూమనౌకపై గోవా పోయియుండెను. ఆ ప్రధానపత్రము లీ పత్రికా ప్రకటనములే యని నే నిప్పు డూహించుచున్నాను. ఇంకొక ప్రధాన పత్రము నేడు కొనిపోవుటకు ప్రత్యేక నౌకతో వార్తాహరుని సిద్ధముగ నుంచుమని నా కాజ్ఞాపించి యున్నాడు.

జీవన్ :- ఆ ప్రధానపత్రము స్వహస్తలిఖితమైన తన నాల్గవ లేఖయే యని మీ రిప్పుడు గ్రహించియుందురు. నేనే కాశీచే హత్యగావింపబడి యుండినచో రేపే వేరొక ప్రధానపత్రము గోవాకు పోయియుండును.

నౌకాధిపతి :- అగును. నన్నే రేపు పోవుటకు సిద్ధముగ నుండుమనికూడ ఆజ్ఞాపించెను. — జీవన్! నీవు చాల యదృష్టశాలివి! హృదయపూర్వకముగ నేను నిన్నభినందించుచున్నాను. నీవింక నిర్భయముగ నుండుము. కాని, ప్రభుత్వాధికారము లేక స్వతంత్రముగ నేనేమియు చేయజాలనుకదా! ఈ విషయమంతయు ప్రభుత్వమునకు యథాతథముగా తెలియబఱచి నీకు స్వేచ్ఛ నిప్పింప యత్నించెదను. నేడే వార్తాహరుని పంపెదను. కాని, ప్రభుత్వాజ్ఞ వచ్చువఱకు నీవును రాణియు ద్వీపమును విడచి పోవుటకు వలనుపడదు. అంతవఱకును ఇచ్చట నీవు

నా కతిథిగా నుండుము. రాణి స్వేచ్ఛగ తన గృహ మునం దుండవచ్చును.

అని తక్షణమే నావయందున్న రాణిని సగౌరవముగ రాజభవనమును చేర్చుట కాజ్ఞాపించెను. కృతజ్ఞతాసూచక ముగ జీవన్ తలవంచి యంజలిమోడ్చి యచ్చట నుండి బయటకు వచ్చెను.

అ దేసమయమున సముద్ర వాహ్యాళికై శంకర్ బాజీ గోపీలను తోడ్కొనిపోయి యుండిన నావ నౌకాశ్రయ మును చేరుచుండెను. వారిని జూచినంత నే జీవన్ హృదయ ముప్పొంగిపోయెను. వారును ఆతని జూచి వడివడిగా నావ దిగి నౌకోపరిభాగమున కెగిరివచ్చి, యాతని తమ బాహు బంధములచే బంధించి తమ నివాసాగారమునకు దోడ్కొని పోయిరి. తదుపరి, జరిగిన యద్భుతోదంత మంతయు జీవన్ వలన విని ఆ ముగ్గురును ఆనందపారవశ్యమున చిందులు త్రొక్కిరి. వారి సంభాషణముల కా రాత్రి యంతయు చాలలేదు.

# అ ధ్యా య ము 19

మొరాకీ హత్యావృత్తాంతము తుపానువలె ద్వీపము నంతయు నుఱ్ఱూతలూచివైచెను. జరిగిన సమస్తోదంతమును వాయుతరంగములందు ప్రతిధ్వనించుచుండెను. ఏ నోట విన్నను 'జీవన్!'. ఏకంట జూచినను ఆశాజ్యోతి! ఏ మూల విన్నను హర్షధ్వానములు! ఆబాలవనితావృద్ధముగ ద్వీప మంతయును సముద్రఘోషమున మేళవించి యానంద గీతమును పాడుచున్నట్లుండెను. మొరాకీహత్యకు ఖేదపడు చున్న ప్రాణి యొక్కటియు నా ద్వీపమునందు లేదు. తెల్లవారినదో లేదో తండోపతండములుగా ప్రజలు రాజభవనము కడ మూగి, జయధ్వానములు చేయజొచ్చిరి. రత్నమాలాదేవి మేడదిగివచ్చి ద్వారముకడ నిలచి ఆ ప్రజా సంఘము గుప్పుచున్న యభినందనతుషారమునకు తలయొగ్గి యిట్లనెను.

"సోదరీ సోదరులారా! మీ యఖండప్రేమకు కృతజ్ఞు రాలను. కాని, మీ యభినందనములకు మాత్ర మింకను సమయము రాలేదు. ఇంకను నేను నిర్బంధమునందే యున్నానని మీరు గ్రహింపుడు."

ప్రజాసంఘ మంతయు నొక్కసారి నిశ్శబ్ద మయ్యెను. అంత వృద్ధపురోహితుడు, "అమ్మా! మొరాకీ మరణించిన పిదప ఇంకను నీకు నిర్బంధమేమి?" అని ప్రశ్నించెను.

"మొరాకీ మరణించెను కాని, ప్రభుత్వము మరణించ లేదుకదా? ప్రభుత్వాదేశమునకై నిరీక్షించుచు నౌకాధిపతి

నాకును జీవన్‌కును తాత్కాలిక స్వేచ్ఛను మాత్రమే ప్రసాదించినాడు." అని యామె ప్రత్యుత్తరమిచ్చెను.

"ఈ యస్వాతంత్రత కేవలము తాత్కాలికము. జేహో మాహో ప్రభుత్వాజ్ఞ వచ్చితీరును." అని యొక గంభీర కంఠ మొక మూలనుండి మ్రోగెను. ఇంతలో దూరమున రాజభవనాభిముఖుడై వడివడిగా వచ్చుచున్న జీవన్ ఆ ప్రజా సంఘముదృష్టి నాకర్షించెను. ఆతని జూచినంతనే యొక మూక సింహనాదమొనర్చుచు ఆతనికడ కేగి అమాంతముగ నాతని తమ భుజములపై నెక్కించుకొని జయజయ ధ్వానము లతో రత్నమాలాదేవి యొద్దకు తెచ్చిరి. ఒకప్పుడు విదేశీయుడు, ద్రోహి, చోరుడు, ఘాతుకుడు, అయిన జీవన్ ఇప్పు డా ద్వీపవాసు లందఱకును ఆరాధ్యదేవత! తమ్మును, తమ రాణిని, తమ ద్వీపమును మొరాకీ మారణాస్త్రముల నుండి రక్షించిన పరదైవతము! ఆ ప్రశంశానినాదముల మధ్య జీవన్ సగౌరవముగ రాణి కెదురేగెను. మందహాస వదనయై రత్నమాల యాతని నాహ్వానించెను. ద్వారము చెంత నిలచియున్న యా దివ్యమూర్తిద్వయమును చూచుచు ఉప్పొంగని హృదయము ఆ యశేష జనసంఘమునం దొక్కటియు లేదు. సువ్యక్తమగుచున్న ప్రజాభీష్టమును గుర్తించి రత్నమాలాదేవి ముక్తకంఠముతో నిట్లు పలికెను.

"మిత్రులారా! ఈ వఱకు చండీదివసమునాడు ఒకసారి మీ యందఱి సమక్షమునను జీవన్‌కు నేను నా హృదయము నర్పించితినని చెప్పియుంటిని. అది ఆ నా డాతని ప్రాణరక్షణ మునకై నేను చేసిన నటనయేకాని, సత్యము కాదని

యాతడు భావించెను. ఇంతవఱకును అది నిష్కపటమైన సత్యమని నేను సహిత మాతనితో చెప్పలేదు. ఇప్పుడు మీ యందఱి సమక్షమున అది సత్యము సత్యము సత్యము అని నే నాతనితో చెప్పుచున్నాను."

ఈ పల్కులను విని ప్రజాగణము హర్షధ్వానములను మిన్నుముట్టించెను. జీవన్ తలవంచుకొని యట్లే నిలచి యుండెను. అంత రాణి తిరిగి ప్రజాసంఘము నుద్దేశించి యిట్లు పలికెను.

"కాని, మిత్రులారా! మీ యానందమునకు కారణము లేదు. నేను ప్రేమించినది చేజిక్కని యాకాశకుసుమము! జీవన్ మనలను, మన ద్వీపమును కొనగలిగిన భాగ్యశాలి! నే నాతని సమక్షమున నొక నిరుపేద బాలికను! అయినను నే నాతని ప్రేమించుచుంటిని. జీవన్ మహోదార హృదయము నా నిష్కలుష ప్రేమను నిరాకరించునట్టిది కాదు. కాని, తన హృదయముపై ఈవఱకే అధికారము పొందిన యొకానొక స్త్రీ స్వదేశమునందు తనకై వేచుకొని యున్నది. నా నిమిత్తమై జీవన్ ఆమెకు ద్రోహ మొనర్చుట ఘాతుకకృత్య మగును. కావున, మిత్రులారా! ఇంక నన్ను మీ రభినందించవలదు."

అని యవరుద్ధకంఠముతో తన ప్రసంగమును ముగించి, తటాలున వెనుతిరిగి లోనికి బోయెను. ప్రజాసంఘము నిశ్చేష్టమయ్యెను. ఉత్సాహ సంరంభ మంతయు చప్పున చల్లారిపోయెను. వృద్ధపురోహితుని ముఖము కళావిహీన మయ్యెను. జీవన్ అచంచలమైన ముఖవైఖరితో

నట్లే నిలచి యుండెను. ఒక్కింతసేపు జనసమ్మర్దముతో కిటకిటలాడుచుండిన యా విశాల రాజభవన ప్రాంగణ మంతయు నిశ్శబ్దమయ్యెను. అంత నొక మూలనుండి గుసగుసలు ప్రారంభమయ్యెను.

"జీవన్ మన ద్వీపమును విడచిపోయినచో మరల నిచ్చట అశాంతి సంభవించుట రూఢి" అని యొక ప్రజా నాయకుడు కొంచెము బిగ్గఱగా యోచించెను.

"అవివాహితయై మనరాణి యుండిపోవుట నిజము" అని మరియొకడు పలికెను.

"ద్వీపమునం దశాంతి కలుగునను మిషతో ప్రభుత్వము మన రాణిని ద్వీపమునుండి సాగనంపుట తప్పదు" అని యింకొకడు నిరాశ వెల్లడించెను.

"అప్పు డెవ్వడో విదేశీయు డొకడు మనపై నధిపతిగా రుద్దపడును" మరియొక వృద్ధుడు జోస్యముచెప్పెను. ఇట్లు తల యొక యభిప్రాయమును వెలువరింపసాగెను. నాలుగయిదు నిముషములలో ఆ యావజ్జనసమూహమును అట్టుడుకిన ట్లుడుకజొచ్చెను. ఝుంకారములతో, హుంకారములతో, ఫూత్కారములతో వాతావరణమంతయు కంపింపజొచ్చెను. చూచుచుండగనే పూర్ణశోభావిలసితమై పద్మాకరమువలె ప్రశాంతమనోహరమై యుండిన ప్రజాగణము ఉద్రిక్తతరంగ సంక్షుభితమైన మహాసముద్రమువలె భయంకరమై గర్జింప జొచ్చెను. చూపుమాత్రమున యావత్ ద్వీపమును గజగజ వణకింపజాలిన మొరాకీకన్నులిపుడు మూతపడినవి. ఇంక నిర్భయము!

"చూచెదరేమి? నడువుడు. నౌకాశ్రయముకడకు నడువుడు. మనకు ప్రమాదహేతువు కాగల యా నౌకాధిపతిని సపరివారముగ చిత్రవధ చేయుదము. రండు. రండు." అని యొక గంభీరనాదము బయల్వెడలెను. ఉత్తరక్షణమే ఆ యుద్రిక్తప్రజావాహిని యొక్కుమ్మడిని వెనుతిరిగి సముద్రాభిముఖమై ప్రవహింప నారంభించెను. ఈ హఠాత్ సంఘటనమును జూచి జీవన్ విభ్రాంతుడై, విచలితుడై, ఉచ్ఛస్వరమున ప్రజాసమూహము నుద్దేశించి యిట్లనెను.

"మూర్ఖులారా! ఎచ్చటకు పోవుచున్నారు? సజీవముగ అగ్నిహోత్రమున ఉఱుకుటకు పోవుచున్నారా? ఆ పతాకనౌక నేమని భావించితిరి? అగ్నివర్షము కురిపించి సచరాచరముగ మీ యావద్ద్వీపమును క్షణమాత్రమున భస్మీభూతము చేయగల ఆ మృత్యుగహ్వరము నౌకోపరిభాగమున మీకు గోచరించుటలేదా? వలదు. వలదు. పోవలదు."

ఈ హెచ్చరిక దురాగ్రహోన్మత్తమైన యా ప్రజాసమూహముపట్ల నిష్ప్రయోజన మయ్యెను. ఈ సంరంభమును లోనుండి చూచుచుండిన రత్నమాల తటాలున మరల బయటకువచ్చి "జీవన్! జీవన్! ఈ మూర్ఖ ప్రజావాహిని నెట్లైన నరికట్టుము. వారి యాపదనే వారు కాన లేకున్నారు." అని ప్రార్థించెను.

జీవన్ :— దేవీ! దాని కొక్కటియే యుపాయము కలదు.

రాణి :— అది యేదైనను సరే వారి నటు పోనీయవలదు.

అంత జీవన్ మరల వారి నుద్దేశించి, "మిత్రులారా! మీ యజ్ఞానమున కేమనవలెనో తెలియకున్నది! క్షణ మాత్ర మాగి, ఒక్క ప్రశ్నకు సమాధానమిండు." అని బిగ్గఱగా పల్కెను.

గమనోన్ముఖమైన ప్రజావాహిని స్తంభించెను. అంతయు నిశ్శబ్దము. అంత జీవన్, "మిత్రులారా! రాణి పల్కిన మాటలను మాత్రము మీరు వింటిరి. ఆమె యభిప్రాయము లను మాత్రము మీ రాలించితిరి. ఆమె యభిప్రాయములు నాకు సంబంధించినవికదా? అందలి సారాసారములు సత్యాసత్యములు గ్రహించుటకు నా సమాధానమును సహి తము మీరు విననక్కఱలేదా?" అని ప్రశ్నించెను.

"చెప్పుడు." అని ఏకకంఠమున ఆ ప్రజాసమర్దము ఘోషించెను. అంత జీవన్,

"మిత్రులారా! ఎచ్చటనో యెవతెనో వివాహమాడ దలచి, జగదేకసుందరియైన మీ రాణిని నిరాకరించి, లక్ష్మీనిలయమైన మీ మనోహర ద్వీపమును విడచి వెడలి పోవునంతటి మూఢవ్యక్తి యనుకొంటిరా యీ జీవన్?" అని మందహాసముతో ప్రశ్నించెను.

ఆ మాటలు మంత్రాక్షతలవలె వారిని సోకెను. ఆ యుద్రేకమంతయు క్షణమాత్రమున చల్లారిపోయెను. ముడిపడియున్న ముఖము లన్నియు వికసించెను. తిరిగి యా సమస్త ప్రజాసంఘమును ఉత్సాహసంకుల మయ్యెను. "జై రాణీ రత్నమాలకు జై! జై ప్రభు జీవన్‌కు జై!" అను నాదములు మిన్నుముట్టెను.

" మిత్రులారా! మహానందముగ మీ మీ నివాసము లకు మరలిపొండు. అచిరకాలమునందే నౌకాధిపతి యనుగ్రహమున మన మందఱమును నిరాపదులమై సుఖింప గలము." అని జీవన్ వారికి నచ్చజెప్పెను. జయజయ ధ్వానము లొనర్చుచు ప్రజాసమూహము చెదరిపోయెను. తాను లోనికి బోయెను

సహజ సుందరమైన రత్నమాల ముఖఫలకము ఛాయాగ్రస్తమై యుండెను.

" దేవీ! ఇట్టి సంతోష సమయమున నీ ముఖము వివర్ణమై యున్న దేమి?" అని యాత డామెను ప్రశ్నించెను.

లేనియానందమును ముఖమున ప్రదర్శించుచు రత్నమాల యాతనితో నిట్లనెను.

" జీవన్! నీ యుదార హృదయమునకు సహస్ర నమస్కారము లర్పించుచున్నాను. ఈ క్షుద్రప్రాణి నిమిత్తము నీవు నీ ప్రాణములను పణము జేసితివి. నీ యమూల్య జీవనమును కష్టనిష్ఠురములపా లొనర్చితివి. తుదకు నాకై తాత్కాలికముగ ఆత్మవంచనము సహిత మొనర్చితివి. ఎన్ని జన్మములకైనను నేను నీ ఋణమును దీర్చుకొనజాలను. ఇంకను నా దొక ప్రార్థనము కలదు.

జీవన్:- ఏమది ?

రాణి:- ఇంక నే నీ ద్వీపమునం దుండజాలను. నీతో నన్ను సహితము ఇచ్చటనుండి తోడ్కొనిపొమ్ము. నీకు నేనెట్టి శ్రమయు కలిగింపను. మీ దేశమునందు

ఏ పల్లెయందో, ఏ నగరమునందో, నన్ను విడచి వేయుము. సన్యాసినినై భిక్షాటన మొనర్చుకొని జీవించెదను.

జీవన్:- దేవీ! నీ వీ ద్వీపమునం దుండజాలక పోవుటకు కారణము?

రాణి:- ఇప్పుడిప్పుడేకదా యీ ద్వీపవాసులను మనము మోసము చేసితిమి? మన వివాహము నిశ్చయమైన దని మహానందమున ప్రజలందఱును మఱలిపోయిరి. ఇది కేవలము నటనయని నేడు కాకున్న రేపైనను గ్రహింపకపోరు. అప్పుడు నా లజ్జావిహీన ముఖమును వారి కెట్లు చూపుదును?

జీవన్:- (మందహాసము చేయుచు) దేవీ! ఇది కేవలము నటన యనియే నీవు భావించితివా? అట్లైన చండీ దివసమునాడు నీవు ప్రదర్శించిన ప్రేమకూడ నటన యనియే నేను భావించెదను.

ఈ వాక్యములు చెవిని సోకినంతనే రత్నమాల దిగ్భ్రమ చెందెను. అప్రయత్నముగ ఆమె ముఖపద్మము వికసించెను. నేత్రోద్గతములగుచున్న విద్యున్మయూఖములందు తళుక్కు తళుక్కుమనుచు ధారాపాతముగ ఆనందాశ్రువులు చెక్కిళ్లపై ప్రవహింపజొచ్చెను.

"జీవన్! జీవన్! నీవు సత్యము పల్కితివా? అది నటనకాదా? నటనకాదా?" అని యామె యుద్వేగ పరవశయై ప్రశ్నించెను.

జీవన్ :— దేవీ ! చండీదివసమున, ఏ క్షణమున "ఆతని నేను ప్రాణాధికముగ ప్రేమించుచున్నాను ; ఆతడు మరణించిన మరుక్షణమున నేను ప్రాణత్యాగము చేసెదను" అను వాక్యములు నీ నోట వెల్వడినవో, ఆ క్షణమే నేను నా మనఃప్రాణ సర్వస్వమును నీ కంకిత మొనర్చితిని. ఇప్పుడు నాది నటన యెట్లగును? దేవీ ! నాడు రహస్యముగ నా హృదయమును ఆత్మసాక్షిగ రత్నమాలార్పణ మొనర్చితిని. నేడు ప్రత్యక్షముగ, నీ యధీనము జేయుచున్నాను.

రత్న :— ధన్యనైతిని ! ధన్యనైతిని ! ఇంక జీవనమైనను మరణమైనను నాకు స్వర్గప్రాయమే ! చండీదివసము నాడు తొలిసారి నీ కాత్మార్పణ మొనర్చితిని. తిరిగి నేడు యావత్ ప్రజాసన్నిధానమున పునరుద్ఘాటించితిని. మరల నిప్పుడు భగవత్ సన్నిధానమున నీ పదముల చెంత నా నిష్కలుష హృదయమును నీ కర్పించుచున్నాను. స్వీకరింపుము.

అని యాతని పాదములపై వ్రాలెను. జీవన్ ఆమెను లేవనెత్తి యాలింగన మొనర్చుకొనెను.

# అధ్యాయము 20

మూడు దినములు గడచిపోయెను. జీవన్ మిత్రులతో నౌకావాసమే చేయుచుండెను. కాని, ప్రతిదినమును రాజ గృహమునకు బోయి రత్నమాలను జూచివచ్చుచుండెను. నాల్గవనాడు సూర్యోదయానంతరము గోవాకు పోయి యుండిన ప్రత్యేక ధూమనౌక ప్రభుత్వాజ్ఞాపత్రములను తోడ్కొని తిరిగివచ్చెను. ఆ పత్రములను జూచుకొని నౌకాధిపతి తక్షణమే జీవన్‌కు కబురంపెను. కించిన్మాత్ర మైనను సంశయభావము లేకుండినను మానవ సహజమైన యావేగముతో జీవన్ నౌకాధిపతి యెదుట ప్రత్యక్ష మయ్యెను. ఆతని వెనుక నాతని మిత్రత్రయముకూడ నుండెను. నౌకాధిపతి మందహాసము చేయుచు ఆ ప్రభుత్వా జ్ఞను జీవన్‌చేతి కందిచ్చెను. అం దిట్లుండెను.

" యావద్విషయమును ప్రభుత్వము సావధానముగ పరిశీలించినది. రాజప్రతినిధియైన మొరాకీహత్య సవ్యమే కాక అనుభవయోగ్యమైనదని కూడ ప్రభుత్వము భావించు చున్నది. అనన్యసామాన్యములైన జీవన్‌లాల్ ధైర్య సాహసముల నభినందించుచున్నది. తక్షణమే జీవన్‌లాల్ కును రాణికిని సంపూర్ణ స్వేచ్ఛ నొసంగి ద్వీపాధిపత్యమును వారి కప్పజెప్పి, ద్వీపవాసు లెల్లరకును అభయమొసంగి తిరిగి రావలయును."

ఈయాజ్ఞాపత్రమును చదివి జీవన్ ఆనందాతిశయమున నౌకాధిపతితో, "ఆర్యా! ఇదియంతయు మీ కృప" అని యభివందన మొనర్చెను.

"నా కృపయేమి? భగవంతుని కృపయనుము. రమ్ము, స్వయముగపోయి ఈ సంతోషవార్త రాణికి తెలియజేయ గోరుచున్నాను."

అని తక్షణమే నౌక దిగి, సపరివారముగ రాజగృహాభిముఖముగ నడువసాగెను. మార్గమున కుతూహల ప్రేరితులైన ప్రజలు గుంపులు గుంపులుగా నాతనివెంట నడచిరి. మొరాకీ కరాళముఖదర్శనమున బిలములయందెలుకలవలె దాగుచుండిన యా ద్వీపవాసులకు, ఈ నౌకాధిపతి ప్రసన్నవదనము ఆశాద్యోతకమై యాకర్షణహేతువై యుండెను. సగౌరవముగ నిశ్శబ్దముగ తనవెంట వచ్చుచున్న జనబాహుళ్యమునుజూచి యా నౌకాధిపతి జీవన్‌తో, "అయ్యా! ఈ ద్వీపవాసులు మూర్ఖులనియు అనాగరకులనియు మొరాకీ యేల భావించెనో నాకు తెలియకున్నది!" అని మెల్లగా పల్కెను.

"ఆర్యా! ఇంత దేశభక్తిపూరితమైన జాతిని నేను చూచియుండలేదు. దేశస్వాతంత్ర్యమునకై యెట్టి యనాగరక కార్యమునకైనను వీరు సిద్ధపడుదురు. మొరాకీ వీరి బహిఃప్రవర్తనమే చూచుచుండెనుగాని వీరి యంతరంగమును గమనించియుండలేదు." అని సమాధానమిచ్చెను.

మేడపైనుండి యీ దృశ్యమును జూచి రత్నమాల పడిపడిగా మేడ దిగివచ్చి ద్వారముకడ నౌకాధిపతికి స్వాగత

మిచ్చెను. అంత నౌకాధిపతి యామెతో, "దేవి! ప్రభుత్వము నీకును జీవన్ కును సంపూర్ణ స్వేచ్ఛ నిచ్చినది. ఇదిగో, ఆజ్ఞాపత్రము." అని యా పత్రమును బిగ్గఱగా చదివెను. నిశ్శబ్దముగ ప్రత్యేకాక్షరమును వినుచుండిన ప్రజాసమూహ మంతయు చదువుట ముగిసినంతనే భూమి కంపించునట్లు హర్ష ధ్వానము లొనర్చిరి.

నౌకాధిపతి:—అమ్మా! నిన్నును నీ ప్రజలైన యీ ద్వీపవాసుల నందఱను నేను హృదయపూర్వకముగ నభినందించు చున్నాను. వీరోత్తముడైన యీ జీవన్ నీకు భర్త కానున్నాడని విని మహానందమును పొందితిని. మీ యిర్వురి యాధిపత్యమున ఈ హంసద్వీపము సౌఖ్య సంపద్విలసితమై యలరారుగాక యని యాశీర్వదించు చున్నాను.

రాణి:- ఆర్యా! తమ యనుగ్రహమున మే మందఱమును ధన్యులమైతిమి. మా కృతజ్ఞత నెట్లు తెలుపవలయునో నాకు తోచకున్నది.

నౌకాధిపతి:- అమ్మా! కృతజ్ఞతకు నేను మీకు చేసిన దేమి? దైవాయత్తముగ ధర్మమునకే జయము కల్గినది! నిశ్చింతగ నుండుడు. ఇంక నాకు సెలవిమ్ము. నేడే మీ ద్వీపమును విడిచిపోవుచున్నాను.

అని యథాయోగ్యముగ అందఱి మన్ననలను బడసి నౌకాభిముఖుడయ్యెను. యావజ్జనసంఘమును ఆతని నౌకాశ్రయమువఱకు సగౌరవముగ సాగనంపి మఱలివచ్చిరి.

సాయంకాలమగుసరికి ద్వీపమంతయు నూతనశోభ దాల్చెను. ప్రతి గృహద్వారమును తోరణాలంకృత మయ్యెను. ప్రతి గృహోపరిభాగమునను వర్ణవర్ణ పతాకము లెగురుచుండెను. ప్రతియింటి ముంగిలియు మువ్వన్నె ముగ్గులతో ముచ్చట గొల్పుచుండెను. రాజమార్గ మంతయు పుష్పతోరణములతో కలకల లాడుచుండెను. వాడ వాడను వాద్యసంగీతనాదములు కర్ణపర్వ మొనర్చుచుండెను. ఒక పెద్ద జనసమూహమును వెంటబెట్టుకొని గీతావాద్యములతో రాజపురోహితుడు రాజభవన ద్వారముకడకు బోయి, యభ్యుద్ధాన మొనర్పవచ్చిన రత్నమాలా జీవనులకు పుష్ప దామము లర్పించి, నొసట కుంకుమబెట్టి, హారతులిచ్చి, "శీఘ్రమేవ వివాహసిద్ధిరస్తు!" అని యాశీర్వదించెను.

తమరాణి వివాహమహోత్సవము తమ ద్వీపమునందే జరుగవలయునని ద్వీపవాసు లందఱును అభిలషించిరి. కాని, జీవన్ స్వస్థానమైన బొంబైనగరమునందు స్వగృహమునందామహోత్సవము చేసుకొనదలచి ప్రజల యంగీకారమును బడసెను.

తదుపరి సర్వసన్నాహము లొనర్చి యా మూడవ నాడే రత్నమాలాసహితముగ, మిత్రత్రయ సహితముగ సమలంకృతమైన యొక ప్రత్యేక నౌకపై బయలుదేరి బొంబై చేరుకొనెను. అచ్చట తన రాకకై వేచుకొనియున్న మిత్రసంఘము మహానందముతో నాతనికి స్వాగత మిచ్చెను. మూడు దినములవఱకు హంసద్వీప విశేషములను బంధు మిత్రులకు వివరించుచు శంకర్ నోరు మూతబడలేదు.

సుముహూర్తము నిర్ణయింపబడి స్వగృహము నందు రత్నమాలా జీవనుల వివాహమహోత్సవము మహా వైభవముతో జరిగెను.

అనంతర మా నూతన వధూవరులు యావద్భారత దేశమునందలి మహానగరము లన్నియు పర్యటించి, తమ ప్రభుత్వ స్థానమైన గోవా నగరమును చేరుకొని, యచ్చటి ప్రభుత్వోద్యోగుల మన్ననలంది, తిరిగి హంసద్వీపమునకు బయలుదేరిరి. వారిరాక ముందుగనే ద్వీపవాసుల కెఱిగింపబడుటచే, వారినౌక చేరుసరికి హంసద్వీపమునందలి నౌకాశ్రయమంతయు జనసమూహముచే కిటకిట లాడుచుండెను. నౌకపైనుండి వారు దిగినంతనే వారిపై పుష్పవర్షము కురిపించి, సహస్ర హారతు లిచ్చి, జయజయ ధ్వానము లొనర్చిరి.

ఈ మహోత్సవ మంతయు జూచునప్పుడు జీవన్ అంతర్నేత్రమునకు తాను తొలిసారి యీ ద్వీపముపై నడుగు పెట్టిననాటి దృశ్య మొక్కసారి గోచరించెను. ఆ తీవ్ర దృష్టు లిప్పుడు లేవు. భయ సంశయాకులములైన ఆ వివర్ణ ముఖము లిప్పుడు లేవు. కోరమీసములతో ఘుర్ఘుర భాషణములతో కొఱకొఱలాడుచు నిలచియుండిన ఆ లంబోదరుడు వర్ధన్ ఇప్పుడు లేడు. హృదయవిదారకమైన యీ వాతావరణ మిప్పుడు లేదు. అది యంతయు జ్ఞప్తికి దెచ్చుకొని జీవన్ తనలో తా నొకసారి నవ్వుకొనెను. పిమ్మట ఆ యఖండ ప్రజాసన్మానమును స్వీకరించి, ప్రత్యేకముగ నిర్మింపబడిన యొక పుష్పశకటముపై రత్నమాలాసమేత

ముగ నాసీనుడై, ఆ సమగ్ర జనసంఘమును నృత్యగీత వినోదములతో ముందు వెనుకల నడువ రాజగృహమును చేరుకొనెను. అచ్చట సతీసమేతముగ జీవన్ ద్వారముకడ నిలచి రాజపురోహితు నాశీర్వాదమును బడసి, కృతజ్ఞతా సూచకముగ తలవంచి యా జనసముదాయము నుద్దేశించి,

"మిత్రులారా! జీవన్ జీవన తేజమైన ఈ రత్నమాల మీకు రాణి! నేను కేవల మామె పాణిగ్రహించిన మీ సేవకుడను. ద్వీపాధిపత్యము నర్పించుచు ఈమెకు నేను వ్రాసియిచ్చిన పత్రము మీకు జ్ఞప్తియందున్నదా?" అని ప్రశ్నించి హసించెను.

అంత రత్నమాల చకితయై రివ్వున లోనికిపోయి, రెండునిముషములలో నొక పత్రముతో మఱలివచ్చి, ఆ పత్రము పైకెత్తి ప్రజలకు జూపి, "ఇదిగో, ఆ దానపత్రము! మిత్రులారా! మీ యందఱి సమక్షమున తిరిగి దీనిని ఎవ్వరి కిచ్చివేయుచున్నానో చూడుడు." అని యా పత్రమును జీవన్ చేతులయందు బెట్టి నమస్కరించెను.

వాతావరణము నదలించుచు ప్రజాసంఘమంతయు నొక్కపెట్టున కరతాళధ్వను లొనర్చిరి. ఆ హర్షనాదములు చెలరేగుచుండగనే ఆ నూతన వధూవరులు గృహప్రవేశ మొనర్చిరి.